

# మంచి వ్యక్తి అయితే ఓకె!

## -పూజా హెగ్డే

**'గో'పికమ్మా చాలును లేమ్మా' అంటూ తెలుగువారిని మురిపించి మెప్పించిన పూజా హెగ్డే గుర్తుంది కదా! కోలీవుడ్‌లో కెరీర్ మొదలెట్టి టాలీవుడ్‌లో వెంట వెంటనే రెండు సినిమాలు చేసేసి అంతే స్పీడులో బాలీవుడ్‌కి ఎగిరిపోయింది ఈ సన్నజాజి సుందరి. బాలీవుడ్‌లో తొలి ప్రయత్నంలోనే ఓ పెద్ద స్టార్‌తో ఓ పే...ద్ద సినిమాతో ఎంట్రీ ఇచ్చింది. ఈ సినిమా కోసం తెలుగులో మంచి అవకాశాలను కూడా వద్దనుకుంది. దాదాపు ఏడాదిన్నరకుపైగా ఈ సినిమా కోసం కష్టపడిన పూజా ఇప్పుడు రిలాక్స్ అవుదామనుకుంటోంది. ఎలా రిలాక్స్ అవుదామనుకుంటోందో పూజా మాటల్లోనే...**

---

**'మొహెంజోదారో' నిరుత్సాహ పరిచినట్టుంది?**

చాలా మంచి సినిమా. చారిత్రాత్మక సినిమాలు ఎప్పుడూ రావు. మొహెంజోదారో సంస్కృతిని తెలియజెప్పడానికి జరిగిన ప్రయత్నం ఇది. సగటు ప్రేక్షకులకీ, మాస్ ప్రేక్షకులకీ ఇలాంటి సినిమాలు అంత త్వరగా నచ్చవు. ఈ కారణంగానే మంచి సినిమా అయినా ప్రజాదరణ పొందలేక పోయిందనుకుంటున్నాను.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

రణబీర్‌తో చేసిన యాడ్ చూసిన అశుతోష్ సార్ మిసెస్ నేనయితే ఈ సినిమాకి సరిగ్గా సరిపోతానని చెప్పడంతో ఆడిషన్‌కి పిలిచారు. ఆడిషన్‌కన్నా ముందే వాళ్ళు నన్ను ఫిక్స్ అయినట్టున్నారు. కానీ నాకా సంగతి తెలియదు. సెలెక్ట్ అవుతానో లేదో అని తెగ టెన్షన్ పడ్డాను. సెలెక్ట్ అయిన విషయం తెలిసిన తరువాత ఎంత హ్యాపీగా ఫీలయ్యానో చెప్పలేను. ఇంటికి వెళ్ళి మా మదర్‌ని గట్టిగా కౌగిలించుకుని నాకు వచ్చిన అవకాశం గురించి చెప్పాను. తను కూడా చాలా సంతోషించింది. తప్పకుండా ఈ సినిమా చేయమని చెప్పింది. సినిమా ఫలితం ఎలా ఉన్నా, పూర్తి సంతృప్తినిచ్చిన సినిమా ఇది.

**ఈ సినిమాలో బాగా కష్టపడిన సందర్భం?**

డ్యాన్సుల విషయంలోనే కష్టపడ్డాను. హృతిక్‌తో సమానంగా డ్యాన్స్ చేయడం చాలా కష్టమనిపించింది. ముందురోజు ఎంత ప్రాక్టీసుచేసినా సెట్‌లో హృతిక్ వేగం చూసేసరికి ప్రాక్టీస్ అంతా మరిచిపోయేదాన్ని. తనతో సమానంగా డ్యాన్స్ చేయడం చాలా కష్టం. సినిమా కోసం దాదాపు ఏడాదిన్నరపాటు కష్టపడ్డాను. ఇప్పుడు కొద్దిగా రిలాక్స్ అవ్వాలని ఉంది. దాని కోసం ఎక్కడికీ వెళ్ళనుకానీ, కుటుంబంతోనే కొన్నిరోజులు సరదాగా గడుపుతాను.



**ఈ సినిమా కోసం తెలుగులో అవకాశాలను వద్దనుకున్నారట కదా?**

నిజమే! ఈ సినిమాకి చాలా రోజులు కేటాయించాల్సి వచ్చింది. ఆ సమయంలోనే తెలుగు నుంచి రెండు మూడు ఆఫర్లు వచ్చాయి. ఆ సినిమాలు ఒప్పుకుంటే ఈ సినిమాకు న్యాయం చేయలేనని వాటిని కాదనుకున్నా.

**ఇప్పుడు చేస్తారా మరి?**

డేట్లు కుదరక అప్పుడు వద్దనుకున్నాను. కానీ, తెలుగులో చేయనని ఎప్పుడూ చెప్పలేదు. హీరోయిన్‌గా నాకు గుర్తింపు వచ్చింది టాలీవుడ్ ద్వారానే. తెలుగులోనే కాదు, దక్షిణాదిన ఏ భాషలో అవకాశం వచ్చినా వదులుకోను.

**ఓ స్టార్ హీరోతో ప్రేమలో పడ్డారని అంటారు నిజమేనా?**

దీనికి గతంలోనే సమాధానం చెప్పాను. బాలీవుడ్‌లోనే కాదు, ఇతర భాషల హీరోలతో ఎవరితోనూ ప్రేమలో పడలేదు. ప్రేమకు వ్యతిరేకిని కాను. సరైన వ్యక్తి దొరికితే అతన్ని ప్రేమించడానికీ, అతనితో డేటింగ్ చేయడానికీ నాకెలాంటి అభ్యంతరం లేదు. ఇంత వరకూ నాకు అలాంటి వ్యక్తి తారసపడలేదు. దానికి ఇంకా సమయముంది.

**మీ గురించి ఇతరులకు తెలియని విషయాలు?**

చాలానే ఉన్నాయి. చిన్నతనంలో టామ్ బాయ్ తరహాలో ఉండేదాన్ని. ఎప్పుడూ నిక్కర్లు, షర్టులు వేసుకునేదాన్ని. బాబ్ హెయిరే ఉండేది. టెన్త్ క్లాసు వరకూ అలాగే ఉండేదాన్ని. టెన్త్ నుంచి నా డ్రస్సింగులో మార్పు రావడం మొదలైంది. అలా ఎందుకు మారానో నాకే తెలియదు. చిన్నతనంలో నన్ను చూసిన వారు నేను హీరోయిన్ అవుతానని ఎప్పుడూ ఊహించి ఉండరు. అంతదాకా ఎందుకు మా ఇంట్లో వాళ్ళే నేను హీరోయిన్ అయ్యానంటే నమ్మలేకపోయారు.

-భరత్ కుమార్



## సరదాగా

### పంక్చర్

చిన్నోడు: అన్నయ్యా! నీళ్ళల్లో తల ముంచుతున్నావెందుకు?

పెద్దోడు: ఈ మధ్య నా మైండ్ సరిగా పని చేయడం లేదని చాలామంది అంటున్నార్రా! ఎక్కడైనా పంక్చర్ అయ్యిందేమోనని చూసుకుంటున్నా!

చిన్నోడు: అయితే తొందరగా కానియ్, నేను కూడా చూసుకోవాలి.

### ఒక ప్రశ్న?

వేణుమాధవ్‌కి ఆ రోజున షూటింగ్ ఏమీ లేదు. సరదాగా ఎటైనా వెళ్ళి, రోడ్లన్నీ తిరిగి కాలక్షేపం చేయాలనుకున్నాడు. అలా బైట స్వేచ్ఛగా తిరిగితే అభిమానులు వదలరు. పోనీ దూరప్రాంతానికి వెళదామంటే, తరువాతి రోజు సినిమా షూటింగ్ ఒకటి ఉంది. ఎవరూ గుర్తు పట్టకుండా బయట ఎలా తిరగాలా? అని ఆలోచించసాగాడు వేణుమాధవ్. రక్కున బుర్రలో ఫ్లాష్ వెలిగింది. ఏదో సినిమాలో బురఖా వేసుకుని రోడ్లమ్మట తిరుగుతూ అమ్మాయిలను ఏడిపించడం గుర్తొచ్చింది. అంతే! బురఖా వేసుకుని, అమ్మాయిలా నడుస్తూ బయటపడ్డాడు. బయటపడ్డాడు సరే, ఎటు వెళ్ళాలి? ఏం చేయాలి? ఆలోచిస్తూనే, చుట్టూ చూస్తూ వెళ్తున్నాడు. దూరంగా ఎగ్జిబిషన్ కనబడింది. ఇంకేం, అందులో దూరిపోయాడు. జెయింట్‌వీల్ ఎక్కాడు. వీడియోగేమ్స్ ఆడాడు. తనకిష్టమైన పావ్‌బాజీ తిన్నాడు. దాదాపుగా ఎగ్జిబిషన్‌లో చూడాల్సినవన్నీ చూసేశాడు. ఆడాల్సినవన్నీ ఆడేశాడు. ఇక వెళ్దామనుకుంటుండగా, ఒక పక్కగా "ద మిరాకిల్ ట్రూత్" అనే బోర్డ్ ఒకటి కనిపించింది. ఇంటరెస్టింగ్ అనిపించి లోపలికి వెళ్ళి 'ఏమిటీ మిరాకిల్ ట్రూత్' అని అడిగాడు. లోపలున్న వ్యక్తి "ఏం లేదండీ, మీరు కళ్ళు మూసుకోండి చాలు. మీరు ఏం మాట్లాడకుండానే, మీ పేరుని తప్పులు లేకుండా, కరెక్ట్‌గా రాస్తాను. నేను కరెక్టుగా రాస్తే మీరు నాకు పదివేలు ఇవ్వాలి. లేదంటే నేనే మీకు ఇరవైవేలు ఇస్తా" అన్నాడు. 'ఇదేదో బాగానే ఉందే!' అనుకొని, సరే అన్నాడు వేణుమాధవ్. కళ్ళు మూసుకున్నాడు. ఆ వ్యక్తి పేపరు మీద ఏదో రాశాడు. కళ్ళు తెరవమని చెప్పి, 'మీ పేరు కరెక్టో కాదో చూసుకోండి' అన్నాడు. పేపర్ మీద చూస్తే పేరు కరెక్ట్‌గానే ఉంది. బోరు మంటూ పదివేలూ సమర్పించుకున్నాడు వేణు మాధవ్. ఇంతకీ వేణుమాధవ్ అమ్మాయి వేషంలో ఉన్నాడు కదా! మరి అతడి పేరు ఆ వ్యక్తికి ఎలా తెలిసింది? ఇదీ ప్రశ్న. ఆలోచించండి.

-యండమూరి వీరేంద్రనాథ్

[illegible]

[illegible]

# అడపా దడపా నవ్వబ్బా

Jayadev




## కొమ్మ కొమ్మకో బొమ్మ

మెక్సికోలో అదో చిన్న దీవి. అరవైయేళ్ళుగా ఆ అడవిలోని చెట్లకు వేలాది బొమ్మలు వేలాడుతున్నాయి. వాటి తలనుంచి రక్తం కారుతోంది, అవి గొణుగుతూ మాట్లాడుతున్నాయి! అవన్నీ దయ్యాలా? అసలా బొమ్మలు ఎక్కడ నుంచి వచ్చాయి? ఆ దీవిలో ఏం జరుగుతోంది?

**8**

### డాగ్ లవర్స్‌కి లవ్లీ ప్లానింగ్

కుక్కను పెంచుకోవాలనుకుంటున్నారా? అయితే బడ్జెట్ ప్లానింగ్‌తో పాటు, ఎలాంటి కుక్కను పెంచుకోవాలనే విషయాలపై మీకు అవగాహన ఉండాల్సిందే.

**72**

### ఇంటర్వ్యూ

హీరో చుట్టూ కథ అల్లి, గ్లామర్‌ని నమ్ముకున్నందువల్లనే ఎక్కువ సినిమాలు ఫ్లాప్ అవుతున్నాయంటున్నారు రంగస్థల సినీ నటుడు కాకరాల.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: హన్సిక


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### జవాబు దొరకని ప్రశ్నలు

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: కరెక్టే! ఉన్నావు.
భార్య: పిచ్చిపిచ్చిగా మాట్లాడకండి! మీతో మాట్లాడాలంటేనే నాకు అసహ్యంగా ఉంది.

•••

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: నువ్వా? లావా? లేవే!
భార్య: ఏయ్! అబద్ధం! మీరు పెద్ద అబద్ధాలకోరు.

•••

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: ఉన్నావా? ఏమో....
భార్య: ఏదీ అడిగిన వెంటనే చెప్పలేరేం? మాటే చెప్పలేని మీరు ఆఫీసులో అంతంత డెసిషన్స్ ఎలా తీసుకుంటున్నారో!

•••

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: తెలీదు
భార్య: కనిపించడం లేదా? కళ్ళు పోయాయా?

•••

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: అది ఎలా చెప్పను? నువ్వు ఎలా ఉన్నావంటే...
భార్య: ఎవరితోనో పోల్చి చెప్పొద్దు. నాకలాంటివి నచ్చవు. మీరూ...మీ బుద్ధీ....

•••

భార్య: నేను కొంచెం లావుగా ఉన్నాను కదా?
భర్త: మౌనం వహించాడు. సమాధానం లేదు అతని దగ్గర నుంచి.
భార్య: ఏమైంది మీకు? చెవుడొచ్చిందా?

భార్యలడిగే కొన్ని ప్రశ్నలకు భర్తల దగ్గర సరైన సమాధానాలు ఉండవు. అప్పుడు వారేం చెయ్యాలంటే... యాహూనో, గూగుల్‌నో ఆశ్రయించాలి. తప్పదు.

### ఏం చేస్తాను?

రాత్రి పన్నెండైంది. ప్రియురాలికి ఫోన్ చేశాడు ప్రేమికుడు. అడిగాడు.

"ఏం చేస్తున్నావు హనీ?"

"ఏం చేస్తాను. ఇంతవరకూ చదివి చదివి, కాళ్ళు పీకుతున్నాయంటే అమ్మకి కాళ్ళు పట్టి, ఇప్పుడే నిద్ర పోదామనుకుంటున్నాను." అంది ప్రియురాలు. ఆవలింత కూడా తీసింది.

"నువ్వేం చేస్తున్నావు స్వీట్‌హార్ట్?" అడిగింది.

"ఏం చేస్తాను. క్లబ్బులో మధుగాడి ఒళ్ళో కూర్చుని వాణ్ణి నువ్వు కిస్ చేస్తోంటే నీ వెనకే నిలబడి చూస్తున్నాను." అన్నాడు ప్రియుడు.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 26

31-8-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# వాణీమహల్

వాణీమహల్ ఎక్కడని అడుగుతారేంటి? ఆ మాత్రం తెలీదా? రథంవీధి ఉందా? ఆ వీధి ఆ చివరి వరకూ వెళితే అయిదు అంతస్తుల భవనం ఒకటి కనిపిస్తుంది. అదే వాణీమహల్. వాణీమహల్ అంటే సినిమాహాలు అనుకుంటున్నారేమో! కాదు. అదో పెద్ద లైబ్రరీ! అయిదు అంతస్తుల్లోనూ అయిదు భాషల సాహిత్యం ఉంటుందక్కడ. ఒక్కో అంతస్తులో ఒక్కో భాషకు సంబంధించిన సాహిత్యం దొరుకుతుంది. మొదటి అంతస్తులో తెలుగుసాహిత్యం ఉంటుంది. రెండో అంతస్తులో సంస్కృత సాహిత్యం ఉంటుంది. మూడో అంతస్తులో హిందీ సాహిత్యం ఉంటే, నాలుగులో అంతస్తులో ఇంగ్లీషు సాహిత్యం ఉంటుంది. అయిదో అంతస్తులో తమిళమో కన్నడమో...సరిగ్గా తెలియదుగానీ, ఈ రెండింటిలో ఏదో ఒక సాహిత్యం ఉంటుంది. పొద్దున తొమ్మిదిగంటల నుంచి రాత్రి తొమ్మిదిగంటల వరకూ వాణీమహల్ తెరిచే ఉంటుంది. సభలూ సమావేశాలూ చదువులూ ఎప్పుడూ మహలంతా కోలాహలంగా ఉంటుంది. ఇంత చిన్న ఊరిలో అంత పెద్ద లైబ్రరీ ఏమిటని ఆలోచిస్తున్నారా? దానికి ఓ కథ ఉంది.

బొబ్బిలిరాయుడుగారు తెలుసుకదా? ఆ రాయుడుగారు ఒకసారి ఈ ఊరొచ్చారు. అప్పటికి వారికింకా పెళ్ళి కాలేదు. ఈ ఊరి ఆలయంలో సీతారాముల్ని దర్శించుకుంటే పెళ్ళవుతుందని, సీతమ్మలాంటి భార్య దొరుకుతుందని ఎవరో చెబితే పల్లకీలో వచ్చారాయన. కోనేరుగట్టు మీద నుంచి మందీమార్బలంతో వస్తున్నారు. వస్తూంటే...పల్లకీలో కూర్చున్న వారి ఒడిలో నేరేడుగింజ వచ్చి పడింది. ఎంగిలిగింజ! విసిరింది ఎవరా? అని పల్లకీ తెర తొలగించి చూశారాయన. చూసి ఆశ్చర్యపోయారు. ఎవరో అమ్మాయి! అందంగా ఉంది. లంగా ఓణీ బుట్టజాకెట్లో బొమ్మలా ఉంది. చెట్టుకింద రాలిపడిన నేరేడుపళ్ళు ఏరుకుంటూ, తింటూ ఎంగిలిగింజల్ని విసురుతోంది. ఏయ్ పిల్లా అని పిలిచారు రాయుడుగారు. ఏం పిల్లాడా? అని పలికింది బొమ్మ. నీ పేరేంటి? అడిగారు. వాణి అంది బొమ్మ. పల్లకీ ఎక్కుతావా? అడిగారు రాయుడుగారు. పెళ్ళిపల్లకీ అయితే ఎక్కుతాను అంది బొమ్మ. అని అక్కణ్ణుంచి పరుగుదీసింది. అంతలోనే వెనక్కి తిరిగి వచ్చి, చెట్టుకింద దొంతిగా పెట్టిన పుస్తకాలను పట్టుకుని మళ్ళీ పరుగుదీసింది. ఆ పరుగులో ఓ పుస్తకాన్ని జారవిడుచుకుంది. దాన్ని అందుకుని చూశారు రాయుడుగారు. మనుచరిత్ర. పిల్లకి ప్రబంధసాహిత్యంతో పరిచయం ఉందే అనుకున్నారు. అందుకే ఆ అల్లరి అని నవ్వుకున్నారు.



సీతారాముల్ని దర్శించుకుని తిరిగి వెళ్ళిపోతున్నారు రాయుడుగారు. ఎవరో వెంట తరుముతున్నట్టుగా పరుగున వచ్చి రాయుడుగారిని ఢీకొంది వాణి. అప్పుడు ఆమె చేతిలోని శృంగారనైషధం పుస్తకం అతని కాళ్ళ మీద పడింది. తీసి అందించినా అందుకోకుండా, పిలిచినా పలకకుండా పరిగెత్తి పారిపోయింది వాణి. అప్పుడు ఆరా తీశారు ఆమె గురించి. తీస్తే తెలిసిన వాళ్ళ పిల్లే! మంచి సంబంధమే! మొహమాటపడలేదు రాయుడుగారు. పల్లకిని తిన్నగా పిల్లావాళ్ళింటికి పోనిచ్చి, వచ్చిన విషయం చెప్పారు. వారికి పిల్లను ఇచ్చేందుకు తమకు ఎలాంటి అభ్యంతరమూ లేదన్నారు ఇంటిపెద్దలు. కాకపోతే పిల్లతోనే పేచీ! దానికి ఓ చిన్న కోరిక ఉంది. ఆ కోరిక నెరవేర్చిన వ్యక్తినే పెళ్ళాడతానంటోంది అన్నారు. ఏమిటి ఆ కోరిక అంటే...పిల్లతో మీరే మాట్లాడండి అని వాణిని రాయుడిగారి ముందుకు తోసి వెళ్ళిపోయారు పెద్దలు. చెప్పు! ఏం కావాలి నీకు? అడిగారు రాయుడుగారు.

నా పేరున పెద్ద మహల్ కట్టించాలి. అందులో నాకు ఇష్టమైన అన్ని పుస్తకాలూ, అన్ని భాషల పుస్తకాలూ ఉండాలి. అదే నా పుట్టిల్లు కావాలి అంది వాణి. సరేనన్నారు రాయుడుగారు. ఆమెకోసం అప్పుడు కట్టించిన మహలే ఇప్పుడు ఈ వాణీమహల్! కాలక్రమంలో రాయుడుగారూ, ఆ తర్వాత వాణీ పోయినా ఈ మహల్ మాత్రం మిగిలిపోయింది. ఈ ఊరికి అది పెద్ద చిరునామాగా మారిపోయింది. మీకు ఓ సంగతి తెలుసా? అప్పుడప్పుడూ అర్ధరాత్రిపూట తాళం పెట్టిన మహల్లో దీపాలు వెలుగుతాయట! ఫ్యాన్లు తిరుగుతాయట! ఎవరో ఏదో పుస్తకాన్ని వెదుకుతున్నట్టుగానూ, ఎగిరి అందుకున్నట్టుగానూ శబ్దాలు వినవస్తాయట! అల వైకుంఠపురంబులో నగరిలో ఆ మూల సౌధంబుదాపల అంటూ వాణి చదువుతున్న పద్యాలు కూడా వినవస్తాయట! అదీ కథ!



## సత్తాచాటిన యువ సర్పంచ్

ఒక్క ఐడియా జీవితాన్నే మార్చేస్తుంది. అదే విధంగా ఆమె తీసుకున్న ఒక్క నిర్ణయం ఆ గ్రామంలో నేరాల సంఖ్య తగ్గేలా చేసింది. ఆ నిర్ణయం వల్లే ఆమె జాతీయ మీడియా దృష్టిని కూడా ఆకర్షించింది. ఆమె పేరు అంజు యాదవ్. పోస్టు గ్రాడ్యుయేషన్ చదువుతోంది. ఆ గ్రామ సర్పంచ్ బాధ్యతలు నిర్వహించేది కూడా ఆమే!

ఇరవై రెండేళ్ళ అంజు యాదవ్, హర్యానాలోని ఫరీదాబాద్ జిల్లా చందావాలీ గ్రామంలో పుట్టి పెరిగిన మధ్యతరగతి అమ్మాయి. రైతు కుటుంబంలో పుట్టినా, చదువుకుంటున్న అమ్మాయి అయినా, ఎటువంటి రాజకీయ నేపథ్యం లేకపోయినా ఎన్నికల్లో నిలబడి తన సత్తా చాటింది. సర్పంచ్‌గా బాధ్యతలు స్వీకరించింది. పదివేలమంది జనాబా ఉన్న ఆ గ్రామంలో నేరాలు ఎక్కువ. స్థానిక పోలీస్ స్టేషన్‌లో




గ్రామానికి సంబంధించిన కేసులే ఎక్కువగా నమోదు కావడం అంజు గుర్తించింది. గ్రామంలో వసతులకూ, సౌకర్యాలకూ లోటు లేదు. ఒక్క నేరాల విషయంలో తప్ప అన్నింటిలోనూ గ్రామం మెరుగ్గానే ఉంది. దాంతో పంచాయతీ నిధులన్నీ నేరాలు తగ్గించడానికి వినియోగించాలనుకుంది అంజు. అదే ఆలోచనతో ఒకరోజు గ్రామం మొత్తం తిరిగింది. అప్పుడే ఆమెకు మెరుపులా ఓ ఆలోచన వచ్చింది. అదేంటంటే, సీసీ టీవీ కెమెరాలను ప్రతివీధిలోనూ అమర్చడం వల్ల నేరాలకు ఆస్కారం ఉండదని భావించింది. తక్కువ ఖర్చుతో వాటిని అమర్చాలి. ఎలా? విద్యుత్ వినియోగం పంచాయతీకి అదనపు భారమే. అందుకే సోలార్ ప్యానెల్ అమర్చి, సౌర విద్యుత్ ద్వారా సీసీ కెమెరాలు పనిచేసేలా ఏర్పాటు చేసింది. ఊరంతా కలిపి 72 సీసీ కెమెరాలు ఏర్పాటు చేసింది. ఆ తరువాత గ్రామంలో నేరాలు చాలా వరకూ తగ్గాయి. ఒకవేళ నేరం జరిగినా, పూర్తి ఆధారాలు సీసీటీవీలో నమోదు కావడంతో పోలీసులకు నిందితులు తేలిగ్గా పట్టుబడుతున్నారు. ఈ స్ఫూర్తితో పోలీసులు, మరో నూటయాభై గ్రామాల్లో సర్పంచులతో మాట్లాడి, సీసీ కెమెరాలను ఏర్పాటు చేయించాలనుకుంటున్నారు. ఉన్నత విద్యావంతులు సర్పంచ్ బాధ్యతలు చేపడితే గ్రామాలు బాగుపడతాయన్న వాదనను నిజం చేసిన అంజు ఉదయం కాలేజీకి హాజరై చదువుకుంటుంది. తిరిగివచ్చాక సాయంత్రం గ్రామ బాధ్యతలు నిర్వహిస్తుంది. ఒకపక్క చదువుకుంటూ, మరోపక్క గ్రామ సర్పంచ్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న అంజుయాదవ్ నేటి యువతకు ఆదర్శం. హ్యాట్సాఫ్ టు హర్!

# మెయిల్ బాక్స్

### హాస్యరసానికి పెద్దపీట

నవ్య వీక్లీ హాస్య రసానికి పెద్దపీట వేస్తోంది. చక్కని చిక్కని మార్నింగ్ కాఫీ రుచితో, మంచి మంచి కార్టూన్లతో కడుపుబ్బ నవ్విస్తోంది. 'బామ్మ పుష్కర స్నానం' కథ బాగా నవ్వించింది. కాలు విరగ్గొట్టుకుని మంచానికి అంకితమైన బామ్మ గోదావరి పుష్కరాలకు రాజమండ్రి తీసుకెళ్ళమని పట్టుపట్టడం, ఆ అవస్థలు, తిప్పలు సున్నిత హాస్యంతో నవ్వించారు. భక్తులకు మజ్జిగదానం బామ్మ దానగుణం.

-సరికొండ శ్రీనివాసరాజు, హైదరాబాద్

### చల్లని తల్లి మన ఉల్లి

సంతోషి దహగాంగారి 'చల్లని తల్లి మన ఉల్లి' ఆర్టికల్ చదివిన తర్వాత ఉల్లిపాయ మహత్యం తెలిసివచ్చింది. మామూలు వాడకం వస్తువుగానే భావించాంగానీ, ఉల్లిలో ఎన్నో ఆరోగ్య గుణాలు ఉన్నాయని ఇప్పుడే స్పష్టంగా తెలిసింది.

-టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత

### సంతోషమే మన సక్సెస్

సంతోషం లేకపోతే జీవితం ఫెయిల్యూర్ అనడం గొప్ప సత్యం. నెగెటివిటీని పారద్రోలి పాజిటివ్‌గా ముందుకు సాగడం ఎలా అన్నది గేమ్ ఆఫ్ లైఫ్‌లో బాగా వివరించారు. వరలక్ష్మీ వ్రతకథ, వ్రత విధానం బాగుంది.

-శాంతిచంద్రిక, సామర్లకోట

### అలరించిన రకూల్

వరలక్ష్మీవ్రత కథా విధానం చక్కగా వివరించారు. రకూల్‌ప్రీత్‌సింగ్ ముఖచిత్రం ఆకట్టుకుంది. పొట్టనిండా విటమిన్లు నింపుకున్న ఉల్లిపాయ గురించి ఎంతో చక్కగా చెప్పారు. భక్తప్రహ్లాద చిత్రంతో ఐదేళ్ళ వయసులోనే జాతీయస్థాయికి ఎదిగిన రోజారమణి ఇంటర్వ్యూ చాలా బాగుంది. నోబెల్ కథలు ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. అరణి రామాయణం ఆశ్చర్యం కలిగిస్తోంది. మార్నింగ్ కాఫీతో ఉత్సాహం ఉప్పొంగింది. కార్టూన్లు, జోకులు ఎంతో బాగున్నాయి. కథలన్నీ ఓకే. ఆరోగ్యమే మహాభాగ్యం ద్వారా ఆరోగ్య విషయాలు తెలుసుకుంటున్నాం. ఎమ్మెస్ కథనం ఆకర్షణీయం. సురభి, రివ్యూ, కవిత, నవ్య సినిమా, ఫీచర్లు వేటికవే బాగున్నాయి.

-అబ్బగాని భాస్కర్, మహబూబాబాద్

### ఉన్నత మానవత్వానికి ప్రతీక 'గోచర' కథ

పాపభీతి, భూతదయను హృదయాలకు హత్తుకునేలా, మత సంబంధంలేని మానసిక సంఘర్షణతో 'గోచర' కథను ఉన్నతంగా అందించారు. అపరాధభావంతో తల్లడిల్లిన సలీం హృదయం ఉన్నత మానవత్వానికి ప్రతీక. జంతువులకు భాష రాకపోయినా, బాధ, ఆక్రోశం, ప్రేమ, గుర్తించే నైజం అంతర్లీనంగా కలిగిఉంటాయని గోమాత నిరూపించింది. డిగ్నిటీ ఆఫ్ లేబర్‌ను నూటికి నూరుపాళ్ళు ప్రతిబింబించిన కథ 'నరకకూపం'. సమయానుకూలం సరసి కార్టూన్. నవ్యాంగ సుందరంగా నిండు బండిలా ఇంటిముందుకొస్తోంది వీక్లీ.

-ప్రతికంఠం మహేందర్‌రాజు, హన్మకొండ

### సురభి సూపర్‌హిట్

నవ్య వీక్లీ రాగానే మొదట మేం చదివేది సురభి వింతలే. ప్రపంచవ్యాప్తంగా మనకు తెలియని ఇన్ని వింతలూ, విడ్డూరాలూ ఉన్నాయా అని చదివి ఆశ్చర్యపోతున్నాం. అగ్నిపర్వతంపై రెస్టారెంట్ నిర్మించడం పెద్ద సాహసమే. దానికీ కొన్ని టైమింగ్స్ ఉన్నాయి. సూట్‌కేసుల్ని మోయాల్సిన అవసరం లేకుండా అవే మనల్ని మోయడం గొప్ప సౌకర్యం. గడియారాల మ్యూజియం, పాపాలు చేసిన వారు గౌతమేశ్వర ఆలయంలో 11 రూపాయలిచ్చి పాప విముక్తి సర్టిఫికెట్ పొందడం మరీ విడ్డూరం.

-ఎం.సారథి, విజయవాడ

సు ర భి

### సురభి షోకులు

మార్నింగ్ కాఫీ జోకులు కడుపుబ్బ నవ్విస్తున్నాయి. పెళ్ళిళ్ళకు, ఫంక్షన్లకు అప్పుల్ని సరఫరా చేయడం కలికాలపు వింత. మన సమస్యల్ని ఓపిగ్గా వినేవాళ్ళే దొరకని ఈ రోజుల్లో ఒస్సాన్ అనే వెబ్‌సైట్ పెట్టాడు తకనోబు. ఐస్‌క్రీమ్ మ్యూజియం, దిమ్మదిరిగే మజాలతో సురభి ఆకట్టుకుంటోంది. సురభి సూపర్‌హిట్.

-టి.ప్రకాష్, విశాఖపట్నం

### కాఫీ భలేగా ఉంది

మార్నింగ్ కాఫీ 'భరించలేని అవమానం' భలేగా ఉంది. అందరూ కావాలనుకోవడం, అందరికీ సాయం చేయడమే మంచి ఆరోగ్యానికి మహా మంచి చిట్కా అంటూ మొదటిపేజీలో వివరించిన తీరు అద్భుతం. ఒకసారి దొంగైతే, జీవితాంతం దొంగే అని ప్రజల నమ్మకం. జైలు నుంచి వచ్చిన వారికి జీవించేమార్గం చూపిస్తున్న బ్రాండన్ నిజంగా ఆదర్శప్రాయుడు. నేటి విందుల్లో చిప్ప చేతబట్టి ఖైదీల్లాగా క్యూలో వడ్డించేవారి వద్దకు వెళ్ళి నిలబడి నాలుగు మెతుకులు కతకడం ఎంత అసౌకర్యంగా ఉంటుందో అనుభవిస్తేనే తెలుస్తుంది. కూచుని తినడమే మహాభాగ్యం.

-బి.ప్రభాస్, గాంధీనగర్

### తెలుగింటి పత్రిక నవ్య వీక్లీ

తెలుగింటి పత్రిక నవ్య వారపత్రిక రసరమ్యంగా ఉంటోంది. మధుబాబు సీరియల్ వెట్టి చదువుతుంటే సినిమా చూస్తున్న అనుభూతి కలుగుతోంది. బహుమతి పొందిన కవితలు వారం వారం చదువుతున్నాం. సందేశాత్మకంగా ఉంటున్నాయి. ఇంటర్వ్యూలు, సినిమా విశేషాలు ఆకట్టుకుంటున్నాయి.

-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959

# అవగాహనతోనే ఆస్టియోపొరోసిస్ దూరం

## చిన్నప్పటి నుంచే జాగ్రత్తలు అవసరం

మన శరీరానికి ఆకృతి ఇచ్చేవి ఎముకలు, ఎముకల సముదాయంతో అస్థిపంజరం మనకో రూపాన్ని ఇస్తుంది. ఆరోగ్యవంతమైన ఎముకలను కాపాడుకోవడం చాలా అవసరం. లేదంటే ఆస్టియోపొరోసిస్ బారిన పడే అవకాశం ఉంటుంది. ఎముకల ఆరోగ్యంపై అవగాహన పెంపొందించుకుని సమతులాహారంతో కూడిన ఆహారపు అలవాట్లతోపాటు క్రమం తప్పకుండా వ్యాయామాలు చేస్తూ చిన్నప్పటి నుంచే జాగ్రత్తలు పాటిస్తే ఈ వ్యాధి బారినపడకుండా జాగ్రత్తపడొచ్చు.

### ఆస్టియోపొరోసిస్ అంటే :

ఆస్టియోపొరోసిస్ అనేది ఎముకలకు సంబంధించిన సమస్య. ఈ సమస్యవల్ల ఎముక కణజాలానికి నష్టం జరగడం వల్ల ఎముకలు గుల్లబారి పెళుసుగా తయారై సులభంగా విరిగిపోతుంటాయి. ముఖ్యంగా ఈ వ్యాధి వయసు పెరిగిన వారిలో ఎక్కువగా వస్తుంటుంది. ఇది సైలెంట్ కిల్లర్ వంటిది. ఎందుకంటే ఎముకలు విరిగేంతవరకు ఈ సమస్య ఉన్నట్లు తెలియదు.

### ఎలా వస్తుంది...?

ఎముకలలో కాల్షియం తగ్గితే అవి బలహీనపడి పెళుసుగా మారతాయి. ప్రతి ఒక్కరికి 45 ఏళ్ల వయసు వచ్చే వరకు ఎముకలు ఒక బ్యాంకులాగా అవసరమైన కాల్షియం సమకూర్చుకుంటాయి. ఈ వయసు తర్వాత శరీరంలో కొన్ని హార్మోన్ల ఉత్పత్తి నిలిచిపోయి, కాల్షియం తీసుకోవడం తగ్గిపోతుంది. దాంతోపాటు ఆ వయసు పైబడిన తర్వాత శరీరం కొద్ది కొద్దిగా ఎముకల నుంచి కాల్షియంను తీసివేస్తూ ఉంటుంది. పురుషులలో అయితే యుక్త వయస్సు దాటిన తరువాత ఏడాదికి ఒక శాతం కాల్షియం

OSTEOPOROSIS







పోతుంది. అదే మహిళలో అయితే మెనోపాజ్ తరువాత 2-3 ఏళ్ల వరకు 4-5 శాతం, ఆ తర్వాత 2-3 శాతం కాల్షియం పోతుంది. కాబట్టి 45 ఏళ్ల వయసు వచ్చే వరకు కాల్షియం అధికంగా ఉండే ఆహారం తీసుకోవడం ద్వారా ఎముకల పటుత్వానికి అవసరమైన కాల్షియం సమకూర్చుకోవడం చాలా అవసరం. శరీరంలోకి కాల్షియంను గ్రహించడానికి విటమిన్ డి అవసరమవుతుంది. శరీరానికి అవసరమైన విటమిన్ డి లభించడం వల్ల కాల్షియం పెరుగుతుంది.







### కారణాలు :

- వయసు పైబడడం
- రుమటాయిడ్ అర్థరైటీస్
- మెనోపాజ్ దశకు చేరుకోవడం
- ధూమపానం
- సరైన ఆహారం తీసుకోకపోవడం
- జన్యుపరమైన కారణాలు

### వీరు మరింత జాగ్రత్తగా ఉండాలి :

- జీర్ణకోశ వ్యాధులతో బాధపడేవారు
- ఎక్కువగా స్టెరాయిడ్స్ వాడేవారు
- స్త్రీలలో రుతుస్రావం సమస్యలు ఉన్నవారు
- సరైన వ్యాయామం లేకుండా కుర్చీలకే పరిమితమయ్యేవారు

### జాగ్రత్తలు తప్పనిసరి :

మనం ఆరోగ్యంగా ఉండేందుకు శరీరానికి పోషకాహారం ఎలా అవసరమో... అలాగే ఎముకల ఆరోగ్యానికి కాల్షియం అవసరం. 9-18 ఏళ్ళ వయసు గల వారికి రోజుకు 1000 మిల్లీగ్రామ్ కాల్షియం కావాలి. సమతులాహారం తీసుకోకపోతే అవసరమైన కాల్షియం లభించదు. కాబట్టి చిన్నప్పటి నుంచే సమతులాహారం తీసుకుంటూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం, ఆటలు ఆడడం వల్ల చాలా వరకు ఆస్టియోపొరోసిస్ బారిన పడకుండా జాగ్రత్త పడొచ్చు. ఎముకల ఆరోగ్యానికి కాల్షియం, విటమిన్ డి చాలా అవసరం. కాబట్టి కాల్షియం అధికంగా ఉండే ఆహారాన్ని ఎక్కువగా తీసుకోవాలి. పిల్లలకు విటమిన్ డి లభించే పోర్టిఫైడ్ పాలు ఇవ్వాలి. దాంతో పాటు బాస్కెట్ బాల్, వాలీబాల్, స్కిప్పింగ్ వంటి ఆటలతో పాటు జాగింగ్, సైక్లింగ్ వంటి వ్యాయామాలు ఎముకల ఆరోగ్యానికి దోహదపడతాయి.

ఆగస్టు 26 నేషనల్ డాగ్స్‌డే

# డాగ్ లవర్స్‌కి లవ్లీ ప్లానింగ్

**పాలిచ్చే జంతువులకు, మనిషికి మధ్య స్నేహం పురాణకాలం నుంచీ ఉన్నదే. మనిషి మచ్చిక చేసుకున్న జంతువుల జాబితాలో అగ్రస్థానంలో నిలిచేదీ, మనిషితో మమేకమయ్యేదీ శునకమే. పదివేల యేళ్ళనాటిదిగా భావించే ఈ బంధం ఎంతో ప్రత్యేకమైనది. అందుకే సామెతలలో, సాహిత్యంలో, నిత్య జీవితంలో మనిషిని ప్రభావితం చేసిన పెంపుడు జంతువుల్లో ఇదే టాప్ ర్యాంకర్!**

సాటి మనిషినే కాదు, కడకు కన్న కొడుకును కూడా నమ్మలేనిస్థితికి చేరిన ఆధునిక సమాజం, కుక్క చూపించే విశ్వాసానికి ఫిదా అయిపోయింది. 'కనకపు సింహాసనము పైన శునకము కూర్చుండ దగునా... అంటూ విలువల సంరక్షణ కోసం రాగాలు తీసిన వారు ఇప్పుడంత ధైర్యంగా కుక్కను దూషించలేక పోతున్నారు. ఎందుకంటే, నేటితరం ఒంటరి బతుకులకు శునకాలే చేదోడుమరి! సు'శిక్షణ'తో యజమానికి సంరక్షకులుగా నిలవడమే కాదు, ఆధునిక సమాజ పోకడల్ని కూడా అందిపుచ్చుకుంటున్నాయవి. అందుకే వేలకోట్ల రూపాయల ఆస్తుల్ని సైతం తమపేరున రాయించుకునే దశకు చేరుకున్నాయి.

శునకాలు మానవులతో సమానమైన భావోద్వేగాలు ప్రదర్శిస్తాయని ఇటీవలి అధ్యయనం వెల్లడించింది. అందుకే విశ్వాసపాత్రమైన శునకాల కొనుగోలు, పోషణలకు డాగ్ లవర్స్ కోట్లాది రూపాయలు ఖర్చుచేస్తున్నారు. వీటిని చీదరించుకునేవారు, భయపడేవారు ఎందరో ఉన్నప్పటికీ. శునక ప్రేమికులిప్పుడు కోట్ల సంఖ్యకు చేరారు. ఈ నేపథ్యంలో ఆగస్టు 26వ తేదీ నేషనల్ డాగ్స్‌డే సందర్భంగా ఆసక్తికర కథనం మీ కోసం..

ఒకప్పుడు కేవలం పట్టణాలకే పరిమితమైన 'పెంపుడు కుక్కల సంస్కృతి' పల్లెల్లోనూ ప్రవేశించింది. నిజమే! ఇంట్లో కుక్కపిల్ల ఉంటే మంచి టైమ్‌పాస్. కానీ ఇప్పుడు కుక్కను పెంచాలంటే కేవలం ఓపిక ఒక్కటే సరిపోదు దానికి తగ్గ ఆర్థిక బలం కూడా ఉండాలండోయ్! బాధ్యతగా వ్యవహరించాలి కూడా!!

### భరించగలిగే శక్తి

సాధారణ మధ్యతరగతి కుటుంబీకుడు రాజు. కుక్కపిల్లలంటే అతడికి చాలా ఇష్టం. కొన్నివేలు పోసి ఓ కుక్కని కొని ఇంటికి తెచ్చుకున్నాడు. దానితో ఆటలు ఆడుతూ సంతోషాన్ని తన సొంతం చేసుకున్నాడు. కానీ ఆ శునకాన్ని ముద్దుగా పెంచుకోవడానికి అతడికైన నెల ఖర్చు పదివేల రూపాయల పైమాటే. దాన్ని ఆరోగ్యకరంగా పెంచిపోషించినప్పుడే ఆ మానసికానందం దక్కుతుంది. కానీ అది తన తాహతుకు మించిన ఖర్చేనని రాజుకు అర్థమైంది. ఈ పరిస్థితి కేవలం రాజుకే కాదు, అలాంటి మధ్యతరగతి రాజులు చాలామందే ఉన్నారు. అందుకే శునకాన్ని కొనుక్కునే ముందు అన్ని విషయాలను జాగ్రత్తగా తరచి చూసుకోవాలని అనుభవజ్ఞులు సూచిస్తున్నారు.

### బడ్జెట్ ప్లానింగ్

పెంపుడు కుక్కల్లో ఎన్నో అనువైన జాతులు ఉన్నాయి. వీటి ధర ఐదు వేల నుంచి లక్షలు, కోట్ల రూపాయల ధర కూడా పలుకుతున్నాయి. అందుకే పెంపుడు కుక్కమీద ఆసక్తి ఉన్నవారు నెలవారీ బడ్జెట్‌ను ముందే ప్లాన్ చేసుకోవాలి. నెలనెలా దానికోసం ప్రత్యేకంగా కొంత డబ్బు ఆదా కూడా చేసుకోవాలి. ఎందుకంటే దానికి ఇంజెక్షన్లు, ఇతరత్రా చికిత్సలతో పాటు తగిన ఆహారం, రోజువారీ పరిశుభ్రతలు పాటించేందుకు చర్యలు తీసుకోవాలి. ఈ అవసరాలను దృష్టిలో పెట్టుకుని శునకాన్ని కూడా కుటుంబ సభ్యురాలుగా స్వీకరించి ప్లాన్ చేసుకున్నప్పుడే మనం నిజమైన డాగ్ లవర్స్ అవుతాం.

### షాపింగ్

అదేంటి కుక్క కోసం షాపింగ్ ఏంటి? అనుకుంటున్నారా? పెంపుడు కుక్క ఇంట్లోకి అడుగు పెట్టిన తర్వాత నెలసరి జాబితాతో పాటు పెట్‌షాపింగ్





కూడా చేరిపోతుంది. జీతం వచ్చిన వెంటనే మన పెంపుడు శునకం అవసరాల కోసం షాపింగ్ చేయక తప్పదు. ఎందుకంటే ఇప్పుడు శునకాలు ఆడుకోవడానికి కూడా మార్కెట్లోకి Special Toys వచ్చాయి. అంతేకాదు వాటికి దుస్తులు కూడా ఉన్నాయి. వాటికోసమే తయారైన ప్రత్యేకమైన వస్తువులు అందుబాటులోకి వచ్చాయి. కారులో, బైక్‌లో తిప్పడానికి కుక్కలకు ప్రత్యేకమైన కవర్లు, సీట్‌బెల్టులు కూడా మార్కెట్లోకి వస్తున్నాయి. అందుకే మరి కుక్క కోసం షాపింగ్ చేయాలనేది!

### పెట్‌కేర్ సెంటర్లు

కుక్కను పెంచుకోవాలంటే విశాలమైన మనసే కాదు విశాలమైన ఇల్లు కూడా ఉండాలండోయ్! అద్దె ఇళ్లల్లో పెంపుడు కుక్కకు చోటివ్వాలంటే కొన్ని చోట్ల ఎక్కువ అద్దె డిమాండ్ చేసే పరిస్థితులు ఉన్నాయి. శునక పోషణ చాలా ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. కొన్ని జాతులకు చెందిన కుక్కల కోసం తిండికి చాలా ఎక్కువ ఖర్చు చేయాల్సి వస్తుంది. అంతే కాదండోయ్ ఇప్పుడు వాటికోసం ప్రత్యేకంగా పెట్‌కేర్ సెంటర్‌లు వచ్చాయి. మీరు ఊరెళ్లాలనుకున్నప్పుడు కుక్కను ఎవరిదగ్గరా వదిలి వెళ్లలేం. పైగా అంత తొందరగా ఆ బాధ్యత ఎవరూ తీసుకోరు. అలా అప్పగించడం ఎదుటివారికి ఇబ్బంది కలిగించినట్టే. అందుకోసమే ఈ పెట్‌కేర్ సెంటర్లు వచ్చాయి. ఈ పెట్‌కేర్ సెంటర్లలో శునకాన్ని వదిలి వెళితే వాళ్ళు జాగ్రత్తగా చూసుకుంటారు. అందుకోసం కొంత మొత్తం వసూలు చేస్తారు.

### అవసరాన్నిబట్టి జాతికుక్కను ఎంచుకోవాలి

శునకాల్లో అనేక రకాల జాతులు ఉన్నాయి. ఏ అవసరం కోసం శునకాన్ని పెంచుకోవాలనుకుంటున్నారు? అందం కోసమా? రక్షణ కోసమా? తోడు కోసమా? పిల్లల వినోదం కోసమా? ఇలా మన అవసరాలను బట్టి ఆ జాతి శునకాన్ని మనం తెచ్చి పెంచుకోవచ్చు. అవసరానికి అనుగుణంగా ఆ జాతి శునకాన్ని ఎంపిక చేసుకుంటే ఖర్చుకు తగిన ఫలితం లభిస్తుంది. ఇలా మనదేశంలో ఉన్న పెంపుడుకుక్కల్లో పాశ్చాత్య దేశాల జాతి కుక్కలే అధికం.

### అతి చిన్న శునకం

ప్రపంచంలోనే అత్యంత చిన్న శునకం పేరు చిహ్వాహ్వా. పలకడానికి అసలు నోరే తిరగట్లేదు అనుకుంటున్నారా? ఇది ఎంత చిన్నగా ఉంటుందంటే కేవలం ఆరు నుంచి తొమ్మిది అంగుళాలు మాత్రమే ఉంటుంది. చిన్నది కదా ఇదేం చేస్తుందిలే అనుకుంటున్నారేమో! వామ్మో! అనిపిస్తుంది. ఇది కరిస్తే మనిషికి రాబిస్ వచ్చే ప్రమాదం మిగిలిన జాతి కుక్కలకంటే అధికమట. అందుకే పొట్టికుక్కే కదా అని తేలిగ్గా చూడొద్దు. ఇక ప్రపంచంలోనే అత్యంత పెద్ద శునకం ఇంగ్లిష్‌మేస్టిన్. దీని బరువు 158 కిలోలు.

### అతి ఖరీదైన శునకం, చైనీయుల సెంటిమెంట్

టిబెట్‌కు చెందిన మాస్తిఫ్ ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన శునకంగా పేరుగాంచింది. ఈ జాతి కుక్కలు ఎక్కువ బొచ్చుతో చాలా ఎత్తుగా ఉంటాయి. చైనీయులకు వీటిపైన బాగా మక్కువ పెరిగి పోవడంతో ఈ మధ్య వీటికి బాగా డిమాండ్ పెరిగిపోయింది. ఈ మాస్తిఫ్ జాతి కుక్క ఏ ఇంట్లో ఉంటే ఆ ఇంట్లో కుటుంబానికి సిరిసంపదలు కలుగుతాయని చైనీయుల నమ్మకం. ఒకవైపు అందరూ వీటిని ఇష్టపడడం, మరోవైపు ఈ జాతి క్రమేణా తగ్గిపోవడం కూడా మాస్తిఫ్ కుక్కల ధర చుక్కలనంటడానికి మరో కారణం. గతంలో జర్మన్ షెపర్డ్ కుక్కను అతిఖరీదైనదిగా భావించేవారు కానీ ఇప్పుడు మాస్తిఫ్ జాతి కుక్క ఆ రికార్డును బద్దలు కొట్టింది.

### కుక్కలకు ప్రత్యేక రిమోట్ టీవీ ఛానల్!

అన్నట్టు ఈమధ్య కుక్కలు కూడా టీవీ చూస్తున్నాయండోయ్! శునకాలు వారంలో తొమ్మిది గంటలు టీవీ చూడగలవని వాగ్ అనే పెంపుడు జంతువుల దాణా తయారీ సంస్థ పరిశోధనలో వెల్లడైంది. ఎవరికి తోచిన ఛానల్ వారు చూసేందుకు ఇళ్ళల్లో రిమోట్ కోసం గొడవపడే సందర్భాలు నిత్యం వస్తూనే ఉంటాయి. కానీ ఇక ఇప్పటినుంచి రిమోట్ కోసం శునకంతోనూ పోటీపడాలి. ఎందుకంటారా దానికోసం కూడా ఓ రిమోట్ తయారైంది మరి. శునకాలను పెంచుకుంటున్న వారికోసమే ఈ రిమోట్ తయారు చేశారు. ఇంట్లో కుక్కని ఒంటరిగా ఉంచలేనివాళ్ళకీ, వెంట తీసుకెళ్లలేక బాధపడేవారికీ దీనివల్ల ఉపయోగం. టీవీ ఆన్ చేసి రిమోట్ దాని కాళ్లకి ఇచ్చేస్తే సరిపోతుందట. ఇక మీరు తిరిగి ఇంటికి వచ్చేవరకు ఎంచక్కా దానికి ఇష్టమైన ఛానల్‌చూస్తూ ఎంజాయ్ చేస్తుంది. అంతేకాదండోయ్ వాటికోసం ప్రత్యేకమైన టీవీ ఛానల్ కూడా వచ్చేసింది. వాగ్ అనే పెంపుడు జంతువుల దాణా తయారీ సంస్థ ఈ ప్రత్యేక రిమోట్ తయారు చేసింది. సాధారణ రిమోట్ లాగానే ఇందులోనూ ఛానల్స్ మార్చుకోవచ్చు.

ఇక ఇంట్లో కుటుంబ సభ్యులు మరింత చురుగ్గా చలాకీగా ఉండటంలోనూ పెంపుడు కుక్కలు కీలక పాత్ర పోషిస్తాయట. ఒక తాజా అధ్యయనంలో ఈ విషయం తేలింది. శునకం పోషణ, పిల్లల భౌతిక చర్యలపై వర్జీనియా యూనివర్సిటీ పరిశోధ కుల సర్వేల్లో పలు ఆసక్తికర విషయాలు వెల్లడయ్యాయి, బద్ధకంగా టీవీలకు అతుక్కుపోయే పిల్లల్లో పెంపుడు కుక్కలవల్ల చురుకుదనం వస్తుందట. పెంపుడుకుక్కలున్న 600 మంది యుక్తవయస్కులపై ఈ సర్వే జరిపారు. వ్యాయామం చేసేవారితో పోల్చిచూసినప్పుడు కుక్కలతో వాకింగ్, జాగింగ్ చేసేవారు కూడా సమాన ఆరోగ్యంతో ఉన్నట్లు తేలింది.

**- విజేత**

## అందాల పోటీలు



ప్రతి ఏటా చాలా నగరాల్లో డాగ్ షోలు జరుగుతాయి. వీటిలో శునకాలు ర్యాంప్ వాక్ చేస్తాయి. వాటి అందం, అవి ప్రదర్శించే విన్యాసాలను బట్టి విజేతలను ప్రకటించి బహుమతులు అందజేస్తారు. అయితే డాగ్‌షోలో పాల్గొనేందుకు అర్హత సంపాదించుకోవాలంటే, సదరు పెంపుడు కుక్కకు మైక్రోచిప్పింగ్ వ్యవస్థ ఉండాలి. అలాంటి శునకాలను మాత్రమే పోటీలకు అనుమతిస్తారు. దొంగతనాలకు గురై తిరిగి దొరికిన సందర్భాల్లో యజమానులు గుర్తించడానికి, మేలురకం జాతికుక్కలతో క్రాసింగ్ చేయించడానికి ఈ మైక్రోచిప్స్ ఉపయోగపడతాయి.




## శునకాలకు స్పెషల్ బీరు

కేవలం మాంసం ముక్కలు తినడమే కాదు, ఇక కుక్కలకు బీర్ తాగే అదృష్టం కూడా పట్టింది. అవునండీ! కుక్కలకు కూడా స్పెషల్‌గా బీర్లు తయారు చేస్తున్నాయి కొన్ని కంపెనీలు. ఆఫ్ అండ్ బ్రూ అనే కంపెనీ బీర్లు బాగా ఫేమస్ అట! ఐతే కుక్కల బీర్‌లో ఆల్కహాల్ ఉండదు. చికెన్ ఫ్లేవర్‌తో ఈ బీరు తయారు చేస్తారట. కుక్కలకు ఇష్టమైన ఫ్లేవర్‌లో ఉంటుందట ఈ బీర్. దీనికి బాగా అలవాటు పడిన కుక్కలు యజమానుల మీద దాడిచేసిన సందర్భాలు కూడా ఉన్నాయని సదరు కంపెనీ అంటోంది!

# ఆ ఇంట్లో ఒక రోజు

సాయి బ్రహ్మానందం గొర్తి

**విశాలమైన ఆ భవంతి ముందు కారు ఆపాను. గేట్ ఇంటర్‌కామ్ బజర్ నొక్కి, 'మిస్టర్ స్టీవెన్‌సన్! నేను హేరీ!' అని చెప్పగానే, "వెల్‌కమ్" అంటూ గేటు తెరిచాడు.**

**మెల్లగా ఆ గేటు తెరుచుకోగానే కారు లోపలకి పోనిచ్చాను. ఇంటి ముందు డ్రై వే లో స్టీవ్ నా కోసం ఎదురుచూస్తూ కనిపించాడు. కారు దగ్గరకు వచ్చి నన్ను ఆలింగనం చేసుకున్నాడు.**

క్లింట్ ఈస్ట్‌వుడ్‌కి మరింత ముసలితనం వస్తే ఎలా ఉంటుందో అలా ఉన్నాడు స్టీవ్ చూడ్డానికి. అతనికి ఎనభై అయిదేళ్ళు పైనే వయసుంటుంది. ఆర్మీలో పనిచేయడం వల్ల శరీరం ఇంకా దృఢం గానే ఉంది. మొహంలో ముడతలు తెల్లటి గీతలు గీసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నా కొలీగ్ బిల్ వాళ్ళ నాన్న స్టీవ్. డెల్ కంప్యూటర్స్‌లో నేనూ, బిల్ కలిసి పని చేస్తున్నాం అట్లాంటాలో ఒక పెద్ద కంపెనీలో వ్యాపార నిమిత్తమై ఇద్దరం వచ్చాం. మా కంపెనీకి పది మిలియన్ల డీల్ వచ్చింది. థాంక్స్ గివింగ్ హాలిడేస్ రావడంతో కొన్ని పరిస్థితులవల్ల అది సోమవారానికి వాయిదా పడింది. మాకు ఆ కంపెనీ సి.ఈ.ఓతో మీటింగ్ ఉంది. కనుక నేను సోమవారం వరకూ ఉండాల్సి వచ్చింది.

వెనక్కి శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళిరావడం కంటే ఇక్కడే అట్లాంటాలో ఉండిపోదామని అనుకున్నాం.



## నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

అసలు బిల్ అట్లాంటాలో ఉండాలి. నేను వెనక్కి వెళ్ళిపోవాలి. అట్లాంటాలో పని పూర్తికాగానే వాళ్ళ నాన్నని చూడ్డానికి మాంట్‌గోమరీ వెళదామని బిల్ అనుకున్నాడు. ఈలోగా బిల్ భార్య లోరా థాంక్స్‌గివింగ్‌కి  షికాగో రావాల్సిందేనని పట్టు బట్టింది. దాంతో నన్ను పని ముగించుకురమ్మని చెప్పి, బిల్ షికాగో వెళ్ళిపోయాడు. తన వెళ్ళలేక పోయినందుకు బాధపడ్డాడు బిల్. తన బదులు నన్ను వెళ్ళమని కోరాడు. హోటల్లో ఉండి చేసేదే ముందని సరేనన్నాను. అనుకోని పరిస్థితుల్లో నేను మాంట్‌గోమరీకి వచ్చాను.

ఇంటి ప్రధానద్వారం బయట "స్టీవ్ మెకెన్నా, క్రిస్టీ మెకన్నా" పేర్లు చెక్కి ఉన్న ఒక ఉడెన్ బోర్డు కనిపించింది.

లోపలికి తీసుకెళ్ళి సోఫాలో కూర్చోమని చెప్పాడు.

"నువ్వు రావడం చాలా సంతోషంగా ఉంది. బిల్ నాకు ఫోనులో అంతా చెప్పాడు" అంటూ నారింజ రసం ఇచ్చాడు. కుశలప్రశ్నల తరువాత క్రిస్టీని ఒక వీల్‌చైర్లో తోసుకుంటూ తీసుకొచ్చాడు. ఆమెను చూడగానే సినిమాతార మెరిల్ స్ట్రీప్ గుర్తొచ్చింది. ముఖ కవళికలు అలానే ఉన్నా, ముడతలు పడ్డ చర్మం ఆమె వయసు చెబుతూనే ఉంది. క్రిస్టీ చూడ్డానికి స్టీవ్‌కంటే పెద్దదానిలాగే కనబడింది. మాట కూడా వణుకుతోంది. నన్ను చూసి ఒక్కసారి లేవబోయింది. పడిపోతూం డగా స్టీవ్ వచ్చి పట్టుకున్నాడు.

"హనీ! నన్ను పిలవచ్చుగా?" అంటూ చికాగ్గా ఆమె కేసి చూశాడు.

నేను వస్తున్నానని తెలిసి నిన్నరాత్రి నుండి తెగ ఆరాటపడి ఏర్పాట్లు చేస్తున్నప్పుడు కాలుజారి పడిందని చెప్పాడు. భార్యాభర్త లిద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పారు. మాటల్లో అస్సలు టైమే తెలియలేదు.

"డ్రైవ్ ఎలా ఉంది? నువ్వు హైవే 85 మీద వచ్చావా? కొంచెం వైన్ తీసుకుంటావా...?" స్టీవ్ ప్రశ్నల మీద ప్రశ్నలు. సాయంత్రం తీసుకుందామని చెప్పాను.

నేనూ, బిల్ మధ్యాహ్నం లంచ్ తర్వాత వ్యాహ్యాళికి వెళ్ళేవాళ్ళం. అప్పుడు మాటల్లో వాళ్ళ అమ్మా నాన్నల గురించి నాకు చెప్పేవాడు బిల్. ఇంతకు మునుపు బిల్ తల్లిదండ్రుల ఫొటోలు చూశాను. అంతే!

స్టీవ్ వాళ్ళ ఇల్లు చూపించాడు. అది ఇల్లు కాదు. పది పడక గదులున్న విశాలమైన పెద్ద భవంతి. నాకు బిల్ స్టడీ రూము, బెడ్రూమూ అన్నీ చూపించాడు.

బిల్ చిన్నప్పటి ఫోటోలూ, సర్టిఫికెట్స్ ఫ్రేముల్లో పెట్టి ఆ గది గోడలమీద కనిపించాయి. బిల్ గది అంతా రాక్ అండ్ రోల్ సింగర్ ఎల్విస్ ప్రెస్లీ ఫోటోలతో నిండిపోయింది.

"బిల్ గిటార్ బాగా వాయిస్తాడు" స్టీవ్ చెప్పాడు. నాకూ తెలుసు, బిల్ గిటార్ ప్రోగ్రాము లకి నేనూ వెళ్ళాను.

మేడమెట్ల దగ్గర ఒక గదివైపు తలుపు తీయబోతుండగా "స్టీవ్" అంటూ వద్దన్నట్లు తలాడించింది క్రిస్టీ. వెంటనే అతను వెనక్కి వచ్చేశాడు. ఏవిటా అనుకున్నాను కానీ, నేనేమీ మాట్లాడలేదు.

స్టీవ్ నా గురించీ, ఇండియా గురించీ అడిగాడు. బిల్ లాగే నేనూ మా తల్లిదండ్రులకి ఒక్కణ్ణే కొడుకుననీ, ఒక చెల్లెలు ఆస్ట్రేలియాలో ఉంటోందని చెప్పాను. మా అమ్మా, నాన్నా రాజమండ్రిలో ఉంటారని చెప్పాను.

ఇంత పెద్ద ఇంట్లో వాళ్ళిద్దరే ఉంటారా? ఎలా మేనేజ్ చేస్తారో?" ఆశ్చర్యం వేసింది నాకు. నెల నెలా పనివాళ్ళు వస్తారనీ, చిన్నచిన్న పనులు తనే చేసుకుంటాననీ చెప్పాడు. ఎంతైనా కొన్ని పనులు మనమే చేసుకోక తప్పదని నవ్వుతూ అన్నాడు.

"నేను ఈ ఇంట్లోనే పెరిగాను. బిల్ కూడా అంతే. మా జ్ఞాపకాలన్నీ ఈ ఇంటితోనే ముడిపడి ఉన్నాయి. బిల్ మమ్మల్ని కాలిఫోర్నియా వచ్చేయమంటాడు" అన్నాడు.

నేనూ అదే అన్నాను కూడా, వచ్చేయచ్చుగా అన్నట్లు. అతను గట్టిగా నవ్వాడు.

'మనమందరం మనుషుల్ని ప్రేమిస్తాం అన్న భ్రమలో ఉంటాం. కానీ, వస్తువుల్నీ, ఊళ్ళనీ, ఇళ్ళనీ ప్రేమించినంతగా దేనినీ ప్రేమించం" కళ్ళు ఎగరేస్తూ అన్నాడు. గట్టిగా నవ్వేశాను. మళ్ళీ అతనే అన్నాడు.

"ఇల్లు వదిలి రావడమనేది ఒక మానసిక సమస్య. పరాయి వాళ్ళింట్లో ఉంటే స్వేచ్ఛ ఉండదేమోనన్న పిరికితనం".

"బిల్ పరాయివాడు ఎలా అవుతాడు? మీ కొడుకే కదా?" నవ్వుతూ రెట్టించాను.

"వాడు పరాయివాడు కాదు, వాడిల్లు పరాయిది. పనికిరాని ఎన్నో మానసిక అంశాలతో పాటు అహం ఉంటుంది. అంతే!"

అతను చెప్పినదాన్ని పొడిగించకుండా వేరే విషయం మీదకి దృష్టి మరల్చాను. భోజనం చేశాక స్టీవ్ బయటకి వెళదాం అంటే నేనూ వస్తానని బయల్దేరాను. స్టోర్‌లో ఉండగా క్రిస్టీ కాల్ చేసింది.

"మనం వెంటనే వెనక్కి వెళ్ళాలి, క్రిస్టీ పడిపోయిందట".

హుటాహుటిన వెనక్కి వెళ్ళాం. వెళ్ళేసరికి క్రిస్టీ నేలమీద పడిపోయి ఉంది. అంతా బాగానే ఉంది. కానీ లేవలేకపోతోంది. దూరంగా వీల్ చైర్ ఒరిగిపోయి పడుంది.

నేనూ, స్టీవ్ మెల్లగా లేవనెత్తి వీల్‌చైర్లో కూర్చోబెట్టాం.



"నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధిరాదు" అంటూ క్రిస్టీ మీద కసురుకున్నాడు స్టీవ్. సాయంత్రం థాంక్స్ గివింగ్ డిన్నర్‌కని ఏదో చేద్దామని కిచెన్‌లోకి వెళ్ళిందట. ఫ్రిజ్‌డోరు తీస్తుండగా జారి పడిపోయిందనీ చెప్పింది.

ఆ సాయంత్రం థాంక్స్ గివింగ్ డిన్నర్ కలిసి చేశాం. నేను వచ్చినందుకు స్టీవ్, క్రిస్టీ చాలా సంతోషించారు. వాళ్ళ ఆనందం ప్రతీ మాటలోనూ, ముఖ్యంగా వారి కళ్ళల్లోనూ కనిపిస్తూనే ఉంది. స్టీవ్‌కోసం ఒక స్క్రీమింగ్ ఈగిల్ వైనూ, క్రిస్టీకి స్వెటరూ తీసుకెళ్ళాను. అవి చూసి వాళ్ళ ఆనందానికి అవధుల్లేవు. క్రిస్టీ అయితే కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. "ఇంత ఎక్స్‌పెన్సివ్ వైన్..." అంటూ స్టీవ్ అనబోతే, అది నేనూ, బిల్ కలిసి కొన్నాం అని చెప్పాను. ఆ సాయంత్రం ఎంతో సంతోషంగా గడిచిందని వాళ్ళు ఇద్దరూ ఒకటికి పదిసార్లు అన్నారు. వాళ్ళని చూస్తే నాకూ ముచ్చటేసింది. క్రిస్టీకి రాత్రి త్వరగా నిద్ర పోయే అలవాటు. ఆమెను స్టీవ్ పడకగది వైపు తీసుకెళ్ళాడు.

"రాత్రి ఎనిమిదయితే చాలు. క్రిస్టీ నిద్రకి ఆగలేదు. అయ్యో మందులు ఇవ్వడం మర్చిపోయా" అంటూ మరలా వెనక్కివెళ్ళి కొద్దిసేపయ్యాక తిరిగి వచ్చాడు.

ఇద్దరం కాసేపు అధ్యక్షుడి ఎన్నికల గురించి, రాజకీయాల గురించీ మాట్లాడుకున్నాం. ఇరవయ్యేళ్ళ వయసులో తను రెండో ప్రపంచ యుద్ధంలో పని చేశానంటూ ఆ సంగతులవీ చెప్పుకొచ్చాడు స్టీవ్. మాటల్లో బిల్ చదువు, క్రిస్టీతో తన పెళ్ళీ ఇవన్నీ ప్రస్తావనకి వచ్చాయి.

"బిల్ మమ్మల్ని కాలిఫోర్నియా వచ్చేయమంటాడు. ఎలా రావడం? అలవాటైన ఊరు. ఇక్కడ కొంతమంది ఫ్రెండ్స్ ఉన్నారు. రోజూ మధ్యాహ్నం బిలియర్డ్స్ ఆడటానికి వెళతాను. క్రిస్టీకి ఆరోగ్యం చెడిపోయాక వెళ్ళడం తగ్గించేశాను. ఒక్కతినీ వదిలి వెళ్ళలేను" చెబుతూంటే స్టీవ్ గొంతు మారింది.

"నిజానికి ఇవాళ బిల్ వద్దామనే అనుకున్నాడు. మీ కోడలు 'వచ్చి తీరాలి' అంటే షికాగో వెళ్ళాడు. మీరంటే అతనికి చాలా ప్రేమ. మీ గురించి తరచూ చెబుతూనే ఉంటాడు. తను రాలేక నన్ను వెళ్ళమని అడిగాడు. నేనూ ఖాళీగానే ఉన్నాను కనుక వచ్చాను. మీకు అనవసరంగా నా వల్ల ఇబ్బంది కలిగింది సారీ" నొచ్చుకుంటూ అన్నాను.

'నాట్ ఎటాల్! నిజానికి నువ్వు వస్తున్నావని తెలిసి క్రిస్టీ చాలా సంతోషించింది. తనకి అన్నీ ఒక పద్ధతి ప్రకారం ఉండాలి. ఆ హడావిడిలో జారిపడి కాలు బెణికింది. అందుకే వీల్‌ఛైర్లో ఉంది. ఈ వయసులో మతిమరపు ఒకటి. అందుకే ఆమెను వదిలి బయటకు వెళ్ళడం తగ్గించేశాను. రెండు రోజులక్రితం బిల్ వస్తున్నాడని, వాడి కోసం ఇల్లు శుభ్రం చేద్దామని మొదలు పెట్టింది. నేను ఇక్కడ టీవి చూస్తున్నాను. వంటింట్లోంచి ఒకటే కాలిన వాసన. వెళ్ళి చూస్తే స్టవ్ మీద నల్లగా మాడి మసైన చికెన్. ఒక్క క్షణం ఆలస్యమై ఉంటే మంటలు వచ్చుండేవి. స్టవ్‌మీద పెట్టానన్న సంగతే మర్చిపోయింది. సారీ, మా చెత్తంతా నీకు చెప్పి బోర్ కొట్టిస్తున్నా" అంటూ నాకేసి చూశాడు.

లేదన్నట్లు తలూపాను. మీరూ కాలిఫోర్నియా వస్తే బావుండేది కదా? అని మరో సారి అన్నాను. "చెప్పినంత సులభం కాదు, ఇక్కడ నుండి కదలడం. బిల్ ఉంటే కాస్త బాసటగా ఉంటుంది. ఒప్పుకుంటాను. వాడున్న ఇంటి వెనుక ఇన్-లాస్ అపార్ట్‌మెంట్ కట్టిస్తానని అన్నాడు. ఒక్కోసారి అనిపిస్తూ ఉంటుంది. వెళితే బానే ఉంటుంది కదా అని. మా నాన్న నా గురించి వర్రీ అయ్యేవాడు. నేను యుద్ధాలూ, సైన్యం అంటూ ఎప్పుడూ వాళ్ళని పట్టించుకోలేదు. నేను కూడా చాలా ఆలస్యంగా పెళ్ళి చేసుకున్నాను. క్రిస్టీతో పెళ్ళైన కొన్నేళ్ళకి మా అమ్మా, నాన్నా పోయారు. బిల్ పుట్టేసరికి నాకు నలభై అయిదేళ్ళు. వాడికి వాడి కెరీర్ ముఖ్యం కదా? ఇక్కడ ఈ మాంట్‌గోమరీలో వాడికి నచ్చే ఉద్యోగం ఎక్కడా దొరకదు. చిన్నప్పటినుండీ వాడికి కంప్యూటర్ల పిచ్చి. వాడి భార్య కూడా అదే ఉద్యోగం! వాడి జీవితంలోకి మేం చొరబడకూడదనుకున్నాం. నువ్వు చెప్పినట్లు రావచ్చు. రాలేని పరిస్థితి అంతే!" చెబుతుంటే అతని గొంతు గద్గదికమైంది. అనవసరంగా అతన్ని మరోసారి కెలికి బాధ పెట్టాననిపించింది. మెల్లగా అతను సోఫాలోంచి లేచి హాలులో మెట్లవైపు నడిచాడు. వెనక్కితిరిగి

**థాంక్స్ గివింగ్ రోజు అనుకోకుండా తన కొలీగ్ తల్లిదండ్రుల ఇంటికి వెళ్ళాడతను. ఆ రాత్రి వాళ్ళు అతనితో ఎంతో హుషారుగా కబుర్లు చెబుతూ గడిపారు. ఒకేఒక్క గది తప్ప ఇల్లంతా అతనికి చూపించారు. ఆ గదిలోనే కాదు, మదిలో కూడా వాళ్ళెన్నో రహస్యాలు దాచిపెట్టారని తెలిశాక జాలిపడ్డాడతను. ఏం చెయ్యాలా అనే తపనలో కొట్టుమిట్టాడాడు. కానీ అంతలోనే అతడిలో ఆలోచనల అగ్నిపర్వతం బద్దలైంది!**

నన్ను కూడా రమ్మన్నట్లు సైగ చేశాడు. నేనూ లేచి వెళ్ళాను. ఒక గది తలుపు దగ్గర ఆగిపోయాడు. ఇంతకు ముందు ఆ గది తెరవబోతూంటే క్రిస్టీ వద్దని వారించడం గుర్తొచ్చింది.

'యూ మేడ్ మై డే, జెంటిల్‌మేన్...!' అంటూ నన్ను ఆలింగనం చేసుకొని మెల్లగా తలుపు తెరిచి లైటు వేశాడు.

ఆ గదంతా లైట్లతో మిరిమిట్లు గొలుపుతోంది. చాలా పెద్దగదిలో ఒక వైపు పెద్ద క్రిస్మస్ ట్రీ అలంకరించబడి ఉంది. ఆ చెట్టు చుట్టూ చాలా గిఫ్ట్లు పేరుకుపోయి ఉన్నాయి. ఆ చెట్టు దగ్గర నేలమీద కూర్చున్నాడు స్టీవ్. నన్నూ కూర్చోమని సైగ చేశాడు.

"మా ఇంట్లో క్రిస్మస్ అతి పెద్ద పండగ. ప్రతీఏటా ఘనంగా జరుపుకునేవాళ్ళం. మా కజిన్స్, రెలిటివ్స్ అందరూ వచ్చేవారు. చాలా మంది కజిన్స్ పోయారు. ప్రతీ ఏడూ అందరికీ గిఫ్ట్లు కొన్నట్లే బిల్ కోసమూ గిఫ్ట్లు కొంటాం. వాడు క్రిస్‌మస్‌కి వచ్చి పన్నెండేళ్ళ పైనే అయింది. ఈ గిఫ్ట్లు అన్నీ గత పన్నెండేళ్ళుగా వాడికోసం కొన్నవి. ఏటా వాడికోసం రెండు గిఫ్ట్లు కొంటాం. ఒకటి ఈ క్రిస్మస్‌చెట్టు దగ్గర, మరోటి వాడు రాకపోతే పంపడానికి. ఎప్పుడైనా క్రిస్‌మస్‌కి వాడు వస్తే వాడి చేత ఓపెన్ చేయిద్దామని నేనూ, క్రిస్టీ అనుకుంటూ ఉంటాం. వాడు వచ్చే సంవత్సరం వస్తానంటూ ప్రతీ క్రిస్‌మస్‌కి వాయిదా వేస్తాడు. చాలా ఏళ్ళుగా ఇదే వరస. మేమూ అడగటం మానేశాం. వీలు కుదిరితే వాడు రాకుండా ఉంటాడా? అని సర్దిచెప్పుకుంటూ ఉంటాను. ఇవాళ అనుకోకుండా నువ్వొచ్చావు. ఈ గిఫ్ట్లలో కొన్ని నువ్వు ఓపెన్ చెయ్యి. కొన్ని నువ్వు తీసుకో. బిల్‌కి కొన్ని ఇయ్యి. ఇదంతా నేను క్రిస్టీకి చెప్పదలుచుకోలేదు. చెప్పినా తనకి గుర్తుంటుందని అనుకోను. ఈ వ్యాధితో ఎన్నాళ్ళు బ్రతుకుతుందో తెలీదు. ఈ అల్జీమర్స్‌ని తనే కాదు. నేనూ భరించలేకపోతున్నాను. ఏదీ గుర్తుండదు. ఏం చేస్తోందో కూడా తనకి తెలియదు. తరచూ న్యుమోనియా జ్వరం ఒంట్లో శక్తినంతా తినేస్తోంది. ఎన్నో చెయ్యాలని ఉంటుంది కానీ, శరీరం సహకరించదు. ఒక్కోసారి బ్రతకడం ఇంత అవసరమా? అనిపిస్తూ ఉంటుంది" చెబుతున్నంతసేపూ అతని కళ్ళల్లో నీళ్ళు గమనిస్తూనే ఉన్నాను. నేను వెంటనే



లేచి అనునయంగా భుజం తట్టాను. అక్కడున్న గిఫ్ట్ ఒకటి చేతుల్లోకి తీసుకొని బిల్‌కి ఇస్తానని చెప్పాను. అతని ఎదుటే గిఫ్ట్ చుట్టూ కట్టిన రంగు కాగితాలు చించి తెరచి చూశాను. ఆశ్చర్యంగా అది ఒక గోల్డ్ కలర్ వాచీ. అది అసలు సిసలైన గోల్డేనని స్టీవ్ అన్నాడు. అక్కడ గిఫ్ట్స్ అన్నీ పరికించి చూశాను. కొన్నింటి మీద బిల్ పేరూ, బిల్ భార్య లోరా పేరుతో చాలానే ఉన్నాయి.

"ప్రతీ ఏటా థాంక్స్ గివింగ్ అవ్వగానే ఈ గది తెరుస్తాం. ఏడాదిపాటు పేరుకున్న దుమ్మూ, ధూళీ అంతా క్రిస్టీ స్వయంగా శుభ్రపరుస్తుంది. పని వాళ్ళని పెట్టమన్నా వినదు. అదో రకం పిచ్చి. క్రిస్‌మస్ ట్రీ డెకరేషన్ పనుల్లోనే మా కాలం గడిచిపోతుంది. ప్రతీ ఏటా వాడూ మాకు బహుమతులు పంపుతాడు. కానీ వాడు లేకుండా ఇవి.." అతనికి మాటలు పెగల్లేదు.

"స్టీవ్.." అతన్ని చూస్తే బాధ కలిగింది.

వెంటనే అతను సంబాళించుకుని. "నా మనసులోని చెత్తంతా నీ మీద కుమ్మరిస్తున్నాను. క్షమించు. ఒంటరితనం క్రూరమైంది" అన్నాడు. ఒక్కసారి తలుపుదగ్గర శబ్దం అయితే ఇద్దరం అటుగా చూశాం. తలుపు దగ్గర వీల్ చైర్లో క్రిస్టీ. ఆమె నిస్తేజంగా మాకేసి చూస్తోంది.

•••

ఆ మర్నాడు ఉదయం వెళుతూండగా వాళ్ళు నాకు గిఫ్ట్ ఇచ్చారు. వద్దని అంటే ఇది థాంక్స్ గివింగ్ ఆనవాయితీ అన్నారు. వాళ్ళని కష్టపెట్టడం ఇష్టంలేక తీసుకున్నాను.

"నిన్ను కలవడం చాలా సంతోషంగా ఉంది హారీ! చాలా రోజుల తరువాత క్రిస్టీ కళ్ళల్లో సంతోషం చూశాను. అఫ్ కోర్స్! నాక్కూడా.." అంటూ ఇద్దరూ నన్ను ఆలింగనం చేసుకున్నారు. కారు స్టార్ట్ చేస్తూండగా ఉండమన్నట్లు సైగ చేశాడు స్టీవ్. కారు అద్దాల కిటికీ తెరిచాను.

"నీ నుండి నాకొక ప్రామిస్ కావాలి" నాకేసి చూస్తూ అన్నాడు. అలాగేనన్నట్లు తలాడించాను. "క్రిస్‌మస్ ట్రీ గురించా?" సందేహంగా చూస్తూ అడిగాను. కాదన్నట్లు తలాడించాడు. "క్రిస్టీకి అల్జీమర్స్ అన్నది బిల్‌కి చెప్పొద్దు. వాడికి తెలీదు. వాడు వచ్చి చాలా ఏళ్ళయింది. ఎప్పుడైనా స్కైప్‌లో మాట్లాడినప్పుడు అది తెలియకుండా మేనేజ్ చేస్తాను. దయచేసి వాడికి చెప్పొద్దు. చెప్పి వాడిని కష్టపెట్టడం మాకు ఇష్టం లేదు.. ప్లీజ్".

"అల్జీమర్స్, అదేం చిన్నదికాదు" అప్రయత్నంగా అన్నాను. అతను విరక్తిగా నవ్వాడు. "చాలా ఏళ్ళుగా అంతకంటే పెద్దది మమ్మల్ని పీడిస్తోంది. దానిముందు.." తలూపుతూ మధ్యలో ఆపేశాడు స్టీవ్. ఏమిటన్నట్లు కళ్ళు చిట్లించి చూశాను. అతను చెయ్యి ఊపుతూ, వెనుతిరిగి తనలో తనే గొణుగుతూ లోపలికి వెళ్ళిపోయాడు. 'వృద్ధాప్యం"

మెల్లగా కారు పోనిచ్చాను. స్టీవ్ పరిస్థితి చూస్తే జాలేసింది. ఒకపక్క ఇల్లువదిలి వెళ్ళ లేడు. మరోపక్క కొడుకు కోసం ఆరాటం. వీటి మధ్య నలిగిపోయే రోజువారీ సమస్యలు.

బిల్ గురించి నాకు బాగా తెలుసు. రోజూ తలచుకుంటూ ఉంటాడు. ఎన్నో సార్లు తన తల్లిదండ్రుల గురించి చెప్పాడు. ఇప్పుడు కళ్ళారా స్టీవ్, క్రిస్టీల పరిస్థితి చూశాక ఈ విషయాలన్నీ బిల్‌కి చెప్పాలా? వద్దా? అన్నది నా మనసుని తొలిచేస్తోంది. ప్రతీక్షణం వాళ్ళు బిల్ వస్తే బావుండును. తమతో ఉంటే బాగుండుననీ కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటారు. ఒక్కోసారి బిల్ వస్తున్నట్లుగానే భ్రమిస్తారు. క్రిస్‌మస్ ట్రీ చుట్టూ వాళ్ళ ఎదురుచూపులు తిరుగుతూ ఉంటాయి. స్టీవ్ బిల్‌కోసం తాపత్రయ పడ్డట్టు నా కోసం మా నా... ఒక్కసారి ఆలోచన్ల అగ్నిపర్వతం బద్దలయ్యింది.

పంట కాలువ మీదుగా నన్ను బడికి తీసుకెళుతూ మా నాన్న నా కళ్ళల్లో కనిపించాడు.

నవ్య

# సొమ్ము ఒకళ్ళది... సోకు కాజల్‌ది!

సొమ్ము ఒకరిది సోకు ఒకరిది అన్నట్టు ఉంది కాజల్ వ్యవహారం అంటున్నారు సినీ జనాలు. వరుస ఫ్లాపులు తలుపు తడుతుంటే ఎంత జాగ్రత్తగా ఉండాలి? దర్శక నిర్మాతలతో ఎలా వ్యవహరించాలి? ఇవేవీ ఆలోచించకుండా కాజల్ ప్రవర్తిస్తోందని అంటున్నారు వారు. అజిత్ సినిమా షూటింగ్ కోసం యూరప్ వెళ్ళిన కాజల్ ఈసారి కుటుంబం మొత్తాన్ని తనతో తీసుకెళ్ళిందట! మామూలుగా కాజల్‌తో ఆమె మదర్ వస్తుంటారట! ఈసారి ఆమె ఫాదర్, సిస్టర్ కూడా వచ్చి చేరారు. దీంతో నిర్మాతకు ఖర్చు తడిసిమోపుడయ్యింది అంటున్నారు కోలీవుడ్ తమ్ముళ్ళు. ఇలాగే మరో రెండు సినిమాలకు చేసిందంటే ఇక ఇచ్చే ఛాన్సులు కూడా ఎవ్వరూ ఇవ్వరని చెబుతున్నారు.

# వెట్టి
## (ది వారియర్)
### -మధుబాబు




**'ఎవరో గుర్తుచేస్తే తప్ప నీ బిడ్డ నీకు గుర్తుకు రాలేదు. ఏమిటితల్లీ ఇది? రాజభోగాలు అనుభవిస్తూ హాయిగా ఇంటిపట్టున ఉండకుండా, ఈ తిరుగుడు దేనికి?' గద్గద స్వరంతో అతి నెమ్మదిగా అడిగాడు మునిరెడ్డి.**

**ఒక్క ముక్క కూడా అర్థం కాలేదు, చెవులు ఓరగా పెట్టి వింటున్న వెట్టికి. అయితే మునిరెడ్డి వైపు చూడలేదు అతను. పిచ్చమ్మి ముఖం మీదినించి పొరపాటున కూడా చూపును పక్కకు తిప్పలేదు.**

నేరేడుపళ్ళ మాదిరి నిగనిగ మెరిసే ఆమె కళ్ళు మునిరెడ్డి పలుకుల్ని ఆలకించిన వెంటనే స్వల్పంగా నీటితో నిండి పోయాయి. ఏదో సమాధానం చెప్పటం కోసం పెదవుల్ని విప్పి - అంతలోనే ఆ ప్రయత్నాన్ని వదిలేసింది.

'పిల్లల్ని కనటం వరకే పాములు చేసేపని. దగ్గర ఉండి పెంచటం కాదు. అయినా ఎందుకూ పనికిరాని దాన్ని. నా వల్ల ఏమౌతుంది? మా అమ్మ ఉందిగా చూసుకోవటానికి? నేను ఇంటిదగ్గర ఉన్నా ఒకటే, లేక పోయినా ఒకటే' ఎంతో ప్రయత్నం మీద మనసును కూడగట్టు కుంటున్నట్టు చాలా బరువుగా చెప్పింది.

'పెద్దమ్మగారు ఉన్నారు తల్లీ.. లేరనికాదుగానీ, కన్న తల్లివి నువ్వు. నీకు బాధ్యత అంటూ ఒకటి ఉన్నది కదా..' అన్నాడు మునిరెడ్డి.

మరింత శ్రద్ధగా ఆలకించటానికి సిద్ధం అయ్యాడు వెట్టి, పిచ్చమ్మిని గురించి వివరాలు పూర్తిగా తెలుస్తాయని.

'నీ చేత సుద్దులు చెప్పించుకోవటానికి నేను రాలేదు. నీకు బరువుగా అనిపిస్తే చెప్పు. ఇప్పుడే వెళ్ళిపోతాను' ఉన్నట్లుండి సీరియస్ అయిపోయింది ఆమె. విసురుగా సోఫాలో నుంచి లేచింది.

'అయ్యయ్యో! అలా మాట్లాడకు తల్లీ.. నువ్వు బరువు అవటం ఏమిటమ్మా. మీ దయాధర్మభిక్షం మీద బతికేవాళ్ళం. ఈ ఇల్లు, ఈ వైభోగం అన్నీ మీరు ఇచ్చినటువంటివి. మీరు లేచి నిలబడమంటే లేచి నిల్చొని, కూర్చోమంటే కూర్చునేవాళ్ళం. మీరు బరువుకాదు తల్లీ... ఇంకెప్పుడూ అటువంటి మాటలు మాట్లాడకండి..' గబగబా అన్నాడు మునిరెడ్డి.

'మాకు ఆకలి వేస్తోంది. భోజనం సంగతి చూడు' తడి ఆరిపోయిన తలకట్టును ముడి వేసుకుంటూ చెప్పింది ఆమె.

నోరు తెరుచుకుని చూస్తున్న భార్య వైపు తిరిగి మహా హడావిడి చేసేశాడు మునిరెడ్డి.

'మట్టిగోడ మాదిరి నిలబడి పిచ్చిచూపులు చూస్తావేమిటి? అమ్మాయిగారికి వెంటనే భోజనం సంగతి చూడు..'

పగవాళ్ళు వెంటపడి తరుముతున్నట్టు లోపలి గదుల్లోకి పరిగెత్తింది ఆమె.

రెండు నిమిషాల తరువాత 'లోపలికి రండి తల్లీ.. భోజనం సిద్ధమైంది, రండి' బయటికి వస్తూ ఆహ్వానించింది.

సోఫాలో నుంచి లేచి నిలబడింది పిచ్చమ్మి. మునిరెడ్డి భార్య వైపు రెండే రెండు అడుగులు వేసి, చటుక్కున వెనక్కి తిరిగింది.

కూర్చున్న చోటి నుంచి కదలకుండా, తను విన్న విషయాలను ఆకళింపు చేసుకోవటానికి ప్రయ

## జరిగిన కథ

తనను తిరిగి బానిసగా మార్చాలని ప్రయత్నం చేస్తున్న గూండా ముఠాలకు కనిపించకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. బస్సు ప్రమాదంలో చిక్కుకున్న ప్రయాణికుల్ని ప్రాణాలకు తెగించి కాపాడి ఆ ఊరివాళ్ళ ఆదరణ పొందుతాడు. ఎక్కడినుంచో ఆ ఊరికి వచ్చి నాగదేవతగా ఊరివాళ్ళ ప్రేమాభిమానాలు పొందుతుంది ఒక అమ్మి. వెట్టిని ఆ ఊరు నుంచి దూరంగా తీసుకుపోయి గూండాల బారిన పడకుండా కాపాడుతుంది ఆ అమ్మి. ఆమె తెగువ, నైపుణ్యం, చాకచక్యం చూసి అబ్బురపడతాడు వెట్టి. ఇంటినుండి పారిపోయిన ఆ అమ్మి చాలారోజుల తర్వాత వెట్టిని వెంటబెట్టుకుని తిరిగి తనింటికి వెళుతుంది. ఆమె ఇచ్చిన ఆతిథ్యం, వైభవం చూసి అవాక్కవుతాడు వెట్టి. ఆ తర్వాత......

త్నిస్తున్నాడు వెట్టి.

'బొట్టు, కాటుక పెట్టి పిలిస్తేగాని బయలు దేరటం నీకు అలవాటులేదా? నీకు ఆకలి వేయటం లేదా?' చురుకుగా చూస్తూ అడిగింది ఆమె.

వీపుమీద ఎవరో చాచిపెట్టి చరిచినట్లు ఉలిక్కి పడి, అంతలోనే సర్దేసుకున్నాడు అతను. గబుక్కున సోఫాలో నుంచి లేచాడు.

'ఇతను నా మనిషని నిన్న చూస్తూనే చెప్పాను. మర్చిపోయావా? ఇతనికి మర్యాద చేయటం అనవసరమని ఏమైనా అనుకున్నావా?' మునిరెడ్డి వైపు చురచుర చూస్తూ అడిగింది ఆమె.

చేతులు ఎత్తి చకచకా చెంపలు వాయించుకున్నాడు మునిరెడ్డి. 'అటువంటిదేమీ లేదు తల్లీ. ముందు నువ్వు ఆరగించిన తర్వాత నేనే దగ్గరుండి తినిపిద్దామని అనుకున్నా. అందుకే ఏమీ మాట్లాడలేదు' అంటూ ఆమెకు క్షమాపణలు చెప్పాడు. 'పద అబ్బయ్యా... నువ్వుకూడా తిందువుగాని. లోపలికి పద..' అంటూ భుజం మీద చెయ్యివేసి లోపలి గదుల్లోకి నడిపించాడు.

'ఆ అబ్బయ్యను చూస్తుంటే ఆషామాషీగా కనిపిస్తున్నాడని భ్రమపడకు. ఒంట్లో ఓపికలేక వేళ్ళాడబడిపోతున్నాడు గాని, గుండెలు తీసిన బంటు. కర్ర చేతికి దొరికిందంటే... మెట్టభూమిలో దుక్కిదున్నుడే' నవ్వుతూ చెప్పింది పిచ్చమ్మి.

'నీ పేరేంటి అబ్బయ్యా?' చిన్నగా అడిగాడు మునిరెడ్డి.

'ప్రస్తుతానికి నువ్వు పిలిచిందే. పెద్దగా గుర్తు పెట్టుకోవాల్సింది కాదు.. పదిసార్లు పైకి చెప్పుకో తగింది కూడా కాదు' అన్నాడు వెట్టి.

లోపలిగదుల్లో అతనికి కనిపించింది తాము ఖాళీచేసి వచ్చిన హాలు వంటి మరోపెద్ద గది. నగిషీలు చెక్కి కనీసం పది పదిహేనుమంది కూర్చోవటానికి అనువుగా ఉన్న డైనింగ్ టేబుల్ కూడా అగుపించింది.

సెగలుపొగలు వెలువరుస్తున్న వరి అన్నం ఒక పాత్రలో నిండుగా ఉంది. అప్పుడే కాల్పించిన జొన్నరొట్టెలు మరో పాత్రలో పేర్చి ఉన్నాయి.

'దీక్ష పట్టాను నేను. శాకాహారం తప్ప మరేదీ ముట్టుకోను' ఒక కుర్చీలో కూర్చుని రొట్టెల పాత్రలో నుంచి రెండు రొట్టెలు తన ప్లేటులోకి తీసుకుంటూ చెప్పింది పిచ్చమ్మి.

'నీ సంగతేమిటి అబ్బయ్యా... నువ్వు కూడా దీక్షేనా? చికెనుంది. జున్నుముక్కల వంటి వేటమాంసపు కూరుంది..' ఆ పాత్రల్ని అతనివైపు జరుపుతూ అన్నాడు మునిరెడ్డి.

'దీక్ష నేను పట్టలేదు గాని, సరైన తిండి తిని చాలా రోజులయింది. ఇప్పుడు సడన్‌గా ఆ కూరలు తింటే హరాయించుకోగలననే నమ్మకం లేదు. నేను కూడా శాకాహారమే" అన్నాడు వెట్టి.

'తిండి తినటం పూర్తి అయిన తర్వాత మన మిద్దరం మేడమీదికిపోయి కాసేపు మాట్లాడుకోవాలి. ఓపిక ఉంటుందా?' పక్కనే కూర్చుని, అతనికి తనే వడ్డన చేస్తూ అతి రహస్యంగా అడి



గాడు మునిరెడ్డి.

పిచ్చమ్మి చూపులు తన మీద, మునిరెడ్డి ముఖం మీద కేంద్రీకరించి ఉండటాన్ని గమనించాడు వెట్టి. మౌనంగా తల ఊపాడు.

'మునిరెడ్డి అంటే మామూలోడు కాదు. నోరు తెరవక ముందే నువ్వు నిన్నపొద్దున తిన్న తిండి ఎటువంటిదో చెప్పేయగలడు. నేను దగ్గర లేకుండా నువ్వు మంతనాలాడితే చిటికెలో బట్టబయలు అయిపోతాయి నీ గుట్టుమట్లు' తన ముందున్న ప్లేటు మీది నించి దృష్టిని మరల్చనట్లు కనిపిస్తున్న పిచ్చమ్మి వెంటనే హెచ్చరించింది అతన్ని.

ఉలిక్కిపడి కుర్చీలో నిదారుగా కూర్చున్నాడు మునిరెడ్డి.

చిన్నగా నవ్వాడు వెట్టి.

'ఎందుకు నవ్వు?' తలతిప్పి చూస్తూ కోరగా అడిగింది ఆమె.

'తల్లీ, నీకు కళ్ళతోపాటు చెవులు కూడా చెప్పుకో దగినటువంటివే' అన్నాడు అతను.

కిలకిలా నవ్వింది ఆమె. 'అంతే మరి. పాముని కదా! ఈ ఇంటిముందు వీధిలో నిలబడి మాట్లాడినా వినబడిపోతుంది' ఎడమచేత్తో తన తలకట్టు సరిచేసుకుంటూ సగర్వంగా చెప్పింది.

ఆమె కల్పించుకుని, తనను మునిరెడ్డితో మేడ మీదికి పోకుండా అడ్డుకోకపోతే, ఆమె నోటివెంట ఆ పాము మాటలు ఎందుకు వస్తున్నాయో తెలుసుకోవటం చాలా మంచిదనే ఆలోచన ఒకటి వచ్చింది అతనికి వెంటనే.

అంతలోనే మరో ఆలోచన మనసులో అడుగుపెట్టి అతన్ని బాగా కలిచివేసింది. మంచికో చెడుకో తనతో కలిసి కంకరరోడ్డు గ్రామంలో నుంచి ఇవతలికి వచ్చేసింది ఆమె. దేవుడు చల్లగా చూశాడు. ఆమె ఎవరో తెలిసిన వాళ్ళను చేరుకోవడం జరిగింది.

బయటికి చెప్పడం లేదుగాని, ఎవరెవరికో కబురు అందించే ఉంటాడు మునిరెడ్డి. ఏ క్షణంలోనైనా రావచ్చు ఆమెకు కావాల్సిన జనం. వచ్చిన వెంటనే మరొక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా తమవెంట తీసుకెళ్ళిపోవచ్చు.

ఊరు పేరు చెప్పుకోకుండా, ఎక్కడికి పోతున్నాడో ఎవరికీ తెలియనీయకుండా ఆమెను వెంట బెట్టుకువచ్చిన తనను గురించి వాళ్ళు పట్టించుకోకూడదు. తను ఎవరో తెలియకముందే అవతలికి జారుకోవటమంత మంచి పని మరొకటి ఉండదు.

ఆ మాటలు మనసులో మెదిలిన వెంటనే అణిగిపోయింది అతనిలో ఆరంభమైన ఆందోళన. వంచిన తల ఎత్తకుండా ప్లేటులో ఉన్న పదార్థాలన్నిటినీ ఆరగించి పైకి లేచాడు.

'అయ్యయ్యో... అప్పుడే ఆపేశావేంటి అబ్బయ్యా. పాయసం ఉంది. మిరపకాయ బజ్జీలున్నాయి. మీగడ పెరుగుంది' అంటూ అభ్యంతరం చెప్పబోయిన మునిరెడ్డిని ఒకే ఒక్క చూపుతో నోరు మూయించింది పిచ్చమ్మి.

'చిన్నపిల్లాడు కాదు. ఎంత తినవచ్చో ఏమి తినవచ్చో బాగా తెలిసినవాడు. చెవికోసిన మేక మాదిరి ఊరికే సొద చెప్పి బుర్ర తినబోకు' అంటూ తాను కూడా లేచింది ప్లేటు ముందునుంచి.

అందమైన వాష్‌బేసిన్ దగ్గర చేతుల్ని శుభ్రపరుచుకుని, మునిరెడ్డి అందించిన టవల్‌తో తుడుచుకుంటూ సోఫాలున్న హాల్లోకి వచ్చాడు వెట్టి.

అదే సమయంలో అతని చెవులకు చేరింది ఆ ఇంటి ముందుకు ఏవో వెహికల్స్ వచ్చి నిలబడిన శబ్దం.

తగ్గిపోయిన జ్వరం మరోసారి వచ్చినట్లు ఒక్కసారిగా వేడెక్కిపోయింది అతని ముఖం. వేగంగా కొట్టుకోవటం మొదలు పెట్టాయి గుండెలు. తనకు తెలియకుండానే ప్యాంటుజేబులో చేయిపెట్టాడు, భద్రంగా దాచుకున్న నాటు రివాల్వర్ కోసం.

'నువ్వు కంగారుపడాల్సిన అవసరం లేదు. ఎవరు వచ్చినా మునిరెడ్డి చూసుకోగలడు. మరేం పరవాలేదు' వెనుక నుంచి చిన్నగా హెచ్చరించింది పిచ్చమ్మి.

కిరకిరమని శబ్దం చేస్తూ మెయిన్‌గేటు తెరుచుకుంటున్న చప్పుడు... బరువైన పాదాలు ముఖద్వారం దగ్గరికి వచ్చిన శబ్దాలు వెంటవెంటనే వినిపించాయి.

'మునిరెడ్డీ.. ఓయ్ మునిరెడ్డీ..' కీచుగా ఉన్న కంఠం ఒకటి బిగ్గరగా పిలవటం కూడా వినవచ్చింది.

శిలావిగ్రహంలా బిగుసుకుపోయిన వెట్టి వంక ఒకసారి వింతగా చూసి, వేగంగా తలుపుల దగ్గరికి పోయాడు మునిరెడ్డి.

'నేనేనబ్బా... పగిడయ్యని. నీతో మాట్లాడాలని వచ్చినా.' అతను తలుపులు తెరవకముందే మరోసారి వినిపించిందా కీచుకంఠం.

'ఏంటి సంగతి పగిడయ్య. ఇంత రాత్రివేళ నాతో నువ్వు మాట్లాడేది ఏముంది?' తలుపులు ఓరగా తెరిచి, హాల్లో వాళ్ళు బయటికి కనిపించకముందే, తను వెలుపలికి పోయి, తలుపులు మూస్తూ అడిగాడు మునిరెడ్డి.

'పిచ్చోడి మాదిరిగా చినిగిపోయిన చొక్కాలాగుతో ఒకడు మనూళ్ళోకి వచ్చాడు. వంతెన వాగు అవతల మా వోళ్ళను చితకబాది మరీ వచ్చాడు' మాటలు మొదలు పెట్టాడు బయట ఉన్న మనిషి.

'నాకెందుకు చెపుతున్నట్టు?' అడిగాడు మునిరెడ్డి.

చక్కటి సదుపాయాలతో వాళ్ళిద్దరికీ ఆతిథ్యం ఇచ్చాడతను. మెత్తటి శయ్యలపై నిద్రకు ఉపక్రమించారు. కానీ అంతలోనే శత్రువుల జాడ పసిగట్టిందా అమ్మి. అతడిని నిద్రలేపింది. గుట్టుచప్పుడు కాకుండా పెరటిమార్గంలో గోడదూకి బయటకు వచ్చారిద్దరూ. ఇంతకూ వాళ్ళిద్దరూ పిక్కబలం చూపించి పారిపోయారా? లేక శత్రువులపై మెరుపుదాడి చేశారా? ఆ చీకట్లో ఏం జరిగింది?

'ఆడితోపాటు ఇంతపెద్ద తలకట్టున్న ఆడమనిషి కూడా ఈ వీధిలోకి వచ్చిందట' అన్నాడు అతను.

'ఎవరు చెప్పారు?' మరింత అసహనంగా అడిగాడు మునిరెడ్డి.

'బస్టాండ్ దగ్గర అడుక్కునే అమ్మికి డబ్బులు ఇచ్చిందిట ఆ ఆడమనిషి. ఇద్దరూ కలిసి ఇటుగానే వచ్చార్ట. నీకు గానీ, నీ జతగానికి గానీ ఏమైనా కనిపించారా?' సూటిగా తను వచ్చిన పనిని బయట పెట్టేశాడు ఆ మనిషి.

చెమటలతో తడిసిపోయింది హాల్లో నిలబడి ఉన్న వెట్టి ముఖం.

'మంచికి పోతే చెడు ఎదురవటం అంటే ఇదే కాబోలు. కడుపు నిండా తిండి తినమని డబ్బులు ఇస్తే ఆనవాళ్ళతో సహా వాళ్ళకు వివరించి చెప్పేసిందా దరిద్రపు ముఖం' వెట్టి వెనకాలే నిలబడి పళ్ళు కొరుకుతూ అన్నది పిచ్చమ్మి.

ఆమె మాట్లాడటం మొదలుపెట్టిన వెంటనే, వదిలిపోయింది వెట్టిని ఆవరించుకుని ఉన్న చికాకు.

'పెద్దగా మాట్లాడబోకు తల్లీ. బయటికి వినిపించిందంటే తోడేళ్ళ మాదిరి వచ్చేస్తారు లోపలికి' తలతిప్పి చిన్న కంఠంతో ఆమెను హెచ్చరించాడు.

'అదేమంత తేలికకాదు. మునిరెడ్డిని దాటి లోపలికి రావటం మాటలు చెప్పినంత తేలిక కాదు. మరేం భయం లేదు' తేలికగా కొట్టిపారేసింది పిచ్చమ్మి.

'తల్లీ... నీకు తెలియదు. ఒక మునిరెడ్డి కాదు. వందమంది మునిరెడ్లున్నా వాళ్ళు ఆగరు. వాళ్ళు మనుష్యులు కాదు తల్లీ... రాక్షసులు..' అంటూ నిలబడిన ప్రదేశంలో నుంచి బాగా వెనక్కి జరిగి నిలబడ్డాడు అతను.

'నువ్వు బాగా భయపడిపోతున్నావ్. వాళ్ళు ఎవరోగాని, నిన్ను వణికించేస్తున్నారు. ఏం జరిగింది? ఎవర్నయినా చంపేసి పారిపోయి వచ్చావా?' అతనితో పాటు తను కూడా వెనక్కి జరుగుతూ అడిగింది పిచ్చమ్మి.

'లేదమ్మా.. చంపలేదు. చంపేసినట్లయితే చాలా బాగుండి ఉండేదని ఇపుడు అనిపిస్తోంది. కాసేపు కళ్ళు మూసుకుని చిన్న కునుకు కూడా తీయటానికి వీలు లేకుండా ఉంది" పళ్ళు బిగపడుతూ చెప్పాడు అతను.

బయట సంభాషణ కంటిన్యూ అవుతూనే ఉన్నది.

'అలాగా! మీ ఓళ్ళని చావచితకబాదినాడా? భలే మాట చెపుతున్నావ్... పగిడయ్య జనాల్ని కొట్టగలిగినోడు ఎవరైనా ఉన్నాడంటే నాకు చూడాలని ఉంది' ఆశ్చర్యంగా అంటున్నాడు మునిరెడ్డి.

'చతుర్లు వద్దులే మునిరెడ్డీ. మీ ఓళ్ళకి చెప్పి ఉంచు. ఆడు మాకు కావాలి. ఆడితోపాటు ఆ తలకట్టు ఆడమనిషి కనిపించినాసరే, ఆడు దొరికిపోతాడు'



అన్నాడు అవతల మనిషి.

'తప్పకుండా చెప్పి ఉంచుతా. ఆడు కనిపించిన వెంటనే నీకు ఫోన్ కొడతా సరేనా?' భరోసా ఇచ్చాడు మునిరెడ్డి.

'మంచిది మునిరెడ్డీ... మనం మనం ఒకటి. ఇట్టాంటి విషయాల్లో మనకి మనం సాయం చేసుకుంటూ ఉండాలి' అంటూ వెనక్కితిరిగి ఉన్నట్లుండి ఆగిపోయాడు వచ్చిన ఆ మనిషి.

'అడుగుదామని అనుకుంటూనే మర్చిపోయినా. మీ పెద్దమ్మ కూతురు పిచ్చెక్కి ఇంట్లో నుంచి పారిపోయిందని విన్నాను. ఏమైంది? కనబడిందా?' అని అడిగాడు.

వెట్టికి దగ్గరే కామ్‌గా నిలబడి ఉన్న పిచ్చమ్మి ముఖం ఒక్కసారిగా ఎర్రబడిపోయింది. దవడలు బిగుసుకున్నాయి. పాము మాదిరి బుస్సుమనే శబ్దం ఒకటి వెలువడింది ఆమె పెదవుల మధ్యలో నుంచి.

'అయిపోయాడు. ఆ వెధవని నిలబెట్టి నరికేయకపోతే పేరు మార్చుకుంటాను' అంటూ రివ్వున ముఖద్వారం దగ్గరకు పరిగెత్తబోయింది.

వేగంగా కదిలి ఆమె భుజాల్ని గట్టిగా పట్టుకుని బలవంతంగా ఆపేశాడు వెట్టి. 'తల్లీ.. నువ్వు కనిపిస్తే నా గుట్టు రట్టు అయిపోతుంది. నన్నొక్కడినే కాదు, మునిరెడ్డిని కూడా చంపేస్తారు. ఆగిపో తల్లీ' ఆందోళన నిండిన కంఠంతో అంటూ, అరచేత్తో ఆమె నోటిని బలంగా అదిమేశాడు.

'వెతుకుతున్నారు. మా అమ్మాయిగారు కోలుగుట్ల దగ్గర ఎవరో స్నేహితురాలు ఉంటే ఆడికి పోయినట్లు తెలిసింది. రేపు ఈపాటికి ఇంటికి తీసుకు వచ్చేస్తారు' అంటున్నాడు మునిరెడ్డి.

'మంచి డాక్టర్‌కి చూపించి మందులు వాడాలి మునిరెడ్డీ. ఇంట్లో అట్టిపెట్టుకు కూర్చోకూడదు. వస్తా. నా పని మర్చిపోకు' అంటూ గబగబా అడుగులు వేశాడు అవతలి మనిషి. గేటు దాటి వీధిలో నిలబడి ఉన్న వెహికల్‌లో కూర్చున్నట్లున్నాడు - వెట్టి చెవులకు చేరింది ఆ బండి వదిలి దూరంగా వెళ్ళిపోతున్న శబ్దం.

'నా నోటినే అదిమి పట్టుకుంటావా? నీకెంత ధైర్యం? నీ అంతు చూస్తానని నీకు తెలియదా?' తన నోటిని అదుముతున్న వెట్టి చేతిని విదిలించి కొడుతూ కోపంగా అడిగింది పిచ్చమ్మి.

'ఇప్పుడు వచ్చినవాడు ఏదోపేరు చెప్తున్నాడు... ఏమిటది?' అడిగాడు అతను.

"పగిడయ్య. నన్ను డాక్టర్‌కి చూపించమని సలహా ఇచ్చాడు. వాడిని కూడా ఒక చూపు చూడాల్సిందే" కచ్చగా అన్నది పిచ్చమ్మి.

'వాడికి కనిపించి ప్రాణాలు పోగొట్టుకోవటం కంటే, నీ చేతుల్లో చచ్చిపోవటం చాలా సుఖంగా ఉంటుంది తల్లీ. నాగదేవతవి కదా! సరాసరి స్వర్గానికి వెళ్ళిపోతాను' సీరియస్‌గా ముఖం పెడుతూ అన్నాడు అతను.

కనులు ఎర్రగా చేసి కోరగా చూస్తున్న పిచ్చమ్మి ఫక్కున నవ్వింది. 'భయపడ్డావా! నిజంగానే నేను పెనుపామునను కుని వణికిపోయావా?' అని అడిగింది.

'వణికిపోవటం ఏమిటి తల్లీ. పెద్దగా ఏడవాలనిపించింది' గంభీరంగా అన్నాడు వెట్టి.

'నువ్వు నన్ను ఎగతాళి చేస్తున్నట్టు నాకు తెలుసు. నా బుసబుసల్ని చూసి భయపడని వాడివి నువ్వు ఒక్కడివే' అంటూ ఒక్క క్షణం ఆగి, అది సరేగాని, నీ గుట్టు నా గుట్టు బట్టబయలు అయిపోయింది. ఇప్పుడు ఏం చేయాలని నీ అభిప్రాయం?' అడిగింది.

తన నిర్ణయాన్ని ఆమెకు చెప్పటం అనవసరం అనిపించింది వెట్టికి. 'చూద్దాం తల్లీ. ముందు హాయిగా నిద్రపోవాలి. ఆ తర్వాత పొద్దున్నే లేవగానే వేడి వేడి టీ తాగి అప్పుడు ఆలోచించుకుందాం' అన్నాడు.

ఏదో చెప్పటానికి నోరు తెరిచి, వెంటనే ఆగిపోయింది పిచ్చమ్మి. ముఖద్వారాన్ని మూసి, గడియ గట్టిగా బిగించి హాల్లోకి వచ్చాడు మునిరెడ్డి.

'గువ్వలగుట్ట దగ్గర చాలా పెద్ద గ్రానైట్ మైన్స్ ఉన్నాయి. పెద్దపెద్దోళ్ళ అండతో నడిచే ఇండస్ట్రీ అది. ఇప్పుడు వచ్చిన ఈ పగిడయ్య ఈ ఊళ్ళో వాళ్ళకి ఏజెంటు. ఇట్టాంటివాళ్ళు ఇంకా చాలామంది వాళ్ళ చేతికింద విశ్వాసంగా పని చేస్తుంటారు. ఆళ్ళదారికి అడ్డం పోయినోళ్ళందరూ ఆ గ్రానైట్ రాళ్ళని రుద్దే మెషీన్లలో పడి అయిపు లేకుండా పోయినారు. నువ్వు ఏం చేశావ్ అబ్బయ్యా?' వస్తూనే అడిగాడు వెట్టిని.

'ఇతను ఏమీ చేయలేదు. ఆళ్ళే అదే పనిగా వెంటబడుతుంటే తప్పించుకుని పారిపోయి వస్తున్నాడు' తడుము కోకుండా చెప్పింది పిచ్చమ్మి.

'నువ్వు ఆగు తల్లీ. నీకు తెలియదు. నా గుమ్మం దాకా వచ్చాడంటే ఆ పగిడయ్యకి ఏదో గట్టి ఆధారమే కనిపించి ఉంటుంది' వెట్టి ముఖంలోకి సూటిగా చూస్తూ అన్నాడు మునిరెడ్డి.

'వాడి సంగతి పక్కన పెట్టేయ్. ఇప్పుడు నేను ఇక్కడ ఉండగా వాళ్ళు నన్ను గమనిస్తే నీ పరిస్థితి ఏమిటి?' తను కూడా సూటిగా అడిగాడు వెట్టి.

'కష్టమైపోతుందబ్బయ్యా. గువ్వలగుట్ట గ్రానైటోళ్ళతో పెట్టుకోవటం కంటే, దేశం వదిలి దూరంగా పారిపోవటం చాలా మంచిది. అవసరం అయితే ఆరు జిల్లాల నుంచి జనాల్ని దింపగలరు. నడివీధిలో నాలుగు వేలమంది చూస్తుండగా ఏమైనా చేయగలరు' బరువుగా అన్నాడు మునిరెడ్డి.

అతని అభిప్రాయం ఏమిటో వెంటనే అర్థమైపోయింది వెట్టికి. అప్పటికప్పుడు నోరు తెరచి తన మనసులోని మాటను బయట పెట్టలేదతను.

ఉన్నట్లుండి బిగ్గరగా ఆవులించింది పిచ్చమ్మి. 'నాకు నిద్ర తన్నుకుంటూ వచ్చేస్తోంది. ఎక్కడ పడుకోవాలో చెప్పు మునిరెడ్డి...ఈ సోఫాలో పడుకోమంటావా?' అని అడిగింది.

గ్రానైట్ గనుల వాళ్ళ ఆలోచనల్ని వెంటనే మర్చిపోయాడు మునిరెడ్డి. 'అయ్యయ్యో... సోఫాలో పడుకోవటం ఏమిటి తల్లీ. బెడ్‌రూములు ఉన్నాయ్. మెత్తటి బెడ్లున్నాయ్..' అంటూ తన భార్యను పిలవటానికి రెడీ అయినాడు.

నోరు తెరవాల్సిన అవసరం లేకపోయింది. అవతలి గదిలో తలుపుల దగ్గరే నిలబడి ఉన్నది ఆమె. వెంటనే లోపలికి వచ్చింది. 'రండి అమ్మాయిగారూ. మీ కోసం పడక సిద్ధంగా ఉంది' అంటూ చేయి పట్టుకోబోయింది.

'నా సంగతి సరే. మరి నా మనిషి సంగతేమిటి?' ఆ చేతిని విదిలించి కొడుతూ అడిగింది పిచ్చమ్మి.

'అతనికి కూడా రెడీగానే ఉందమ్మా. మీరు వచ్చేయండి' అంటూ ఈసారి చేతిని పట్టుకునే ఆలోచన చేయకుండా ముందుండి దారి చూపించింది ఆమె.

'రా అబ్బయ్యా... నీకు నేను చూపిస్తాను' అంటూ వెట్టిని వెంట బెట్టుకుని, ఆ హాల్లోనే ఒక మూలన ఉన్న మెట్ల మీదుగా మేడ మీది పెద్ద గదిలోకి తీసుకుపోయాడు మునిరెడ్డి.

గది మధ్యలో ఉన్న ఫోమ్‌బెడ్ చూడగానే వెట్టికి కూడా ఆవులింతలు వచ్చేశాయి. బెడ్‌మీద కూర్చున్న వెంటనే మూతలు పడటం మొదలుపెట్టాయి కళ్ళు.

'నువ్వు పడుకో అబ్బయ్య. తెల్లారి మాట్లాడుకుందాం. నేను వచ్చి పిలిచేవరకూ నువ్వు మాత్రం కిందికి రాకు. నా దగ్గర పనిచేసేవాళ్ళు విశ్వాసంగానే ఉంటారు గాని, గుడ్డిగా నమ్మడం మాత్రం మంచిది కాదు' అని చెప్పి కిందికి వెళ్ళిపోయాడు మునిరెడ్డి.

బెడ్‌మీద వాలిపోయాడు వెట్టి. అప్పుడప్పుడు సన్నసన్నగా సలపరిస్తున్న ఒంటి నొప్పుల్ని మరిచిపోయాడు. తానున్న పరిస్థితి గురించి ఆలోచించటాన్ని కూడా వదిలేశాడు.

'నీకు బుద్ధిలేదు. బెడ్ దొరికిందేచాలని అనుకుంటున్నావు కాబోలు' అంటూ సన్నటి కంఠం ఒకటి చిన్నగా హెచ్చరించి, భుజాన్ని గట్టిగా కదపటంతో అదిరిపడి కనులు తెరిచాడు.

నీడమాదిరి నిలబడి ఉంది పిచ్చమ్మి, అతని పడక పక్కన.

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత






### కవలలు

*మేం కవల పిల్లలం...*
*నేను పుట్టిన మరుక్షణమే*
*వాడు పుట్టాడు*
*కాదు కాదు, వాడ్ని వెనక్కు నెట్టి*
*పుట్టాను నేను*
*అప్పుడే మొదలైంది పందెం*
*మా ఇద్దరి మధ్య పందెం*
*గెలుపుకోసం పరుగు*
*వాడిపై గెలవాలని నేను*
*నన్ను ఓడించాలని వాడు*
*తెలుసు-*
*వాడే గెలుస్తాడు*
*నేనే ఒక బలహీన క్షణంలో లొంగిపోతాను*
*ఎంతైనా నా బుజ్జి తమ్ముడు కదా వాడు!*
*నేను జీవితం*
*వాడు మరణం!*

**-ఎల్.ఆర్.స్వామి**
**సెల్:99490 75859**

'తల్లీ... నువ్వు ఇక్కడికి... ఈ టైంలో' కంగారుగా అంటూ బెడ్ దిగాడు.

'ఇందాక మునిరెడ్డి నిజమే చెప్పాడు. ఆ పగిడయ్య ఎవడో గాని, వాడికి ఏదో గట్టి ఆధారమే దొరికింది. నేను డబ్బులు ఇచ్చిన బుద్ధి తక్కువ ఆడ మనిషి మనం ఇక్కడికి రావటాన్ని చూసే ఉంటుంది' రహస్యంగా చెప్పింది పిచ్చమ్మి.

'అది సరే తల్లీ. నువ్విప్పుడు ఇక్కడికెందుకు రావటం?' అడిగాడతడు.

అతని చేతిని పట్టుకుని వీధిని ఫేస్ చేస్తూ ఉండే ఒక విండో దగ్గరికి తీసుకుపోయిందామె. 'చూడు.. కళ్ళు పెద్దవి చేసుకుని చూడు' అని చెప్పింది.

అలాగే పరిశీలనగా చూశాడు వెట్టి. పది క్షణాల తరువాత కరెంట్ షాక్ కొట్టినట్లు అదిరిపడ్డాడు.

మునిరెడ్డి బిల్డింగ్‌కి యాభై గజాల దూరంలో వీధికి ఆవలి పక్కన ఉన్నది ఒక రేకుల షెడ్డు. ఆ షెడ్‌లో నిలబడి ఉన్నారు నలుగురు. షెడ్ పక్కన నీడలలో కూర్చుని ఉన్నారు మరో నలుగురు.

నీరసంగా షెడ్ గోడల్ని ఆనుకుని కనులు మూసుకుని ఉన్నాడు ఒక పర్సనాలిటీ. అతన్నే వేలుపెట్టి చూపించింది పిచ్చమ్మి.

'కంకర రోడ్డు మీద నువ్వు కొట్టిన దెబ్బలకు బోర్లాపడిపోయిన వాళ్ళున్నారు. చచ్చిపోయాడనుకున్న చవట ఇంకా బతికే ఉన్నాడు. నాకు చాలా అవమానంగా ఉంది' షెడ్ గోడల్ని ఆనుకుని కనులు మూసుకుని ఉన్న మనిషిని చూపిస్తూ, పళ్ళు బిగించి చెప్పింది.

పాము కాటుకు తలకిందులైంది అతనేనని గుర్తుపట్టాడు వెట్టి. తను ఎలా ఉంటాడో తెలిసినవాళ్ళు వారందరూ! తెల్లవారగానే ధైర్యంగా వచ్చి మునిరెడ్డిని నిలదీస్తే పరిస్థితి ఎలా ఉంటుందో ఎవరూ చెప్పలేరు.

'ఏం చేయాలని అనుకుంటున్నావ్?' ఉన్నట్లుండి అతని ముఖంలోకి చూస్తూ అడిగింది పిచ్చమ్మి.

అప్పటికే ఒక నిర్ణయానికి వచ్చేశాడు అతను. అయితే తను ఏం చేయాలని అనుకుంటున్నాడో వెంటనే బయట పెట్టలేదు.

'చెట్టంత తాచుపామువి....స్వయంగా నాగమ్మ తల్లివి...నువ్వు నా పక్కనే ఉన్నావు. ఏం చేస్తే బాగుంటుందో నువ్వే చెప్పు' అన్నాడు.

నొసలు ముడిచి తీవ్రంగా చూస్తూ 'పరాచికాలు పనికి రావు. నువ్వు కనిపించిన వెంటనే మక్కెలు విరగేసి ముళ్ళ కొండను ఈడ్చినట్లు వీధుల్లో ఈడ్చుకుంటూ తీసుకుపోతారు. ఆలస్యం చేయకుండా అవతలికి పారిపోవటమే నువ్వు చేయాల్సిన పని' అని చెప్పింది.

'అదే నేను కూడా అనుకుంటున్నాను తల్లీ. నువ్వు కూడా అదే మాట చెప్పిన తర్వాత నాకు ఇంకాస్త ధైర్యం వచ్చింది. నువ్వు వెళ్ళి నీ గదిలో హాయిగా నిద్రపో' అన్నాడు.




'నీకు ఈ బిల్డింగ్‌లో ఏది ఎక్కడ ఉంటుందో తెలియదు. నాతో రా. చూపిస్తాను' అంటూ హాల్లోకి తీసుకుపోయి మెట్లకేసి కదిలింది ఆమె.

సూది కిందపడినా పెద్దగా వినిపించేటంత నిశ్శబ్దంతో నిండి ఉంది హాలు. సన్నసన్నగా వెలుగుతున్న బెడ్ లైటు కాంతి తప్ప మరెటువంటి వెలుగూలేదు అక్కడ.

అడుగులో అడుగు వేస్తూ డైనింగ్ రూమ్‌లోకి తీసుకు పోయిందామె అతన్ని. అక్కడి నుంచి కిచెన్‌లోకి ఆ తరువాత ఒక ద్వారం దగ్గరికి లీడ్ చేసింది.

'పెద్ద తోట ఉంది ఈ బిల్డింగ్ వెనకాల. ప్రహరీ గోడ కూడా ఉంది. దాని మీది నుంచి అవతలికి దూకితే ఒక చిన్నసందు. దానివెంట పోతే గుగ్గూరు దారి..' అంటూ మూసి ఉన్న తలుపులు తెరిచింది.

నైట్ క్వీన్ పొదలున్నట్లున్నాయి తోటలో. తల తిరిగి పోయేంత సువాసనలు వెట్టిని అలుముకున్నాయి.

'నువ్వు చెప్పిన దారి నాకు పూర్తిగా అర్థం అయింది. ఇంక నువ్వెళ్ళి పడుకో తల్లీ..' అంటూ తోటలోకి అడుగు పెట్టాడు. చిన్నచిన్న అడుగులు వేస్తూ ప్రహరీ గోడ దగ్గరికి పోయాడు. గుండెల నిండా ఊపిరి పీల్చుకుని ఒక్కసారిగా ఎగిరి గోడమీద నుంచి అవతలి పక్కన ఉండే సందులో నేలను తాకాడు.

గుగ్గూరు దారి గురించి వినటమే తప్ప ఎలా ఉంటుందో అతనికి తెలియదు. దొంగ మాదిరి వెనక పక్క నుంచి పారిపోతున్నందుకు కొంచెం బాధ కలిగినా, పట్టించుకోలేదు. పక్కకు తిరిగి నడక మొదలు పెట్టాడు.

'నీకు బుద్ధి లేదు. నేను చెప్పింది అటు పొమ్మని కాదు. ఇటు ఇటు' అంటూ అతన్ని హెచ్చరించింది పిచ్చమ్మి కంఠం.

భయంకరమైన నాటుబాంబు వచ్చి తన పాదాల దగ్గర పడినట్లు అదిరిపడి వెనక్కి చూశాడు అతను.

ఎప్పుడు వచ్చిందో గాని అతని మాదిరిగానే ప్రహరీని అధిగమించి సందులోకి వచ్చేసింది పిచ్చమ్మి.

'నువ్వు కనిపించకపోతే వచ్చిన వాళ్ళు చేతులు ఊపుకుంటూ వెనక్కిపోరు. నన్ను పట్టుకుంటారు. నీ గురించి చెప్పకపోతే నన్ను తమ వెంట తీసుకు పోతారు' అతని పక్కకు వస్తూ చెప్పింది ఆమె.

'మునిరెడ్డి ఉన్నాడు గదా తల్లీ. నిన్ను దాచి పెట్టటం అతనికి ఏమంత కష్టం కాబోదు' అన్నాడు అతను.

'ఒకళ్ళు ఇద్దరు వస్తే తట్టుకోగలడు మునిరెడ్డి. అన్నిటికీ తెగించిన ఈ వెధవలందరూ ఒకేసారి వచ్చిపడితే ఆపటం అతనికి చేతకాదు. అతన్ని కష్టాల్లోకి నెట్టటం దేనికి?' అంటూ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా తనే ముందుకు నడవడం మొదలు పెట్టింది ఆమె.

'తల్లీ... గుగ్గూరు దారి అటు లేదు. మన వెనకాల ఉంది' గుర్తు చేశాడు అతను. 'ఆ సంగతి బాగా తెలిసి కూడా నువ్వు ఇటే నడుస్తున్నావు. నీ ఆలోచన ఏమిటో నాకు తెలియదు అనుకోబోకు.. నాకు అన్నీ తెలుసు' అంటూ ముందుకే నడిచింది ఆమె.

●●●

మూసుకుపోతున్న కళ్ళను బలవంతంగా తెరిచి, అరచేతులతో రుద్దుకుంటూ, షెడ్‌లో నిలబడి ఉన్న వాళ్ళ వైపు చూశాడు కంకరరోడ్డు దగ్గర పాము కాటు నుంచి బతికి బట్టకట్టిన మనిషి.

'తెల్లవారటానికి ఇంకా ఎంతో టైం లేదు. అందరూ సగం నిద్ర సగం మెలకువతో ఉండే సమయం. వెళ్ళి తలుపులు తట్టండి' అంటూ లేచి నిలబడ్డాడు. సరిగ్గా అప్పుడే ఆరిపోయింది వీధి లైటు. అయినా సరే తడుముకోకుండా గుంపుగా రోడ్డుమీదికి వచ్చారందరూ. మునిరెడ్డి బిల్డింగ్ వైపు కదలబోతుండగా గావురుమని అరిచాడు వారిలో ఒకతను.

అదిరిపడి అతనివైపు చూసిన అందరికీ, ఎడమ చేతిలో పేష్కప్‌ని పట్టుకుని తమ మధ్యలోకి వచ్చేసిన ఆకారం ఒకటి కనిపించింది.

'ఎవడ్రా నువ్వు? ఎవడివిరా?' అని అడిగే అవకాశం అంతమందిలో ఒక్కళ్ళకు కూడా లభించలేదు.

కంటికి కనిపించనంత వేగంతో కదిలింది పేష్కప్. ముఖాలు, గుండెలు తీవ్రంగా గాయపడటంతో, వెర్రిగా కేకలు పెట్టారు కొందరు. తెలివితప్పి రోడ్డుమీద పడి పోయారు మరికొంతమంది.

ఎంత హఠాత్తుగా మొదలయిందో అంతే హఠాత్తుగా పూర్తి అయిపోయిందా గొడవ. పేష్కప్ విసుర్లకి గాయపడినవాళ్ళ కళ్ళు క్లియరై, బుర్రలు పనిచేసేలోపల ఉన్నట్లుండి ఒక ఇంటి చాటుకుపోయి అదృశ్యమైంది ఆ ఆకారం.

'పట్టుకోండి. వాడు ఎవరో గట్టిగా పట్టుకోండి' కీచుగా అరిచాడు ఒక మనిషి. పట్టుకోవటానికి అవసరమైన ఓపిక ఎవరికీ లేకపోవడం వల్ల కాళ్ళు ఈడ్చుకుంటూ పోయిన హీరోలకి ఎవరూ కనిపించలేదు ఆ ఇంటి చాటున.

●●●

'అయ్యయ్యో... పగిడయ్యా, ఏంటి ఈ దారుణం? ఏమైంది మీ అందరికీ?' రోడ్డు మీద నుంచి వినవచ్చిన అరుపులు, కేకలు ఆలకించి హడావిడిగా బిల్డింగ్‌లో నుంచి బయటికి వచ్చిన మునిరెడ్డి అడిగాడు ఆందోళన నిండిన కంఠంతో.

'తప్పయిపోయింది మునిరెడ్డీ... వాడు మీ ఇంటికి వచ్చాడని పొరపాటుపడి రేకులషెడ్‌లో కాపుకాశాం. వాడు మమ్మల్ని గమనించుకుంటూనే ఉన్నాడు. వెనక నుంచి వేటు వేసేశాడు' గాయపడిన తన భుజాన్ని రెండవ చేత్తో గట్టిగా అదుముకుంటూ చెప్పాడు పగిడయ్య.

'ఆ పిల్ల కనిపించిందా? తలకట్టు ఆడమనిషి కూడా వాడి వెంట వచ్చిందా?' ఆత్రుతగా అడిగాడు మునిరెడ్డి.

'చీకటి.. చిమ్మచీకటి. తెల్లారకముందే కరెంటు దీపాలు ఆర్పేశారు. అదే మాకు దెబ్బ కొట్టింది. దీపాలు ఉండి ఉంటే, తమను దెబ్బతీసిన మనిషిని చూడగలిగి ఉంటే...' ఏం చేసేవాడో తలుచుకుంటూ కచ్చగా అన్నాడు పగిడయ్య.

వాటర్ బాటిల్స్‌తో నీళ్ళు తెప్పించి కిందపడి పోయిన వాళ్ళను లేపి, కూర్చోబెట్టి సపర్యలు చేశాడు మునిరెడ్డి. వాళ్ళు తమ దారిన తాము పోయిన తర్వాత నెమ్మదిగా తన ఇంట్లోకి పోయాడు.

'ఆ అబ్బయ్య లేడు. అమ్మాయిగారు కూడా లేదు. ఇద్దరూ మాయం అయిపోయారు' చక్కగా చెప్పింది అతని భార్య. క్షణం కూడా ఆలస్యం చేయకుండా ఫోన్ అందుకున్నాడు మునిరెడ్డి.

**(ఇంకావుంది)**




## వరల్డ్ మ్యాజిక్ క్యాపిటల్!



ఇంద్రజాల ప్రదర్శన పిల్లల్నీ, పెద్దల్నీ ఎప్పుడూ సమ్మోహనపరుస్తూనే ఉంటుంది. ఎంత పెద్ద వీఐపీ అయినా సరే ఈ మ్యాజిక్ షోని నోరెళ్ళబెట్టి చూడాల్సిందే! అలాంటి గొప్ప ఇంద్రజాల ప్రదర్శకులకు, మ్యాజిక్ మాంత్రికులకు పుట్టినిల్లుగా చెప్పే ఓ గ్రామం గురించి మనం తెలుసుకుని తీరాల్సిందే! ఎందుకంటే ఆ ఊళ్ళో మూడేళ్ల పిల్లాడి దగ్గర్నుంచీ పండు ముసలివాళ్ళదాకా అందరూ ఐంద్రజాల మాంత్రికులే! మరి ఆ ఊరి కథేంటో తెలుసుకుందామా!

అమెరికాలోని మిచిగాన్ రాష్ట్రం కలన్ గ్రామాన్ని 'ఐంద్రజాలికుల ప్రపంచ రాజధాని' (మ్యాజిక్ క్యాపిటల్ ఆఫ్ ద వరల్డ్)గా అమెరికా పార్లమెంటు ప్రకటించింది. ఎందుకంటే ఆ ఊరిలో ఎవరిని కదిలించినా గమ్మత్తైన మ్యాజిక్కులతో మనల్ని నివ్వెరపరుస్తారు. ప్రపంచవ్యాప్తంగా ఇంద్రజాలికులు వాడే లాజిక్స్‌లో ఎక్కువభాగం ఈ గ్రామస్థులు కనిపెట్టినవేనట. ఎన్నో రకాల ఇంద్రజాల పరికరాలు ఈ గ్రామంలో తయారవుతాయి. అంతేకాదండోయ్, ఏటా ఇక్కడ జరిగే 'మ్యాజిక్ గెట్ టుగెదర్' కార్యక్రమానికి ప్రపంచం నలుమూలల నుంచి వేలాది మంది ఇంద్రజాలికులు తరలివస్తారు. అక్కడి నిపుణుల వద్ద జిమ్మిక్కులు నేర్చుకుంటారు. ఆకట్టుకునే షోలతో వాళ్ళంతా సందడి చేస్తారు. ఇలా అన్ని దేశాల మ్యాజిక్ మాంత్రికులూ ఒక్కచోట చేరితే, అదెంత సందడో ఇక వేరే చెప్పాలా!



## బేబీ క్రైయింగ్ ఫెస్ట్!

పిల్లలు ఏడుస్తుంటే, తల్లిదండ్రులు చూస్తూ ఊరుకోలేరు. వారికి ఏం కావాలన్నా తెచ్చిస్తారు. కొండమీది కోతినైనా సరే! కానీ జపాన్‌లో మాత్రం ఓ పండుగ సందర్భంగా తల్లిదండ్రులు తమ పిల్లల్ని విపరీతంగా ఏడిపిస్తారు. మల్లయోధులైన సుమోలను రంగంలోకి దించి మరీ పిల్లల్ని భయపెట్టి ఏడిపిస్తారు. ఆ విశేషాలేంటో తెలుసుకుందామా!

జపాన్‌లో 'నయ్ సుమో బేబీ క్రైయింగ్ ఫెస్టివల్' ప్రతియేటా నిర్వహిస్తారు. ఈ సందర్భంగా తల్లిదండ్రులు అప్పుడే పుట్టిన శిశువుల దగ్గరనుంచి రెండేళ్ళలోపు చిన్నారులందరినీ అక్కడికి తీసుకొస్తారు. పిల్లల్ని ఏడిపించడమే ఈ ఫెస్టివల్ ప్రధాన ఉద్దేశం. భారీకాయులైన సుమోలు ఈ ఫెస్టివల్‌లో చిన్నారుల్ని ఎత్తుకొని అరిచి అనేక రకాలుగా భయపెట్టి ఏడ్చేలా చేస్తారు. ఎవరు ఎక్కువగా ఏడిస్తే, వాళ్ళనే ఉత్తమ చిన్నారిగా ఈ ఫెస్టివల్ గుర్తిస్తుంది.

జపాన్‌లో నాలుగు వందల సంవత్సరాలుగా ఈ పండుగను సంప్రదాయబద్ధంగా చేసుకుంటున్నారట. ఇలా ఏడిపిస్తే, పిల్లలు లావుగా అవుతారని, దుష్ట శక్తులు వారి దరి చేరవని జపనీయులు నమ్ముతారు. అందుకే ఇలా ఏటా పండుగ పేరుతో పిల్లల్ని ఏడిపిస్తారట!

## మూడ్ బ్యాంక్!

అర్ధరాత్రైనా, అపరాత్రైనా డబ్బు కావాలంటే ఏటీఎం సెంటర్‌కి వెళతారు ఎవరైనా. బ్యాంక్‌తో పనిలేకుండా డబ్బు డ్రా చేస్తుంటారు. కానీ ఆ ఏటీఎం సెంటర్‌కి వెళితే మాత్రం అక్కడ మెషీన్ లోంచి డబ్బులు రావు! ఎందుకంటే అది డబ్బులు రాల్చే ఏటిఎం కాదుమరి! మీరు ఏ మూడ్‌లో ఉన్నారో ఠక్కున చెప్పేసే మూడ్ బ్యాంక్ అది! అక్కడికెళితే మీరు ఏ మూడ్‌లో ఉన్నారో గడగడా చెప్పేస్తుందా మెషీన్ వింతగా ఉంది కదూ!

వెన్నిసా క్రోవ్ ఓ కళాకారిణి. న్యూజిలాండ్ వంగేరి సిటీలో మూడ్ బ్యాంక్ పేరిట మూడు ఏటీఎంలు ఏర్పాటుచేసింది. ఒక్కొక్కసారి మన మూడ్ ఎలా ఉందో మనకే తెలియకపోవచ్చు. అందుకే మీ మూడ్ ఎలాఉందో ఇట్టే చెప్పేస్తుందా ఏటీఎం! కోపం, ఆకలి, సంతోషం, బాధ, నవ్వు, ఒంటరితనం ఇలా వెయ్యి రకాలకు పైగా మూడ్స్‌ను ఇది గుర్తించి చెప్పగలదు! మీరున్న మూడ్‌ని బట్టి, ఎంచుకున్న ఆప్షన్లను బట్టి, వాటిని పోల్చి మీరు ఏ మూడ్‌లో ఉన్నారో చెబుతుంది. అంతేకాదు ఒక వ్యక్తి ఏ మూడ్‌లో ఉంది, అతను ఉన్న మూడ్‌లోనే ఇంకెంతమంది ఉన్నారన్న విషయాలను కూడా చక్కగా చెప్పేస్తుందీ మెషీన్. వీటిని ఇతర నగరాలకు కూడా విస్తరించాలనుకుంటోంది వెన్నిసా క్రోవ్. భలే ఆలోచన కదూ!






## దుర్యోధనుడి గుడి

మహాభారతంలో దుర్యోధనుడి పాత్రను దుష్టత్వానికి ప్రతిబింబంగా భావిస్తారు. విలన్‌కి ఎప్పుడూ సాధారణంగా తిట్లూ శాపనార్థాలేతప్ప పూజలూ పునస్కారాలూ ఉండవుకదా! కానీ దుర్యోధనుణ్ణి మాత్రం ఆ ఊళ్ళో దేవుడిలా కొలుస్తారు. ఆ ఇతిహాస పురుషుడికి జాతర కూడా చేస్తారు. ఎక్కడ? ఏమిటి? అని తెలుసుకోవాలంటే కేరళ వెళ్ళాల్సిందే!

కొల్లం జిల్లా పోరువళి గ్రామంలో ఉంది పెరువిరుతి మలనాడి గుడి. ఇక్కడ దుర్యోధనుడే దైవం. నిజానికి అక్కడ ఏ విగ్రహమూ ఉండదు. ఆరుబయట ఓ వేదిక ఉంటుంది. భక్తులు తమలోతాము సంకల్పం చెప్పుకుని, ఆ వేదిక వద్ద మనస్సులో దైవాన్ని స్మరించుకుంటూ ప్రార్థన చేయాలి. దుర్యోధనుడు పేదలు, అణగారిన వర్గాల రక్షకుడని ఇక్కడి ప్రజల నమ్మకం. ఈ గుడిలో ఉపదేవతలుగా కొలువై ఉన్నదెవరో తెలిస్తే మీరు ఆశ్చర్యపోతారు! ఇంతకూ ఎవరో తెలుసా? దుర్యోధనుడి భార్య భానుమతి, అతడి తల్లి గాంధారి, సోదరి దుస్సల, గురువు ద్రోణుడు, ఆప్తమిత్రుడు కర్ణుడు. బాగుంది కదూ! అణగారిన వర్గాల రక్షకుడుగా దుర్యోధనుడు ఇక్కడ కొలువు తీరడం నిజంగా ఓ గొప్ప విశేషమే!

-నర్మద వాసిరెడ్డి



# గే.మ్.ఆ.ఫ్.లై.ఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి **9**

# బ్యూటిఫుల్ మైండ్



**మీరొక పార్టీకి వెళ్తారు. అక్కడ మీకొక అందమైన అమ్మాయి కనిపిస్తుంది. చారడేసి కళ్ళు, మెరుపుతీగలాంటి దేహం, మోడ్రన్ దుస్తులతో షోకేస్‌లో ఉండే పోతపోసిన బొమ్మలా కనిపిస్తుంది.**

మీరు ఆమెతో మాటలు మొదలెడతారు. ఆమె తన దుస్తులు, నగల గురించి, కొత్తగా రిలీజై సూపర్ సక్సెస్ ప్రచారం పొందిన చెత్తసినిమా గురించీ మాట్లాడటం మొదలెడుతుంది. ఆ గాసిప్స్, విమర్శలు, స్వోత్కర్ష... అలాంటి సొల్లు మాటలు మీకు బొత్తిగా వినాలనిపించదు. అక్కడి నుంచి తప్పించుకోవాలనిపిస్తుంది. చూడబోతే అందమైన రూపం. నోరు విప్పితే బోరెత్తించే కబుర్లు! మెరుపుతీగలాంటి దేహం, బోరెత్తించే మనస్సు.

ఇది అమ్మాయిలకూ, అబ్బాయిలకూ అన్వయిస్తుంది. ఇలాంటి వాళ్ళు మీకు అనేకచోట్ల తగులుతూ ఉంటారు.

### 'బోరెత్తించే మనస్సు' ఉంటే?

బుర్రలో మట్టి, పేడ ఉండటం, స్వంత ఆలోచనలు లేకపోవటం, చిలకపలుకులు పలకటం, ఫ్యాషన్‌కు అనుగుణంగా ఎవరినో అనుకరించ బోవటం, ఎవరికో 'మూస'లా ప్రవర్తించటం, చూశావా నేనెంత 'పుడింగు'నో అన్నట్టు ప్రవర్తించటం వెరసి.. ఒక పేలవమైన, బోలు వ్యక్తిత్వం!

ఆడవాళ్ళు కానీండి, మగవాళ్ళు కానీండి మనుష్యులు తమ శరీరాన్ని అందంగా ఉంచుకోవటానికి బోళ్ళంత సమయం వెచ్చిస్తారు. ఎంతో ప్రయాసపడి బోలెడంత డబ్బు ఖర్చుపెడతారు. జిమ్‌లకు వెళ్తారు. మొహం, శరీరం నిండా కాస్మొటిక్స్ అప్లై చేస్తారు. ముఖ సౌందర్యం, నాజూకుదనం కోసం ఎంతో శ్రద్ధ తీసుకుంటారు. ఎన్నో కష్టనష్టాలు భరి స్తారు. హమేషా అదే ఆలోచన. కానీ 'మనస్సు అందం' గురించి ఎవరూ పట్టించుకోరు. 'మనస్సు అందం' అంటే..

బ్యూటిఫుల్ మైండ్!

తనకంటూ ఒక వ్యక్తిత్వం ఉండటం, స్వంత ఆలోచనలు చేయటం, డిఫరెంట్‌గా ఆలోచించటం, సృజనాత్మకంగా ఆలోచించటం. ఇవన్నీ జీవిత పయనాన్ని ఆహ్లాదకరంగా సాగించటానికి, జీవిత పోరాటంలో విజయాలు సాధించటానికి ఉపకరించే అస్త్రశస్త్రాలు.

మనిషికి శ్వాస, నడక, సంభాషణ ఎంత సహజమో ఆలోచన కూడా అంతే సహజం, స్వాభావికం.

మనిషికున్న అత్యద్భుతమైన నైపుణ్యాలలో 'ఆలోచించటం' ఒకటి. ఆ నైపుణ్యాన్ని ఎంతగా అభివృద్ధి పరుచుకుంటే జీవితంలో అంతగా సంతోషం సంతృప్తి, సక్సెస్ అంది పుచ్చుకోగలుగుతాం.

ఆలోచించటం ద్వారా మీరు మీకంటూ ఒక దృక్పథం, వీక్షించే విధానం, లక్ష్యాలు ఏర్పరచుకుని, ప్లానింగ్ చేసుకోగలుగుతారు. నిర్ణయాలు తీసుకుని సమస్యలు పరిష్కరించుకోగలుగుతారు. ఎలాంటి పరిస్థితినైనా చాకచక్యంగా అధిగమించగలుగుతారు. ఎదుటి మనుషుల్ని అర్థం చేసుకోడానికీ, సర్దుకుపోవడానికీ ఆలోచనే ముఖ్యం.

ప్రతి మనిషీ ఆలోచనలు చేస్తాడు. బెర్ట్రాండ్ రస్సెల్, ఐన్‌స్టీన్, డావిన్స్, బిల్‌గేట్స్... వీళ్ళంతా ఆలోచనలు చేశారు. పిచ్చాసుపత్రిలోని పేషెంటూ ఆలోచనలు చేస్తాడు, కాని వీళ్ళ ఆలోచనల్లో తేడా లేదా?

సరిగ్గా ఆలోచించటం చేతకాని మనిషి జీవితం, ఆచితూచి నిర్ణయం తీసుకోలేని మనిషి జీవితం చుక్కానిలేని నావలా, గమ్యం లేని నావలా కొట్టుకుపోతుంది. అలాంటి మనిషికి తన జీవితం మీద తనకి కంట్రోల్ ఉండదు. తెగిన గాలిపటంలా అతడి జీవితానికి ఒక గమ్యం, లక్ష్యం, అర్థం, పరమార్థం ఉండవు.

### తెలివితేటలు, ఆలోచనలు

తెలివితేటలు అంటే మేధస్సు, Inteligence.

తెలివితేటలు వేరు, ఆలోచించటం వేరు. ఈ రెండూ వేరు వేరు విషయాలు.

మనిషి మేధస్సు కారుకు ఉండే హార్స్‌పవర్ లాంటిది. ఆలోచనలు అనే కారును నడిపే డ్రైవర్‌కి ఉండే నైపుణ్యం Driving Skill లాంటిది.

అధికమైన హార్స్‌పవర్ (Horse Power) ఉన్న ఒక కారు అత్యంత శక్తిమంతమైనది కావచ్చు గాక, కాని దానిని నడిపే డ్రైవరు, వాటం తెలిసిన అనుభవజ్ఞుడు కాకపోతే, నైపుణ్యం లేనివాడైతే తక్కువ హార్స్‌పవర్ ఉన్న మిగతా కార్లకీ దానికీ పెద్దగా తేడా ఏమీ ఉండదు. కారు నడపటంలో నైపుణ్యం, చాకచక్యం ఎలా ఉంటాయో ఆలోచించటంలో కూడా నైపుణ్యాలు (Skills) ఉంటాయి. సృజనాత్మకంగా ఆలోచించటం, డిఫరెంట్‌గా ఆలోచించటం కూడా ఇదే కోవలోకి వస్తాయి.

కారు డ్రైవింగ్ లాగే డిఫరెంట్‌గా ఆలోచించటాన్ని కూడా నేర్చుకోవచ్చు. ప్రాక్టీస్ చేయవచ్చు. అభివృద్ధి పరుచుకోవచ్చు. కాకపోతే ఆ నైపు



జ్ఞాన్ని అభివృద్ధిపరచుకోవాలన్న 'ఇచ్ఛ' 'తపన' మనిషిలో ఉండాలి.

సైకిలు తొక్కటం, కారు నడపటం ఎలాగో ఆరంభంలో మనం నేర్చుకుంటాం కదా? డిఫరెంట్‌గా ఆలోచించడం కూడా అంతే. అది కూడా ప్రాక్టీస్ చెయ్యాలి.

కాలేజీ, యూనివర్సిటీల్లో ఎంచుకున్న కోర్సులకు సంబంధించిన పడికట్టు పరిజ్ఞానం బోధిస్తారు తప్ప సృజనాత్మకమైన, భిన్నమైన ఆలోచనలు చేయడం ఎలాగో విద్యార్థులకు ఎక్కడా బోధించరు! ఇంజనీరింగ్, మెడికల్ సైన్సు, గణితం సహా సాహిత్యంలో కూడా ఇంతే. సృజనాత్మక ఆలోచనను కాలేజీల్లో పాఠ్యాంశంగా పెడితే, విద్యార్థులు తమ తమ రంగాలలో ఇంకా విశిష్టమైన విషయాల్ని ఆవిష్కరించగలుగుతారు.

స్వంత ఆలోచనకి తెలివితేటలు చాలవు. సృజనాత్మకమైన ఆలోచన, భిన్నమైన ఆలోచన చేయడం ఎలాగో తెలిసి ఉండాలి. ఆ వైపుగా బుర్రకు పదును పెట్టాలి.

స్వంత ఆలోచనలు చేయటానికి ఒక ఉదాహరణ తీసుకుందాం.

## వార్త, ఆలోచనలు

ఒక పత్రికలో మీరొక వార్త చూస్తారు.

"ప్రపంచం మొత్తం మీద చైనాలో పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.."

ఈ వార్త చదివి మీరెలా స్పందిస్తారు?

"పాపం" అనుకుని వదిలేస్తారా లేక ఇంకా లోతుగా ఆలోచిస్తారా?

ఇంకా ఎక్కువ ఆలోచన చేయడం అంటే, మొదట ఆ ప్రకటనలోని నిజానిజాల్ని ఆలోచించటం. చైనా కమ్యూనిస్టుదేశం గనుక ఆ వార్త ప్రచురించిన పత్రిక కమ్యూనిస్టు వ్యతిరేక పత్రికైతే మీరా వార్తను పట్టించుకోవాల్సిన పనిలేదు. అలాంటి వాటిలో ఎక్కువ సందర్భాలలో కమ్యూనిస్టు దేశాలపై అబద్ధపు వార్తలూ, అతిశయోక్తి వార్తలు వస్తుంటాయి.

ఒకవేళ అది కమ్యూనిస్టు అనుకూల పత్రిక లేదా వాస్తవాలకు ప్రాధాన్యమిచ్చే ప్రామాణిక వార్తా పత్రిక అయితే ఆ వార్తలూ విశ్వసించవచ్చు.

అప్పుడిక ఆ వార్తపై కొనసాగింపు ఆలోచనలు చేయవచ్చు. ఉదాహరణకు,

- పురుషులకంటే స్త్రీలు ఎక్కువగా ఆత్మహత్యలు చేసుకోవటం ఈ మధ్యనేనా? లేక అనాదిగానా?
- ఒక కుటుంబానికి ఒకే బిడ్డ అనే చట్ట నియంత్రణ వల్ల జరుగుతోందా?
- అన్ని వయసు స్త్రీలలోనూ ఇలాగే జరుగుతోందా?
- కేవలం వివాహితులేనా? లేక మిగిలినవారు కూడా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారా?

మెదడుకు పదును, స్వంత ఆలోచనలు అంటే ఈ విధంగా ఉంటాయి. దీనివల్ల మెదడు కణాల్లో కొత్త కొత్త కనెక్షన్లు పెరుగుతూ రాను రాను మీరు ప్రతి విషయంపట్ల విపులంగా, నిశితంగా ఆలోచించటం మొదలు పెడతారు.

దానివల్ల మీలో సజ్జనాత్మకత వికసిస్తుంది.



**ఆడవాళ్ళైనా, మగవాళ్ళైనా శరీర అందానికి ఎంతో డబ్బు, సమయం కేటాయిస్తారు. ముఖ సౌందర్యం, నాజూకుదనంపట్ల శ్రద్ధ వహిస్తారు. హమేషా అదే ఆలోచన. మరి అందమైన లుక్‌తో చెత్త కబుర్లు, స్వోత్కర్ష చెబుతూ ఎదుటివారిని బోరెత్తిస్తే ఏమిటి ప్రయోజనం? అసలు మనసు అందం గురించి ఎవరైనా పట్టించుకుంటున్నారా? బ్యూటిఫుల్ మైండ్ అంటే ఎలా ఉండాలి?**

తెలివితేటలు అభివృద్ధి చెంది 'బ్యూటిఫుల్ మైండ్' సంతరించుకుంటారు.

## మేధస్సు

మేధస్సు-ఇంటెలిజెన్స్- అనేది మనస్సు సామర్థ్యం Potential. ఆ సామర్థ్యాన్ని సక్రమంగా వినియోగించుకునే నైపుణ్యమే ఆలోచన.

మీది పవర్‌ఫుల్ మైండ్ కావచ్చు. కానీ మీరు దాన్ని సక్రమంగా వినియోగించలేకపోవచ్చు. మీది చాలా సాధారణమైన మైండ్ కావచ్చు. కానీ దాన్ని అద్భుతమైన రీతిలో ఉపయోగిస్తూ ఉండవచ్చు. అదంతా మీరు ఆలోచించగలిగే విధానం మీద ఆధారపడి ఉంటుంది.

అత్యంత వేగవంతమైన కారును మీరు కొనుక్కోవచ్చు. అంత మాత్రాన మీరు దాన్ని అద్భుత వేగంతో నడపలేకపోవచ్చు. మీలో ఆ నైపుణ్యం (Skill) ఉండాలి. మనస్సు - మైండ్ - విషయం కూడా ఇంతే.

స్వతహాగా మీకు అత్యద్భుతమైన మెదడు ఉండవచ్చు. కానీ సొంతంగా ఆలోచించడం, డిఫరెంట్‌గా ఆలోచించటం చేతకాకపోతే ఆ మెదడును మీరు నిరుపయోగపరుస్తున్నట్టే.

మెదడు పూర్తి సామర్థ్యాన్ని ఎలా ఉపయోగించుకోవాలనే విషయం మన ఆలోచనా నైపుణ్యం మీద, వైవిధ్యభరితమైన ఆలోచనా విధానంమీద ఆధారపడి ఉంటుంది.

ప్రకృతి మనకో దేహాన్నీ, రూపాన్నీ సమకూర్చింది. పుట్టుకతో వచ్చిన రూపాన్ని మార్చుకోలేం. ఆరోగ్యం పాటిస్తూ, కొద్దిపాటి మెరుగులు దిద్ది, మేకప్‌ద్వారా రూపాన్ని ఇంకొంచెం ఆకర్షణీయంగా మార్చగలం. అంతే.

కానీ లోపలఉండే మనస్సు విషయం అలా కాదు, బాహ్యరూపం కంటే మనస్సును అందంగా ఉంచుకోవటం మన చేతిలో పనే.

మనస్సుని-మైండ్‌ని-అందంగా ఉంచుకోవటం అంటే-

వైవిధ్యభరితంగా, సృజనాత్మకంగా ఆలోచించగలగటం. ఎప్పటికప్పుడు నూతన భావాలతో రవరవలాడుతూ ఉండటం. ఆ భావాలతో ఆకట్టుకునే విధంగా, ఇతరుల్ని ఇంప్రెస్ చేయటం. సమస్యలు ఎదురైనప్పుడు కుంగిపోకుండా నిర్మాణాత్మకంగా అన్నికోణాల నుంచీ ఆలోచించి సమస్యల నుంచి బయటపడే విధంగా వివేకవంతమైన నిర్ణయం తీసుకోవటం.

మన మనస్సు ఉపయోగకరంగా ఆలోచించలేకపోయినప్పుడు ప్రకృతి ఇచ్చిన అందమైన రూపం శుద్ధవేస్టు అవుతుంది. ఇదెలా ఉంటుందంటే, లగ్జరీ కారుకొని పెట్రోలు పోయించకుండా మూలపెట్టేయడమే.

అయితే ఒకటి-

అందమైన రూపం లేకపోయినా బ్యూటిఫుల్ మైండ్ అభివృద్ధి పరచుకుని ఛార్మ్ (Charm) పెంచుకోవచ్చు. ఆకర్షణీయంగా కనిపించవచ్చు.

వయస్సు మీరుతున్నకొద్దీ శరీర సౌందర్యం తరిగి పోతుంది. మనస్సు (మైండ్) అట్లాకాదు.

వృద్ధాప్యంలో జ్ఞానసంపద, అనుభవాల పరిపుష్టి, వైవిధ్యభరిత ఆలోచనలతో మనస్సును అందంగా, తాజాగా ఉంచుకోవచ్చు.

వృద్ధాప్యం శరీరానికే, మనస్సుకు లేదు. భిన్న ఆలోచనలు, Thinking Skills మెరుగు పరుచుకోవటం ద్వారా మనస్సును నిత్యనూతనంగా ఉంచుకోవచ్చు.

మనం చేసే ఆలోచనల్లోనే మన బ్యూటిఫుల్ మైండ్ ఆవిష్కృతమవుతుంది. మన మాటలు, చేతల్లో అది ప్రతిఫలిస్తుంది.

అలాంటి మనస్సు ఉన్న వ్యక్తుల్ని ఒకసారి గుర్తుకు తెచ్చుకోండి. కాళిదాసు, షేక్స్పియర్, షెల్లీ, మహాత్మాగాంధీ, మదర్‌థెరిస్సా, ఐన్‌స్టీన్, ఎడిసన్, డార్విన్, ఫ్రాయిడ్, అబ్దుల్‌కలాం, బిల్ గేట్స్... ఇలా ఎందరో ఉంటారు. ఇంకెందరో మన చుట్టూ సమాజంలో కూడా ఉండవచ్చు. వాళ్ళలో అలాంటి బ్యూటిఫుల్ మైండ్ ఎలా ఏర్పడింది? దృక్పథాలనుబట్టి, మిగతావాళ్ళ కంటే విభిన్నంగా ఆలోచించబట్టి, వాటిని ఆచరించబట్టే కదా!

**(ఇంకా వుంది)**




# పుట్టుకతోనే ఆ ఇష్టం!

కొందరికి వ్యాయామం చేయడమంటే ఇష్టం. మరికొందరు అస్సలు దాని జోలికే పోరు. అయితే వ్యాయామం పట్ల ఇష్టం లేకపోవడం వారి తప్పు కాదనీ, ఆ ఇష్టం పుట్టుకతోనే అంటే తల్లి గర్భంలో ఉండగానే ఏర్పడుతుందనీ అంటున్నారు అమెరికా పరిశోధకులు. టెక్సాస్ పిల్లల ఆసుపత్రి వైద్యులు ఈ విషయంపై సుదీర్ఘ పరిశోధనలు చేశారు. ఎలుకల మీద చేసిన పరిశోధన ద్వారా వారు పై విషయాన్ని నిర్ధారించారు. గర్భంతో ఉన్న కొన్ని ఎలుకలను ఉత్సాహంగా తిరగనిచ్చారు. మరికొన్ని ఎలుకలను కట్టడి చేసి ఉత్సాహంగా తిరగకుండా చూశారు. అవి ప్రసవించిన తరువాత పిల్ల ఎలుకల ప్రవర్తన పరిశీలించారు. ఉత్సాహంగా అటూ ఇటూ పరిగెట్టిన ఎలుకల పిల్లలు కూడా అంతే ఉత్సాహంగా ప్రవర్తిస్తుండగా, ఉత్సాహంగా తిరగని ఎలుకల పిల్లలు స్తబ్దుగా ఉండడం వీరు గమనించారు. గర్భవతిగా ఉన్న మహిళలు ఎప్పుడూ కూర్చోకుండా అటూ ఇటూ ఉత్సాహంగా తిరిగితే పుట్టే పిల్లలు కూడా అంతే ఉత్సాహంగా ఉంటారని వీరు అంటున్నారు. దీని మీద ఇంకా విస్తృతంగా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.





# ఆరోగ్యమే మహాభాగ్యం

## వీడియో గేమ్స్ మంచివే!

చాటింగ్, ఫేస్‌బుక్ కన్నా, వీడియోగేమ్స్ పిల్లలకు మంచి చేస్తాయి అంటున్నారు ఆస్ట్రేలియా పరిశోధకులు. రోజులో ఎక్కువ సేపు ఆన్‌లైన్‌లో వీడియోగేమ్స్ ఆడే పిల్లలు లెక్కలు, సైన్సులో ఎక్కువ ప్రతిభ చూపుతారన్న విషయం ఓ పరిశోధనలో వెల్లడైంది. ప్రతిరోజూ ఆన్‌లైన్ వీడియోగేమ్స్ ఆడే పిల్లల్లో 15 పాయింట్లు లెక్కల్లోనూ, 17 పాయింట్లు సైన్సులోనూ పెరగడాన్ని వీరు గమనించారు. వీడియోగేమ్స్‌లో పజిల్ సాల్వ్ చేసే పిల్లల్లో మెదడు చురుకుగా పనిచేస్తుందనీ, ఈ కారణంగా వీరు లెక్కల్లోనూ, సైన్సులోనూ మరింత ప్రతిభ కనపరుస్తారనీ వీరు చెబుతున్నారు. సోషల్ మీడియాలో ఎక్కువ సేపు గడిపే పిల్లలు చదువులో బాగా వెనుకపడటాన్ని వీరు గుర్తించారు. సుమారు 1500 మంది టీనేజర్ల మీద వీరు దీర్ఘకాల పరిశోధనలు చేశారు.





## సేవా కార్యక్రమాలతో జీవిత కాలం పెంపు

చాలామంది స్త్రీలు ప్రార్థనా స్థలాలకు వెళ్ళి అక్కడ నిర్వహించే పలు సేవా కార్యక్రమాలలో పాల్గొంటూ ఉంటారు. అలా పాల్గొనడం వల్ల వారి జీవిత కాలం పెరుగుతుంది అంటున్నారు హార్వర్డ్ యూనివర్సిటీ పరిశోధకులు. కొంతమంది స్త్రీల మీద వీరు దీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు. ప్రార్థనాలయాలకు వెళ్ళి మతపరమైన కార్యక్రమాలలో పాల్గొనే వారిలో 33 శాతం మరణాల సంఖ్య తగ్గిన విషయం వీరు గుర్తించారు. మధ్య వయస్కులు, వృద్ధులైన మహిళలు ప్రార్థనామందిరాలకు వెళ్ళి అక్కడ జరిగే పలు సేవా కార్యక్రమాల్లో పాల్గొంటే గుండెవ్యాధి మరణాల నుంచి 27 శాతం వరకూ తప్పించుకోవచ్చని చెబుతున్నారు. సుమారు 73 వేలమంది మీద పదహారు సంవత్సరాల పాటు వీరు పరిశోధనలు నిర్వహించారు. ప్రార్థనా స్థలాల వద్ద జరిగే కార్యక్రమాలలో పాల్గొనే వారిలో డిప్రెషన్ కూడా తక్కువగా ఉంటుందని వీరు చెబుతున్నారు.

## స్లీప్ అప్నియాతో కంటి సమస్యలు



స్లీప్ అప్నియా అనేది నిద్రా అవ్యవస్థ లేదా క్రమరాహిత్యం. ఈ స్థితి వల్ల కంటి ఆరోగ్యంలో సమస్యలు తలెత్తుతాయి అంటున్నారు జపాన్ పరిశోధకులు. ఈ సమస్యతో బాధపడే వారు నిద్రిస్తున్న సమయంలో కంటి నరం మరింత ఒత్తిడికి గురవుతుందన్న విషయం పరిశోధనలో వెల్లడైంది. నిద్రలో వీరికి ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగంలో అసాధారణమైన మార్పులు జరుగుతూ ఉంటాయని, ఈ సమస్య ఎక్కువయ్యే కొద్దీ కంటి నరంపై ఒత్తిడి అధికమవుతూ ఉంటుందని వీరు చెబుతున్నారు. ఫలితంగా కంటి చూపు తగ్గే ప్రమాదం ఉందని వీరు హెచ్చరిస్తున్నారు. కొన్ని సందర్భాలలో శాశ్వతంగా చూపు కోల్పోయే ప్రమాదం కూడా ఉందని చెబుతున్నారు. స్లీప్ అప్నియాతో బాధపడుతున్న వారు వెంటనే వైద్యుణ్ణి సంప్రదించి తగిన చికిత్స తీసుకుంటే, కంటి చూపు పోకుండా చూసుకోవచ్చని పరిశోధకులు అంటున్నారు.

-అవినాష్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'ఎగ్జిమా' సమస్యకు సరైన పరిష్కారం


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




మానవ శరీర అవయవాలన్నిటిలో చర్మం అతిపెద్ద అవయవం. ఇది శరీర అంతర్భాగ అవయవాలకు ఒక రక్షణ కవచంలా ఉంటుంది. నూటికి 90% మంది తమ జీవితకాలంలో ఏదో ఒక చర్మసమస్యతో బాధపడుతున్నారు. ఒక అధ్యయనం ప్రకారం 2013వ సం॥ నాటికి, ప్రపంచవ్యాప్తంగా 334 మిలియన్ల మంది ప్రజలు ఈ 'ఎగ్జిమా' సమస్యతో బాధపడుతున్నారని తేలింది. ఎగ్జిమా అనేది చర్మానికి శోథమును కలిగించే కొన్ని రకాల చర్మవ్యాధుల సమూహ నామం. దీని వలన చర్మము శోథమునకు గురి అయి ఎర్రగా మారటం, దురద పెట్టటం, వాపుతో కూడిన పొక్కులు ఏర్పడి, అనంతరం ఈ పొక్కులు నీటి బుడగల వలె మారి రసి కారడం–తదుపరి మచ్చల వలె మారటం జరుగుతుంది. ఒకదాని వెంట ఒకటిగా ఏర్పడే ఈ లక్షణాలు 'ఎగ్జిమా' సమస్యను ఎదుర్కొంటున్న వారిలో సహజంగా కనిపిస్తాయి. ఎన్నో రకాల 'ఎగ్జిమా'లు ఉన్నప్పటికీ, వాటిలోకెల్లా 'అటోపిక్ డెర్మటైటిస్' సమస్య ఎక్కువ మందిలో కనిపిస్తుంది. ఏ వయస్సు వారిలోనైనా ఏర్పడే ఈ సమస్య – శిశువులలో 65% మరియు చిన్న పిల్లలలో 85% వరకు కనిపిస్తుంది. కొందరిలో చిన్న వయస్సు వరకే పరిమితమయ్యే ఈ సమస్య మరికొందరిలో జీవితకాలం కొనసాగుతుంది.



**ఎగ్జిమా-రకాలు:** (1) ఎలర్జిక్ కాంటాక్ట్ ఎగ్జిమా (డెర్మటైటిస్) (2) కాంటాక్ట్ ఎగ్జిమా (3) అటోపిక్ డెర్మటైటిస్ (4) సెబోరిక్ ఎగ్జిమా (5) స్టేసిస్ ఎగ్జిమా (6) నమ్యులార్ ఎగ్జిమా (7) పాంఫొలిక్స్ (డిస్‌హైడ్రాయిటిక్) ఎగ్జిమా (8) న్యూరో డెర్మటైటిస్

**కారణాలు:** 'ఎగ్జిమా' ఏర్పడటానికి గల కారణాల పరంగా ఇంతవరకూ స్పష్టత లభించలేదు, కానీ వంశపారంపర్యత మరియు వాతావరణం వంటి అంశాల సమ్మేళనంతో 'ఎగ్జిమా' సమస్య ఏర్పడుతుందని తెలుస్తోంది. 'ఎగ్జిమా'ను ప్రేరేపించే అంశాలు ఎదురైనప్పుడు, శరీర రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థాయికి మించి ప్రతిక్రియ జరపడం వలన 'ఎగ్జిమా' లక్షణాలు కనిపిస్తాయి.

**'ఎగ్జిమా'ని ప్రేరేపించే అంశాలు:** ముఖ్యంగా పొడి చర్మం కలిగిన వారిలో 'ఎగ్జిమా' ఎక్కువగా కనిపిస్తుంది. • దుమ్ము–ధూళి, జంతుకేశాలు, పుప్పొడి రేణువులు • సబ్బులు, డిటర్జెంట్లు, షాంపూలు, బ్యాక్టీరియా, వైరస్‌లు • అధిక మరియు అల్ప ఉష్ణోగ్రత, చెమట, కొన్ని ఆహారపదార్థాలు (ఉదా: గ్రుడ్లు, పాల ఉత్పత్తులు, కొన్ని ధాన్యాలు, సోయా మొదలైనవి) • సౌందర్య సాధనకు ఉపయోగించబడే సామాగ్రి (Cosmetics), చేతి గడియారాలు, కొన్ని ఆభరణాలు, డైపర్లు, డియోడరెంట్లు, ఉన్ని వస్త్రాలు మరియు దురదను కలిగించే కొన్ని ఇతర వస్తువులు • మానసిక ఒత్తిడి మరియు హార్మోన్ సమస్యల వంటి అంశాలన్నీ 'ఎగ్జిమా'ని ప్రేరేపిస్తాయి.

**లక్షణాలు:** 'ఎగ్జిమా' లక్షణాలు అందరిలో ఒకే విధంగా ఉండవు. కొన్ని సార్లు పెరుగుతూ (flare ups) మరికొన్ని సార్లు తగ్గుతూ ఉంటాయి. • 'ఎగ్జిమా'లో కనిపించే ప్రధాన లక్షణం దురద. ఆ తరువాత చర్మం ఎర్రగా మారి, వాపుతో కూడిన పొక్కులు ఏర్పడతాయి. క్రమేణా ఇవి నీటిబుడగల వలె మారి, వాటి నుండి రసి కారడం, కొంతకాలానికి చర్మం దళసరిగా మరియు నల్లగా మారిపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. • చర్మంపై ఎక్కడైనా 'ఎగ్జిమా' ఏర్పడవచ్చు. 'ఎగ్జిమా' లక్షణాలు ముఖ్యంగా ముఖం పైన మరియు తలలో, మోకాలు వెనుక భాగంలో, మెడ పైన, మోచేయి భాగంలో మరియు మణికట్టు పైన, చర్మపు మడతలలో, చెవి వెనుక భాగంలో, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తాయి. • శిశువులలో మొదట బుగ్గలపై, దద్దుర్లుగా ఏర్పడి, కొన్ని నెలలకు ఈ దద్దుర్లు చేతులు, కాళ్ళతో పాటు ఇతర శరీర భాగాలకు వ్యాపిస్తాయి. 80% వరకు 'ఎగ్జిమా'తో బాధపడే చిన్న పిల్లలు, హై ఫీవర్ లేదా ఆస్థమా సమస్యకు గురయ్యే అవకాశముంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలతో పాటు కుటుంబ ఆరోగ్య చరిత్ర మరియు వ్యక్తిగత ఆరోగ్య చరిత్రను తెలుసుకుని ఈ వ్యాధిని నిర్ధారిస్తారు. కొన్ని సందర్భాలలో రక్తపరీక్ష, చర్మపు మచ్చలను బయాప్సీ చేయడం ద్వారా కూడా 'ఎగ్జిమా' వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** కాన్‌స్టిట్యూషనల్ హోమియోపతి చికిత్సలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, ఎలాంటి చర్మసమస్యలనైనా పూర్తిగా తగ్గించడం జరుగుతుంది. వీటి ద్వారా శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'ఎగ్జిమా'ను పూర్తిగా నయం చేస్తారు. కేవలం 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో, రోగి మానసిక, వ్యక్తిగత లక్షణాలు, శరీర నిర్మాణం వంటి అంశాల పరిశీలన తదుపరి మాత్రమే అందబడే చికిత్స ద్వారా 'ఎగ్జిమా' వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.

# నివాళి




# పని

## -ఇచ్ఛాపురపు రామచంద్రం

**"సార్! ముకుందరావుగారని.. మునుపు ఇక్కడ పనిచేసి ఇక్కడే రిటైరయ్యారు. వారు మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నారు. తీసుకురమ్మంటారా?" వినయంగా అడిగి ఆఫీసరుగారి స్పందన కోసం చూశాడు బంట్రోతు అప్పారావు.**

**"ఉద్యోగ విరమణ చేసినవారా! ఈ ఆఫీసులోనే?" కొంచెం ఆశ్చర్యంగా అడిగాడు ఆఫీసర్ అనంతరావు.**

"ఔను సార్. మీరు ఇక్కడికి బదిలీ మీద వచ్చేముందే వారు రిటైరయ్యారు. అందుకే వారిని మీరు చూసే అవకాశం లేక పోయింది" చనువు తీసుకుని చెప్పాడు బంట్రోతు.

"ఓహో! వారిని వెంటనే పంపు" అన్నాడు అనంతరావు.

నిమిషం గడవకుండానే ముకుంద రావుని ఆ గదిలోకి తీసుకువచ్చాడు అప్పా రావు.

"నమస్కారం" చెప్పాడు ముకుంద రావు.

"నమస్కారం కూర్చోండి" అంటూ ఆయనకి కుర్చీ చూపించి, అప్పారావు వైపు తిరిగి "వీరికొక మంచి కాఫీ తీసుకురా" అని చెప్పాడు.

ఆ మర్యాదకి ముకుందరావు పొంగిపోయాడు. అధికారాంతము నందు చూడవలె అయ్యగారి గతి... అన్నది తనపట్ల నిజం కాలేదు! కొత్తగా వచ్చిన ఆఫీసరు కుర్రవాడు, చాలా మంచివాడని ఎవరో చెబితే విన్నాడు గానీ, అధికారమూ, మంచితనమూ రెండూ ఒక ఒరలో పొసగని రెండు కత్తులనే అనుకున్నాడు. కానీ ఇప్పుడితను తన పట్ల ప్రదర్శిస్తున్న గౌరవ మర్యాదలు చూస్తుంటే తనెంత పొరపాటు పడ్డాడో తెలుస్తోంది. అంతేకాదు. తను వచ్చిన, అసాధ్యమనిపించే పని సాధ్యపడు తుందేమో అనే ఆశావేశమూ కలుగు తోంది.

"మీరీ కార్యాలయంలో పనిచేస్తూనే ఉద్యోగవిరమణ చేశారని విన్నాను"

"ఔను" అన్నాడు ముకుందరావు.

"ఆరోగ్యం బాగానే ఉంటోంది కదా?"

"ఊఁ"

"పెన్షను సక్రమంగానూ, సకాలంలోనూ అందుతోందా?"

"నెలనెలా ఒకటో తారీకున ఠంచనుగా అందుతోంది పెన్షను" గొణుగుతున్నట్లు చెప్పాడు.

ఇక అడగవలసిన కుశల ప్రశ్నలేమీ లేనట్లు - "మీరేం పనిమీద దయ చేశారు? పూర్వ ఉద్యోగి అయిన మీకు మేం ఎలాంటి సహాయం, సేవ చెయ్యగలం?" మర్యాదగా అడిగాడు అనంతరావు.



ఆఫీసరు కుర్చీవెనుక గోడమీద మహాత్మాగాంధీ ఫొటో వైపు చూస్తూ కొన్ని క్షణాలపాటు మౌనంగా ఉండిపోయాడు. కానీ ముకుందరావు మాత్రం తాను వచ్చిన పని గురించి చెప్పాలా, వద్దా అని తర్జన భర్జన పడుతున్నట్లు కనిపించడంతో, "మీరేమీ సందేహించకండి. సంకోచించ కండి. చెప్పండి. మీరేం పని మీద వచ్చారో చెప్పండి. చేయడానికి మా శాయశక్తులా ప్రయత్నిస్తాం. మీరూ ఒకప్పుడు ఈ సంస్థకి చెందినవారే. మొహమాట పడకుండా చెప్పండి"

"చెబుతాను. చెప్పడానికే వచ్చాను. కాని

నా పని విని నన్నో పిచ్చివాడనుకోరు కదా? నవ్వరు కదా?"

"మీరు పెద్దవారు. మేము మిమ్మల్ని చూసి ఎందుకు నవ్వుతాం? మీరు అడిగారు కనుక హామీ ఇస్తున్నాను. మీ పని ఎలాంటిదైనా నవ్వను. సరేనా?" వాగ్దానం చేస్తున్నట్టు అన్నాడు అనంతరావు.

ముకుందరావు తలవంచుకుని "నేను ఇక్కడికి వచ్చిన పని... నాకు ఇక్కడ పని చేసే అవకాశం కల్పించమని ప్రార్థించాలని వచ్చాను" మెల్లగా అడగలేక అడగలేక అడిగాడు.

అనంతరావు తెల్లబోయాడు.

"ఏమిటి మీరనేది?"

"నాకిక్కడ మళ్ళీ పనిచేసే అవకాశం ఇవ్వమని..."

"అదెంత అసాధ్యమో మీకు తెలియదా? అయినా మీకు మళ్ళీ ఉద్యోగం ఎందుకు? వస్తున్న పెన్షన్ చాలడంలేదా? ఆర్థిక ఇబ్బం దులా?"

"నిజం చెప్పాలంటే - బాధ్యతలూ, బాదరబందీలూ లేని నాకు ప్రతినెలా లోటు లేకుండానే పెన్షను సరిపోతోంది. నేనిక్కడ పని అడుగుతున్నది ఆదాయం కోసం కాదు. డబ్బుకోసం అసలే కాదు. నాకు కావలసింది డబ్బు కాదు, పని."

"ఎందుకని? మీకు కాలక్షేపం అవడంలేదా? ఒక్కసారిగా పని లేకుండా దొరికిన విశ్రాంతి మీకు ఇబ్బంది కలిగిస్తోందా?" జాలిగా అడిగాడు అనంతరావు.

"ఉహు! నాకు కాలం గడవకపోవడం, కాలక్షేపం కాకపోవడం లాంటి సమస్య లేదు."

"మరి?" ఆశ్చర్యంగా చూశాడు ఆఫీసరు. అతనికి ముకుందరావు విషయంలో కుతూహలం పెరిగింది. డబ్బుకోసమూ కాక, కాలక్షేపం కోసమూ కాక మనుషులు మరెందుకు పని చెయ్యాలనుకుంటారు?

"నాది చిత్రమైన దురవస్థ. అడగడానికి నాకే నోరు రావడం లేదు. కానీ నేను చెప్పింది విని సానుభూతితో అర్థం చేసుకుంటే ఇక్కడెందుకు పని ఇమ్మని ప్రాధేయపడుతున్నానో మీకే తెలుస్తుంది. మరి... మీరు. నా కథ, సొద వినడానికి కొంత సమయమూ, సహనమూ కేటాయించగలరా?"

"తప్పకుండా. నేనిప్పుడు తక్షణం చేసి తీరవలసిన పనేమీలేదు. చెప్పండి. మీరు చెప్పదలచుకున్నది నిస్సందేహంగా చెప్పండి. మేమూ రేపు ఉద్యోగ విరమణ చేయవలసిన వాళ్ళమే. మీ అనుభవాలు మాకు పనికి రావొచ్చు" అని, వినడానికి సిద్ధపడినట్టు కుర్చీలో ముందుకి వంగాడు అనంతరావు. ఇన్ అని రాసి ఉన్న ట్రేలో ఫైళ్ళేమీ లేవు. దానిని పక్కకి జరిపేశాడు.

"నాకు ఇలాంటి అవకాశం ఇస్తున్నందుకు మీకు చాలా కృతజ్ఞతలు. నా ప్రస్తుత పరిస్థితిని సరిగా అర్థం చేసుకోగలగాలంటే, ఉద్యోగ విరమణ, వృద్ధాప్య ప్రభావం ఎలా ఉండవచ్చునో తెలుసుకోవడం మంచిది"

"అనుభవిస్తున్నారు కనుక అది మీరు చెప్పగలరు" అన్నాడు అనంతరావు.

"ఉద్యోగ విరమణ పొందిన వారిని ప్రభుత్వం మర్యాదగా సీనియర్ సిటిజన్ అని పిలుస్తుంది. ఒంట్లో ఓపిక హరించడం, రక్తంలో పటుత్వం తగ్గడం, చావు దగ్గర పడుతోందని మనసులో భయపడుతూ ఉండడం, అంతవరకూ నాస్తికుడుగా బతికినా మృత్యుభీతితో దేవుడివైపు మళ్ళడం, స్వాముల వారి ఉపన్యాసాలు వినడం, ఆధ్యాత్మిక గ్రంథాలు చదవడం... ఇలా రోజులో కొంతసేపు గతాన్నీ గత వైభవాన్నీ తలుచుకుంటూ గడపడం, వీలయినంత వరకూ సమవయస్కుల మధ్యా, అలా కుదరకపోతే ఎవరో ఒకరితో గడపాలని ప్రయత్నించడం.. ఇలాంటివి చేస్తుంటాడు. నేనూ అందుకు సడలింపు ఏమీ కాదు. ఉద్యోగ విరమణ చేసిన తర్వాత నేను చేసుకున్న కొత్త అలవాట్లలో ఒకటి ఏమిటంటే, సాయంత్రమయ్యేసరికి వాతావరణం ప్రతికూలించకపోతే విధిగా హరితా పార్కుకి వెళ్ళడం. ఆ సమయానికి ఉద్యోగ విరమణ చేసినవారు ఆ పార్కుకి ఐదారుగురు వస్తూ ఉంటారు. ఆవిశ్రాంత ఉద్యోగులలో ఒకరు ఏ రామాయణమో, భాగవతమో చదివి చెబుతుంటారు. అలా ఓ అరగంటసేపు పురాణ కాలక్షేపం చేశాక మేము కబుర్లలో అంటే, లోకాభిరామాయణంలో పడతాం. కుర్రాళ్ళం కాదు కనుక సినిమాలూ, సైబర్ కేఫులూ, శృంగారమూ వంటివి కాక రాజకీయాలు, ధరల పెరుగుదల వల్ల స్థిరాదాయంగల పింఛనుదారులు ఎదుర్కొనే ఇబ్బందులు, మనుషులలో నీతి తగ్గిపోవడం, అవినీతి పెరిగిపోతూ ఉండడం, ధరలు మండిపోతూండడం వంటి విషయాలమీద అభిప్రాయాలూ, సానుభూతీ ప్రకటించేసి వృద్ధులం మనమేం చెయ్యగలం? అని నిట్టూర్పులు వదులుతాం. అప్పటికి చీకటి పడుతూ ఉంటుంది. ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోతాం. వృద్ధుల దినచర్యలో ఈ సాయంకాల సమావేశాల పాత్ర, ప్రాముఖ్యమూ తక్కువేమీ కాదు. చాలామంది ముసలివారు నలుగురిని కలుసుకుని కబుర్లు చెప్పుకునే ఈ అవకాశం కోసం, ఈ స్నేహితుల కోసం సాయంత్రం ఎప్పుడౌతుందా అని ఎదురు



**పశ్చాత్తాపంతో, అపరాధ భావంతో కుమిలిపోతున్నాడతను. మనసు వికలమై ఏం చేయాలో తెలియక వేళ కాని వేళలో స్నేహితుడింటికి వెళ్ళాడు. తన గోడు వెళ్ళబోసుకున్నాడు. నేను నేరస్థుణ్ణి కాదలచుకోలేదు, క్షమించు అనేశాడా స్నేహితుడు. చివరకు తను రిటైరైన ఆఫీసుకు వెళ్ళి ఆఫీసరుకు తన గాథ వినిపించాడు. ఆఫీసరు జాలిపడ్డాడుగానీ అతడిదీ నిస్సహాయతే. ఇంతకీ ఆ బాధితుడి పశ్చాత్తాపం దేనికి? అతడు చేసిన అపరాధం ఏమిటి?**

చూస్తారన్నా ఆశ్చర్యమేమీ లేదు.

ఆవేళ...

ఏదో మాటమీద మాటొచ్చి "మీకేం? ఒకటో తారీకు కల్లా హాయిగా పెన్షన్ అందుకుంటారు. 'ఎద్దుపుండు కాకికి నొప్పా' అని మా బాధలు మీకేం తెలుస్తాయి?" అన్నారు పెన్షన్ రాని ప్రభాకరం కొంచెం అసూయ పడుతున్నట్లుగా. వారు చేసిన ఉద్యోగానికి పెన్షన్ సౌకర్యం లేదని నాకు అంతవరకూ తెలియదు. ప్రభాకరం మాట అతనికి తగిలిందో, లేక పెన్షనర్ల తరపున వకాల్తా తీసుకోవాలనుకున్నాడోగానీ "మాకు పెన్షన్, తేరగా ఇవ్వడం లేదు. వాయిదా వేయబడిన జీతపు భాగమే బోనస్. అప్పటి మా జీతంలోంచి నెలనెలా కట్ చేసి ఏర్పాటు చేసిన ఫండ్‌ని కలిపి ఉద్యోగ విరమణ అనంతరం పెన్షనుగా చెల్లిస్తున్నారు గానీ మేము సర్వీసులో ఉండగా పగలనక రాత్రనక, ఎండనక వాననక ఎంతో కష్టపడి పనిచేశాం. ఉల్పాగానో, దయాధర్మ భిక్ష గానో ఇవ్వడం లేదు. చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవ కదూ ముకుందరావు?" అంటూ నన్నూ మద్దతుగా మాట్లాడమన్నట్టు నా వైపు చూశాడు పరమేశ్వరరావు.

అతనిలాగే నేనూ పెన్షనర్‌నే. అంతేకాక అతనితోపాటే పని చేసినవాణ్ణి. అతన్ని బల పరచకుండా ఎలా ఉండగలను? "ఔను. నిజమే" అన్నానేగానీ, పరమేశ్వరరావు మాట నా మనసులో శూలంలా నాటుకుంది. ఇంటికి వెళ్ళాక కూడా అది నన్ను పొడిచి పొడిచి వదలడం మానలేదు.

"ఎండనక వాననక, పగలనక రేయనక ఎంతో కష్టపడి పని చేశాం. ఆ మాటే నన్ను అంకుశంలా పొడవడం మొదలు పెట్టింది. అంతరాత్మ నిలదీయడం మొదలెట్టింది. 'నీ విషయంలో పనిచేశానన్నమాట అర్థ సత్యమో పాక్షిక సత్యమో... అంతేకదా? ఎంతసేపూ జీతాల పెంపూ, ప్రమోషనూ, కావలసిన చోటుకి బదిలీ, కరువు భత్యం లెక్కలూ... వీటితోనే నీ మెదడు నిండి ఉండేదితప్ప పనిమీద ధ్యాస ఉండేదా? నువ్వు ఆఫీసుకి సకాలంలో వచ్చిన రోజుల శాతం ఎంత స్వల్పమని! వచ్చాకైనా సీటులో కూర్చుని పనిచేసి ఎరుగుదువా? ఊహు... సహోద్యోగుల తోనో మరొకరితోనో బాతాఖానీ, అందుకు మనుషులు దొరక్కపోతే క్యాంటీన్‌కి పోయి టీలు తాగుతూ, సిగరెట్లు కాలుస్తూ, పేపరు చదువుతూ గంటలు గంటలు పనికి గైర్హాజరు. ఎంతసేపూ పని ఎగ్గొట్టాలని మార్గాలు వెదకడమే నీ పని. ఔనా, కాదా?' అని అంతరాత్మ నిలదీస్తుంటే నిజం కాదని ఎలా అనగలను? మరెవరి ముందైనా అబద్ధం ఆడగలనేమోగానీ అంతరాత్మ ముందు తప్పించుకోలేం కదా? "ఔను.." అని గొణిగాను. గతంలో నేను చేసిన పనులూ, నా నేరమూ ఒప్పుకుంటూ. నా అంతరాత్మ నన్నింకా పొడవసాగింది. ఎంత తక్కువపని చేసి ఎంత ఎక్కువ జీతం తెచ్చుకుంటే అంత ప్రయోజకత్వమూ, ప్రతిభా అనుకుంటూనే సర్వీసంతా తక్కువ పని చేస్తూ గడిపేశావు. ఎగిరి దంచినా అదే కూలీ, ఎగరకుండా దంచినా అదే కూలీ. కనక కష్టపడి పనిచేసేవాళ్ళు తెలివి తక్కువవాళ్ళే. సరదాగా గడిపే నాకూ ఆ జీతమే, నేను చేయకుండా వదిలేసిన పని కూడా తానే చేసే పరమేశ్వరరావుకీ అదే జీతం. జీతాలకి వాళ్ళతో సమానం, పనికి వాళ్ళకంటే చాలా తక్కువ! 'దున్నబోతే దూడలలోనూ, మేయబోతే ఎద్దుల్లోనూ' అన్నట్లుండగలగడమే వివేకం.

"ముకుందరావు గారూ! మీరు వాడిన సామెతకు అర్థం ఏమిటి?" తనకి తెలియని విషయాన్ని తెలియదని ఒప్పుకోడానికైనా, ఏదైనా తెలుసుకునేందుకైనా సంకోచించే అలవాటు లేని అనంతరావు అడిగాడు.

"దూడలకింకా తగిన వయసు రాలేదని రైతు వాటిని దున్నడానికి పంపడు. అంటే, దూడలకు పనుండదు. దున్నడం, బరువుల బండి లాగడం వంటి పనులు ఎద్దులు చేస్తాయి కనుక వాటికి ఎక్కువ మేత, మంచి మేత వేస్తాడు. కాబట్టి తిండికి వచ్చేసరికి ఎడ్లలో ఉంటూ పని వచ్చేసరికి దూడలలోకి పోతే సుఖపడవచ్చు, శ్రమ చేయకుండా!"

"చాలామంది అలాగే అనుకుంటారుగా. ఉద్యోగ విరమణ చేసిన మీరు ఇప్పుడు గతం తవ్వుకుని, గతజల సేతుబంధన ప్రయత్నం చేయడం దేనికి?" "అక్కడికే వస్తున్నాను. ఉద్యోగ విరమణ చేశాక వయోధర్మం కొద్దీ ఆధ్యాత్మిక గ్రంథాలు చదవడం, గురూపదేశాలూ, ఉపన్యాసాలూ వినడం, మంచి మాటలు ఆలకించడం చేయసాగానని చెప్పాను కదా? పరమేశ్వరరావు ఆ మాటలు నన్ను ఉద్దేశించి అన్నా, అనకపోయినా నాకు తగిలాయి. పని చేయకుండా ఫలం దొంగిలించిన వాడినని నిందించసాగింది అంతరాత్మ. అదే సమయంలో నేనొక కాలనీకి వెళ్ళాను. అక్కడొక కోవెలలో, పనియే మనిషికి బలం; పనిలోనే ఉంటాడు పరమాత్మ, వర్క్‌ఇజ్ వర్షిప్, వర్క్‌ఇజ్ గాడ్, ప్రార్థన చేసే పెదవుల కన్న పనిచేసే చేతులు మిన్న... లాంటి సూక్తులు చదివాను. అక్కడొక ప్రవచనం విన్నాను. నేను పనిచేయకుండా సంపాదించాను కనుక దొంగనే. పై లోకంలో అందుకు శిక్ష అనుభవించవలసి ఉంటుంది. చేసిన తప్పును ఈ లోకంలోనే సవరించుకుని ప్రాయశ్చిత్తం చేసుకోలేకపోతే...? అని గ్రహించాను. యద్భావం తద్భవతి అన్నట్లు ఇక అప్పటినుంచీ నాకు అన్నీ పని గొప్పతనాన్ని చాటిచెప్పే ఘటనలే ఎదురయ్యాయి. ఇక భరించలేకపోయాను. ఏదో ఒకటి చేయకపోతే అంతరాత్మ నన్ను నిలవనిచ్చేటట్టు లేదు. రాత్రిళ్ళు నిద్రపోనిచ్చేటట్టు లేదు. నోటికి ముద్ద అందించబోతే, దోచుకున్న కూడు... పాపపు కూడు... చాకిరొకరిది, సౌఖ్యమొకరిది... అని అంతరాత్మ నన్ను ములుకర్రతో పొడుస్తున్నట్టనిపించింది. భరించలేకపోయాను. అది వేళ కాని వేళే అయినా తక్షణమే పరమేశ్వరరావు వద్దకు బయలుదేరాను. అతనూ నేనూ సహోద్యోగులం. ఒక్కసారే ఉద్యోగ విరమణం చేశాం. అందుచేత అతని దగ్గర నాకాపాటి చనువుంది.

"ఏమిటిలా వచ్చావు రాత్రిపూట? అంతా బాగానే ఉన్నారా?" ఆహ్వానించాడతను.

"నాకే బాగులేదు" అంటూ అతనికి నా బాధ చెప్పుకుని, ఈ అపరాధ భావనను భరించలేకపోతున్నా. నీ ముందు నేనే నేరస్థుడిలా నిలబడలేకపోతున్నాను" అని మొరపెట్టుకున్నాను.

"నేను నీకేం సాయం చేయగలనో చెప్పు. సాధ్యమయితే తప్పకుండా చేస్తాను" అని అతను హామీ ఇచ్చాక, "నేను ఎగ్గొట్టిన పని నువ్వే చేశావు. నా పనిలో భాగం పంచుకున్నట్లే నా పెన్షన్‌లో కూడా భాగం స్వీకరించు. అప్పుడు నా



# ఈ కండీషన్లేంటి రీతూ

రాకరాక ఒక్క సక్సెస్ వస్తే దాన్ని క్యాష్ చేసుకోకుండా రీతూ వర్మ అనవసరమైన కండీషన్లు పెడుతోంది అంటున్నారు సినీ జనాలు. 'పెళ్ళిచూపులు'తో కెరీర్‌లో తొలి సక్సెస్‌ను అందుకోవడమే కాకుండా ఆ సినిమాలో రీతూ లుక్స్ చాలా బాగున్నాయన్న కాంప్లిమెంట్ కూడా సొంతం చేసుకుంది. చూపులకి హాట్‌గా కనిపించే రీతూకి అవకాశాలు బాగానే క్యూ కడుతున్నాయట! అయితే స్కిన్ షో చేయను అంటూ రకరకాల కండీషన్లు పెడుతుండడంతో వచ్చిన వారు వచ్చినట్టే వెనక్కి వెళ్ళిపోతున్నారట! అందులో కొన్ని మంచి అవకాశాలు కూడా ఉన్నాయంటున్నారు.



మనసు శాంతిస్తుంది. నేను చేసిన నేరానికి పరిహారం చెల్లిస్తున్నట్లు. ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్లు"

"నీకేమైనా మతిపోయిందా?" ఆశ్చర్యంగా చూశాడు పరమేశ్వరరావు.

"నేనెంత భయపడుతున్నానో నీకు తెలియదు. గరుడ పురాణంలో అనుకుంటాను, పని దొంగలకి ఎంత భయంకర శిక్షలు విధిస్తారో రాశారు. అది చదివాక, ఎలాగైనా నా నేరాన్ని కడుక్కునేందుకే ఈ నా ప్రతిపాదన."

"నీ ప్రతిపాదననీ, పెన్షనులో భాగాన్నీ అంగీకరిస్తే నా అంతరాత్మ ముందు నేను నేరస్థుణ్ణి అవుతాను. ఎందుకంటే నేను చేసిన పని కార్యాలయం కోసం. నీకోసం కాదు. అందుచేత నీ పెన్షనులో భాగం తీసుకోవడం అర్థంలేని పని. క్షమించు" అనేశాడతను ఇంకేమీ మాట్లాడొద్దన్నట్టు.

●●●

"అలా ఆ అవకాశం మూసుకుపోయింది. పెన్షనులో భాగమివ్వడం కుదరలేదు. ఇక నాకు మిగిలిన మార్గాంతరం ఒక్కటే" చెప్పాడు ముకుందరావు.

"ఏమిటి?" అడిగాడు అనంతరావు.

"పోయిన చోటే వెదుక్కోవాలనీ, దెబ్బ తగిలిన చోటే మందు పూయాలనీ అంటారు. అలాగే నేను ఏ కార్యాలయంలో పని ఎగ్గొట్టానో అక్కడే ఇప్పుడు పని బాకీ తీర్చి నా పెన్షన్నైనా ధర్మసమ్మతం చేసుకుందామని నా తాపత్రయం. లేకపోతే పరలోకంలో నా పాట్లు కుక్కలు కూడా పడవు"

అందుకే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను, అధికారికంగానో, అనధికారంకంగానో నేనీ కార్యాలయంలో పనిచేసే అవకాశం కల్పించండి. నాకు జీతభత్యాలక్కర్లేదు. వేళకి ఆఫీసుకు వస్తాను, చిత్తశుద్ధితో శాయశక్తులా పనిచేస్తాను. నాకు డబ్బొద్దు. అధికారం అసలే వద్దు. సర్వీసులో ఉండగా ఎగ్గొట్టిన పనిని ఇప్పుడయినా చేసి బాకీ తీర్చుకోడమే నా ఉద్దేశం. అలాగైతేనే నా పెన్షన్ డబ్బుమీద అంటుకున్న పాపపు రక్తపు మరకలను తుడుచుకోగలుగుతాను. లేకపోతే జీవితాంతం నాకు మనోవేదనే, చిత్రహింసే" కన్నీళ్ళు ఆపుకోలేక పోయాడు ముకుందరావు.

సాటిమనిషిగా అనంతరావు ఆయన పశ్చాత్తాపాన్నీ, బాధనీ సవ్యంగానే అర్థం చేసుకున్నాడు. అతనిమీద జాలి, సానుభూతితో అనంతరావు కంఠం మరింత మృదువుగా మారింది. "మిమ్మల్ని నేను అర్థం చేసుకున్నాను. కానీ, నేను ఆఫీసరునైనా నా హద్దులూ, సాధ్యాసాధ్యాలూ నాకుంటాయని మీకూ తెలుసు. తపాలా వంటి కొన్ని శాఖలలో విశ్రాంత ఉద్యోగుల సేవలను తక్కువ చెల్లింపులకి పొందే సావకాశం ఉన్నమాట నిజమే కాని, మన సంస్థలో అలాంటి అవకాశాలు లేవు. అయినా మీకు తెలియదని కాదుగానీ... నేనొకటి చెప్పాలనుకుంటున్నాను"

"ఏమిటి...?" ఆశగా చూశాడు ముకుందరావు.

"ప్రజాసేవ నిజంగా చేద్దామనుకున్నవారికి పదవులు అక్కరలేనట్లే, పని చేద్దామన్న దృఢ సంకల్పం కలవారికి సమాజంలో సేవ చేయడానికి కార్యాలయాలతో నిమిత్తమూ లేదు. సమయదానం, శ్రమదానం, సేవాదానం... ఎన్నో చెయ్యొచ్చు. మీరు ఆలోచించాలే కాని మార్గమే తట్టకపోతుందా? మీరడిగినది చేయలేకపోయినందుకు నన్ను క్షమించండి. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాడు అనంతరావు తన నిస్సహాయతని కంఠంలోనే సూచిస్తూ. పద్ధతులతనికి కొత్తేమీ కావు కనుక ముకుందరావు బయటకు వచ్చేశాడు.

●●●

ఇలాంటి వింతజీవీ, విచిత్ర వ్యక్తీ ముకుందరావు ఇప్పుడేం చేస్తున్నాడు? రద్దీలో రోడ్డు దాటలేకపోతున్న వృద్ధులనీ, వికలాంగులనీ, చిన్నపిల్లలనీ చేయి పట్టుకుని రోడ్డు దాటిస్తాడు చూశారా... అతనే ముకుందరావు. రోడ్డు పక్క అడుక్కుంటున్న కుష్టువాడు తన చేతులు మొండిబారి కారుతున్న రక్తం మీద ముసురుతున్న ఈగలను తోలుకోలేక ఇబ్బంది పడుతూంటే ఆ ఈగలను తరుముతూ ఉంటాడే, అతనే ముకుందరావు. పోస్టాఫీసుల దగ్గర చదువురాని వాళ్ళకి ఉత్తరాలు చదివి పెడుతూనో రాసి పెడుతూనో, బ్యాంకుల దగ్గర విత్‌డ్రాయల్ ఫారాలు నింపి నిరక్షరాస్యులకి సాయపడుతూనో కనిపిస్తాడే, ఆ వృద్ధుడే ముకుందరావు!

అతను చేస్తున్న మానవసేవను మెచ్చి భగవంతుడు అతనికి అలాంటి సేవలు అనేకం చేసే శక్తిసామర్థ్యాలనిచ్చాడు కాబోలు ముకుందరావు ముసలితనం బారిన పడడం లేదు! నిజమైన సేవాతత్పరులు వయసుకి కూడా అతీతులే కదా! ఇప్పుడతనికి చావన్నా భయంలేదు, బతుకన్నా భయం లేదు.

నవ్య



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 32

**నటుడికి ఏకాగ్రత ఉండాలి. రుజుమార్గంలో ప్రయాణించాలి. కళ్ళముందు కనిపించే తన దారిలోనే వెళ్ళాలి. అడ్డాలు, ఆటంకాలు వస్తాయి. తప్పించుకోవాలి. నదులు వస్తాయి, దాటాలి. ఈ అవరోధాలు అధిగమించలేనివాడు ఎప్పటికీ పైకి రాలేడు.**

**ఆ రుజుమార్గమనేది ఇప్పటికీ ఉంది నాకు. నేను ఒకటి అనుకుంటే అది చేస్తా, చేసేదాకా ప్రయత్నిస్తా. ద కాన్సన్‌ట్రేషన్ ఈజ్ ద క్రైటీరియా టు ఎచీవ్ ఎనీథింగ్.**

# ప్రపంచం గాంధీని నెత్తిన పెట్టుకుంది.. కానీ మనం?

ఒక ప్రొడ్యూసర్ అన్నాడు నన్ను, 'ఇండస్ట్రీ నాది. నా చేతిలో ఉంది. నేను తలచుకుంటే నిన్ను నాశనం చేసేస్తాను' అని. నేను అతన్ని కలవక పోవడమో లేక దేనికోసమో జరిగిన చిన్న యుద్ధం. సరేసార్ అని వెళ్ళబోతున్నా. ఊ... చెప్పేది వినా అన్నాడు. నేను అన్నా. 'మీకు టార్గెట్ అతి స్వల్పమైంది. కానీ నా టార్గెట్ ఇండస్ట్రీ. ఇండస్ట్రీలో నేనెంతగా బాగుపడాలనేదే నా లక్ష్యం. మీకు నేను సింగిల్ టార్గెట్. నన్ను నాశనం చేసే వృత్తిలో ఉండిపోయి ఇండస్ట్రీని మర్చిపోయి దూరమై పోతారు మీరు. కానీ మీకు దొరక్కుండా, మీ ఛాయ కూడా పడకుండా నేను జాగ్రత్తపడతా. నేను దొరక్కుండా తప్పించుకోవడంవల్ల మీరు నాశనం అయిపోతారు. మీరు హెచ్చరించడం వల్ల నేను గొప్పోణ్ణి అయిపోతాను' అన్నా.

కానీ అతను ఇవాళ హైదరాబాద్ రోడ్లమీద స్కూటరు వేసుకొని తిరుగుతున్నాడు. కొన్ని పేర్లు చెప్పకుండా కూడా వాళ్ళ గురించి రాయచ్చు మనం. ఎందుకంటే వాళ్ళను అవమానించడం తప్పు. గెలిచిన వాళ్ళ పేరు చెప్పడం తప్ప, ఓడి పోయిన వాళ్ళను టార్గెట్ చేసి మనం గెలిచాం అని చెప్పుకోవడం మన అసమర్థత. కాకపోతే ఈ పరిశ్రమ నాది నేను ఒక్కణ్ణీ ఏదో చేసెయ్యగలను అనుకున్న వాడికి మాత్రం ఇదొక గుణపాఠం. అంతే.

### గాంధీ ఈజ్ గ్రేట్

కొందరు ఉన్నతాధికారులు నాకు ఒకసారి పార్టీ ఇచ్చారు. ఇందులో ఇద్దరూ ఐఏఎస్, ఇద్దరు ఐపీఎస్. ఒకాయన క్రియాశీలంగా ఉండే పెద్ద మనిషి, మిగిలినవారు రిటైర్డ్. ఈ పార్టీకి నేను వెళ్ళిన దగ్గరనుంచీ వాళ్ళల్లో ఉన్న ఒక ఐఏఎస్ ఆఫీసర్ మొదలుపెట్టిన టాపిక్ ఏంటంటే, మహాత్మాగాంధీని తిట్టడం. ఆయన అభిప్రాయం ఏమిటంటే, మన దేశం అవినీతిమయమైపోయింది. ఈ రాజకీయనాయకులందరూ తినేస్తున్నారు. మంచిని సపోర్టు చేయడం లేదు, అదే బ్రిటీష్ వాళ్ళుంటే ఈపాటికి పెద్దపెద్ద రోడ్లుండేవి. దేశం బాగుపడి ఉండేదని మొదలుపెట్టాడు. నేను ఆయన్ని ఏమని మాట్లాడతాను? పిలిచి పార్టీ ఇచ్చాడు. వాళ్ళందరి ముందూ చిన్నవాడిని. ఆయన బాయ్‌ని పిలిచి వెయ్యి రూపాయలు నోటిచ్చి మందు తీసుకురా అన్నాడు. అప్పుడు నేను అడ్డు పడ్డా. ఆ వెయ్యి రూపాయల నోటు ఇవ్వద్దండి, గాంధీ గారు మీ దృష్టిలో పనికిరానాయన. ఆయన బొమ్మ దాని మీద ఉంది. అది ఆనర్ చెయ్యద్దు సార్. అది చింపేసి మిగిలిన నోట్లివ్వండి అన్నా. అలా ఎలా చేస్తారు మీరు, ఇవ్వండి సార్, మీకు ఒక అభిప్రాయమంటూ ఉంది అన్నా. ఆయన మాట్లాడలా. అది కాదండీ అన్నాడు. ఆయన గ్రహించారని ఈవాళ నేననుకుంటున్నా.

'నో ప్రాబ్లమ్ అండీ. నాకు గాంధీ అంటే గౌరవం. ఆ నోటు చింపకుండా డబ్బులిచ్చి నేను తెప్పిస్తాను అన్నా. ప్రపంచదేశాల్లో ప్రతి కరెన్సీ మీద రాజు మారితే రాజు బొమ్మేస్తారు. మంత్రి మారితే మంత్రి బొమ్మ వేస్తారు. మన కరెన్సీమీద గాంధీ గారి బొమ్మ ఎప్పటికీ మారదు. అందుకే గాంధీ ఈజ్ గ్రేట్. ఇండియన్ గవర్నమెంట్ ఈజ్ గ్రేట్ అని చెప్పా. నాది చాలీచాలని చదువండీ. నాకు వచ్చింది నేను చెప్తా. మనకు స్వాతంత్ర్యం తీసుకొచ్చింది గాంధీ. ఆయన గురించి తప్పుగా మాట్లాడటం ఫూలిష్‌నెస్. అనాగరికతతో సమానం. తిట్టేవాణ్ణి తిట్టుకోనివ్వండి, మనకెందుకు. గాంధీ పోరాటం చేసినప్పుడు నువ్వు పుట్టలేదు. నువ్వు బ్రిటీష్‌వాళ్ళని ఎదుర్కోలేదు. కానీ ఆయుధం లేకుండా, చొక్కా లేకుండా, చెప్పులు లేకుండా తిరిగిన ఆ బక్క పలచ మనిషిని చూసి, ప్రపంచ దేశాల్ని గడగడ లాడిస్తున్న బ్రిటీష్ సామ్రాజ్యం పారిపోయిందే, ఆ విషయం నువ్వు ఎందుకు ఆలోచించవు? ఎవడు గొప్పవాడైతే వాణ్ణి తిడితే నేను వాడికన్నా గొప్పోడినైపోతా అనేది ఒక ఫ్యాషన్. సరే, వాళ్ళు ఫూల్స్, స్టుపిడ్స్! నువ్వు ఒక పని చెయ్యి, ఆయన కంటే గొప్పవాడిగా, నువ్వు ఏదైనా చెయ్యి. గాంధీ


అమెరికాలో ఎమ్.ఎస్.నారాయణ

ఏం చేశాడయ్యా, నేను చేశాను, ఇప్పుడు ఇండియా ఎలా ఉందో చూడు అని చెప్పు' అన్నా.

**ఎగతాళి చేస్తున్నాం**

మొదటిసారి అమెరికా వెళ్ళినప్పుడు న్యూయార్క్‌లో నా మిత్రునితో కలిసి క్వీన్స్ నుంచి మన్‌హట్టన్ సబ్‌వే ట్రైన్‌లో వెళ్ళాం. బహుశా ఓ అరగంట ప్రయాణం. రకరకాల మనుషులు ఎక్కారు. నేను అందరినీ పరిశీలిస్తున్నాను. నా పక్కన ఓ నల్ల జాతీయుడైన పెద్ద మనిషి కూర్చున్నాడు. ఇండియా నుంచి కొత్తగా వచ్చారా? అని పలకరించాడు. ఆశ్చర్యపోయా. మీరెలా గుర్తించారు? అని అడిగా. మీ పోలికనుబట్టి అన్నాడు. ఇండియా గురించి మీకేమైనా తెలుసా? అన్నాను. కొంచెం తెలుసు. గాంధీ తెలుసు. గవాస్కర్ తెలుసు. ఈ మధ్య సచిన్ తెలుసు అన్నాడు. నా ఆశ్చర్యానికి అంతు లేదు. నాకు రాజకీయాలు పరిచయం లేదు కాని గాంధీ, ఇండియాకి శాంతియుతంగా స్వాతంత్ర్యం తెచ్చాడని విన్నా అన్నాడు. నేను కరేబియన్ ఐలెండ్స్ నుంచి వచ్చా. అందుకే క్రికెట్ అంటే ఇష్టం. ఇండియన్ క్రికెట్ స్టార్స్ తెలుసు అన్నాడు. నాకు అప్పటికీ ఇప్పటికీ బాధ అనిపిస్తూనే ఉంటుంది. ప్రపంచం గాంధీని నెత్తిన పెట్టుకుంటే మనం ఏమిటి? గాంధీని ఎగతాళి చేస్తున్నాం అని. అందుకే గాంధీ టాపిక్ వస్తే నేను మనిషిని కావడానికి కొంత సేపు పడుతుంది.

"అందరిలానే చిన్నప్పటి నుంచీ నాకు కూడా అమెరికా అంటే క్రేజ్ ఉండేది. దానికి కారణం నేను చూసిన ఇంగ్లీష్ సినిమాలు, చదివిన ఇంగ్లీష్ నవలలు, డిటెక్టివ్ నవలలే కారణం. కానీ కొన్ని తెలుగు గ్రంథాలలో బ్రాహ్మణులు, సంప్రదాయ వాదులు ఇంగ్లీషు వాళ్ళను చులకనగా చూసే వారు. 'అప్రాచ్యపు వెధవా' అని తిట్టేవారు కూడా. అప్రాచ్యుడు అంటే బంతికూడులో తినడానికి పనికి రానివాడని ఒక అర్థం. అంటే విదేశీ సంప్రదాయం పాటించే వాడని వాళ్ళ అర్థమన్నమాట. ఇప్పటికీ సనాతన ఆచారాలు పాటించేవారు, కొన్ని దేవాలయాలలో పూజారులు ఇతర దేశాలు వెళ్ళకూడదనే నియమం ఉంది. ఉదాహరణకి మన టి. టి. డి పూజారులు అమెరికా నుంచి ఆహ్వానం వస్తే తిరస్కరించారు కూడా. సరే ఆ సంగతి అలా ఉంచండి.

**ఎందుకైనా మంచిదని**

**ఎస్ అన్నా, కానీ సారీ అన్నాడు**

"నా మొదటి అమెరికా ప్రయాణం 2000వ సంవత్సరంలో జరిగింది. అప్పుడు తానా (అమెరికా లోని తెలుగు సంఘం) నుంచి పిలుపు వచ్చింది. పాస్‌పోర్టుకు అప్లై చేశా. వచ్చేసింది. ఇక అమెరికా వెళ్ళిపోవచ్చు అనుకున్నాను. కానీ ప్రతి దేశానికీ వీసా ఉంటుందని, అదే ముఖ్యమని తరువాత తెలిసింది. విస్తుపోయాను. ఇంత గొడవేంట్రా బాబూ అనుకున్నా. తానా వారు ఆహ్వానితుల లిస్టు పంపించారు. మద్రాసులో అమెరికన్ కాన్సులేట్ ఇంటర్వ్యూకు వెళ్ళాం. ఒక అక్కడ ఆఫీసర్ అమెరికన్ ఇంగ్లీష్ ఏక్సెంట్‌లో ఏవో ప్రశ్నలడిగాడు. ఎందుకైనా మంచిదని ఎస్ అన్నాను. అతను సారీ అని పంపించేశాడు.



రచయిత కూనపరాజు కుమార్‌తో...

**నటుడైనందువల్లే విదేశాల్లో పర్యటించే అదృష్టం కలిగిందని ఎమ్మెస్ సంతోషపడుతూ ఉండేవారు. ఆయన అమెరికా ప్రయాణం సరదాగా సాగిపోయింది. తానా సభలకి వెళ్ళి అక్కడి తెలుగువారి ఆదరణ చవిచూశారు. న్యూయార్క్ వెళ్ళినప్పుడు తెలుగు సంఘంవారు ఆయనకు సన్మానం కూడా చేశారు. కానీ వాళ్ళు అక్కడ పెట్టిన బోర్డు చూసి ఎమ్మెస్ గుండెల్లో రాయి పడింది! ఇంతకీ ఆ బోర్డుమీద వాళ్ళేమని రాశారు?**

ఈవిషయం ఈవీవీ గారితో చెబితే మీకు ఇంగ్లీషు వచ్చు కదా అని అడిగాడు. వచ్చుగానీ అతని అమెరికన్ ఏక్సెంట్ అర్థం కాలేదన్నా. నాలా వీసా రానివాళ్ళందరం అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగారి జోక్యంతో మళ్ళీ ఇంటర్వ్యూకు వెళ్ళి సాధించాం.

**తెలుగువారి ఆదరణ**

డైరెక్టర్ ఇ.వి.వి. సత్యనారాయణగారి నాయకత్వంలో హాస్యనటుల బృందం డల్లాస్‌లో జరిగిన తానా మహా సభలకు వెళ్ళాం. నాకు, భరణి గారికి ఓ రూము. సభలో మేం ఒక స్కిట్ వేశాం. ద్రాక్షపళ్ళు అమ్మే పాత్రధారిని తుంటరిగా కవ్విస్తూ బేరం చేస్తాను నేను. చివరికి ఏమీ కొనను. అతనికి విసుగొచ్చి ఆ బుట్టతో నన్ను కొట్టి వెళ్ళిపోతాడు. సభికులు పగల బడి నవ్వుతున్నారు. బుట్టతో కొట్టినప్పుడు నా చిటికెన వేలుకు తగిలి వెనక్కి వేలాడింది. నాటిక అయ్యే దాకా ఓపికపట్టా. ప్రేక్షకుల్లో ఉన్న ఓ ఆర్థోపెడిక్ డాక్టర్‌గారు గమనించి వెంటనే వచ్చి సరిచేశారు. హమ్మయ్య ఓ ప్రమాదం తప్పిందనిపించింది. అక్కడే అనేక నగరాలలో ప్రదర్శనలు ఇచ్చాం. అమెరికాలో తెలుగువారి ఆదరణ మరువలేనిది. తిరుగు ప్రయాణంలో న్యూయార్క్ వచ్చా. కుమార్ నన్ను ఆహ్వానించి ఓ మూడు రోజులు నగరం అంతా చూపించాడు. ప్రతిరోజూ క్వీన్స్‌లో ఉన్న ఇంటి నుంచి బయలుదేరి సబ్‌వే ట్రైన్‌లో ప్రయాణం చేసి మన్‌హట్టన్ వెళ్ళేవాళ్ళం. స్టాట్యూ ఆఫ్ లిబర్టీ చూశా. ట్విన్ టవర్స్ ఎక్కి మహానగరాన్ని చూసిన అనుభూతి ఇప్పటికీ మరువలేను. ట్విన్ టవర్స్ పడిపోయిన వార్త విని చాలా బాధ వేసింది. 42వ స్ట్రీట్, బ్రాడ్‌వే వీధుల్లో నడిచి తిరగడం భలేగా అనిపించింది. ఆ నగరంలో తిరిగేటప్పుడు ఓ అద్భుత లోకంలో ఉన్నట్టనిపించింది.

**టికెట్టు ఐదు డాలర్లు!**

ఇంగ్లీష్ నవలల్లో, సినిమాల్లో చాలా ఇతి వృత్తాలు న్యూయార్క్ చుట్టూ తిరుగుతాయి. మ్యూజియం ఆఫ్ నేచురల్ హిస్టరీ, సెంట్రల్ పార్క్ నాకు బాగా నచ్చాయి. విశాలమైన రోడ్లు, ట్రాఫిక్ క్రమశిక్షణ నన్ను ఆకట్టుకున్నాయి. అందరిలానే నాక్కూడా అనిపించింది, మన దేశం ఇలా ఎప్పటికి మారుతుందో అని.

రెండోసారి 2005లో "దేవదాసు" సినిమా షూటింగ్ కోసం క్యారెక్టర్ ఆర్టిస్ట్ సయాజీ షిండేతో కలిసి వెళ్ళా. వైవీఎస్ చౌదరి నిర్మాత. సినిమా చాలా భాగం కాలిఫోర్నియా, న్యూయార్క్, న్యూజెర్సీ, వాషింగ్టన్ డి.సి.లలో తీశారు. షూటింగ్ పూర్తయ్యాక మరో మూడు రోజులు న్యూయార్క్‌లో కుమార్ దగ్గర గడిపాం. అప్పుడే నయాగరా జలపాతాన్ని చూసే భాగ్యం కలిగింది. న్యూయార్క్‌లో తెలుగు సంఘం వారు 'ఫ్లెషింగ్ గణేష్ టెంపుల్ ఆడిటోరియం'లో నాకు సన్మానం ఏర్పాటు చేశారు. హాలు దగ్గర ఒక బోర్డు ఉంది. ఎమ్మెస్ సన్మానం - టికెట్టు ఐదు డాలర్లు అని రాసి ఉంది. నా గుండెల్లో రాయి పడింది. ఇలా చేశారేంటి? అనిపించింది. ఇది గమనించిన కుమార్ ఇక్కడ హాలు అద్దె అవి చెల్లించడానికి తెలుగు సంఘంవారే ఈ ఏర్పాటు చేశారు. మీరేం భయపడకండి, అంతా సవ్యంగానే జరుగుతుంది అని చెప్పాడు. లోపలికి వెళ్ళేటప్పటికి, అప్పటికే హాలు కిటకిటలాడుతోంది.

*(ఇంకావుంది)*

*-కూనపరాజు కుమార్*

*సెల్: 99899 99599*

# కండరాల నొప్పి ఇక దూరం

ఫైబ్రోమయాల్జియా అంటే కండరాల నొప్పి. కండరాల నొప్పిలో ప్రైమరీ, సెకండరీ అని రెండు రకాలున్నాయి. మొదటిరకం ప్రైమరీ కండరాలనొప్పి ఇతర కారణాల వల్ల రాదు. సెకండరీ కండరాల నొప్పి ఇతర వ్యాధులు కారణాల వల్ల వస్తుంది. కారణాలు ఏవైనా కలవర పెడుతున్న కండరాల నొప్పి నుంచి హోమియో చికిత్స తో శాశ్వత ఉపశమనం కలిగించవచ్చని అంటున్నారు హోమియోవైద్యనిపుణులు డా॥ మురళీ అంకిరెడ్డి.

కండరాలు కుచించుకుపోయినట్లు అనిపించడం, కండరాలు కొంకర్లు పోవడం, నిద్రలేచిన తర్వాత అలసట గా ఉండటం, నీరసం, శరీరం శక్తినికోల్పోయి నట్లు అని పించడం, కండరాల నొప్పి, మెడ, వెన్ను భుజాల సున్నితంగా ఉండటం, నిద్రలేమి, ఉదయం లేచిన వెంటనే కండరాలు జగుతునా ఉండటం, ఆందోళన, తలనొప్పి తలతిరుగుతు న్నటు అని పించటం విరేచనాలు, మల బద్ధకం వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణాలు:** రక్తహీనత, థైరాయిడ్ సమస్యలు, అడ్రినల్ సమస్యలు, శరీరంలో వెలుతురు తక్కువగా ఉండటం, న్యూరో పతి అంటే నరాలకు సంబంధించి న సమస్య అతి మూత్ర వ్యాధి. డయాబెటీస్ వ్యాధులు కండరాల నొప్పికి కారణమవుతున్నాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సీజీపీ, ఈఎస్ఆర్, టీ3, టీ4, సీరం క్యాల్షియం, ఆర్‌జీఎస్, ఎఫ్‌జీఎస్, అడ్రీనల్ గ్లాండ్ పరీక్షల ద్వారా కీళ్ల నొప్పులను నిర్ధారించవచ్చు. హోమియో చికిత్స. కీళ్ళనొప్పుల సమస్య కు హోమియోలో బ్రయోనియా, రస్టాక్, కాల్చికమ్, ఫార్మికా, కాల్మియా, ఆర్నికా, ఆర్సినిక్, లైకోపోడియం మందులు వాడదగినవి.

**బ్రయోనియా:** శరీరంలో ఉన్న అన్ని కండరాలు నొప్పిగా ఉంటాయి. చిరిగినట్లు నొప్పి ఉంటుంది. ఈ నొప్పి కదలికలకు ఎక్కువగా ఉంటుంది. ఇది ధృడంగా ఉండి నల్లగా ఉండే వారికి మంచి మందు. సమస్యలు కుడి పక్క ఎక్కువగా ఉంటాయి. చిరాకు, ఎప్పుడు తమ వృత్తి గురించే మాట్లాడుతుండటం, మల బద్ధకం, నాలుక పొడిగా ఉండటం, వేడిని భరించలేక పోవడం వంటి లక్షణాలు ఉంటాయి. **రస్‌టాక్స్:** ఇది కీళ్లు, టెండాన్స్, కండరాలు మీద మంచిప్రభావం చూపుతుంది. అధిక బరువు ఎత్తడం, ఒత్తిడి వల్ల సమస్యలు, దిగులుగా ఉండటం లాంటి లక్షణాలకు ఈ హోమియో మందు బాగా పనిచేస్తుంది. కీళ్ళు, కండరాల మీద బాగా పని చేస్తుంది. కీళ్ళవాపు, చల్లగాలిని భరించలేరు. కాళ్లు పట్టినట్లు ఉంటాయి. సయాటికా, కుదురుగా ఒకచోట కూర్చోలేరు. నిరంతరం కదులుతుంటారు. తిమ్మిర్లు మొదలైన సమస్యలు ఉంటాయి. వీరు శ్రద్ధ, ఉత్సాహం లేకుండా, ఆత్మహత్య గురించి ఆలోచనలు రావటం, రాత్రి వేళ ఆందోళన మొదలైన లక్షణాలతో ఉంటారు. **కాల్చికమ్:** ఈ హోమియో మందు కండరాలు, కీళ్ళ చుట్టూ ఉండే పొర వద్ద మంచి ప్రభావం చూపిస్తుంది. వాతరోగం, కాళ్లు నీరసంతో, తిమ్మిరితో, సూదులతో పొడిచినట్లుంటాయి. కీళ్లవాపు, ఎరుపుదనం వెచ్చగా ఉండటం, బిగపట్టినట్లు ఉండటం, నొప్పులు ఒకచోట నుంచి మరోచోటుకు మారుతుండటం, కాలివేళ్ల వాపు, కడుపు ఉబ్బరం, ఆహారపదార్థాల వాసనకి వికారంగా అనిపించడం, నడుమునొప్పి మొదలైన లక్షణాలుంటాయి. **ఫార్మికా రూఫా:** వాతరోగం ఉన్నవారికి మంచి మందు. కీళ్లు పట్టినట్లు ఉండటం, కదలికలు కష్టంగా ఉండటం, మలబద్ధకం, మలవిసర్జనకు ముందు బొడ్డు చుట్టూ నొప్పి, కండరాలు అలసినట్లు వాటి స్థానం నుంచి




డా. మురళీ అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి


విడిపోయినట్లు అనిపించడం, నీరసం, నొప్పులు లాంటి లక్షణాలు ఉంటాయి. **కాల్మియా:** ఇది రుమాటిక్ సమస్యలకు మంచి మందు, నరాలనొప్పి. శరీరంపై భాగం నుంచి కింది భాగానికి వెళుతుంది, మెడనొప్పి, చేతుల నొప్పులు, నడుంనొప్పి, కుడిభుజం, మోకాళ్ళు, పాదం నొప్పి నీరసం, నొప్పులు వచ్చినట్లు అనిపించడం ఎక్కువగా ఉంటాయి. **ఆర్నికా:** ఇది గాయాలు తగిలిన తర్వాత వచ్చే సమస్యలకు మంచి మందు, శరీరం సున్నితంగా ఉండి సన్నని స్పర్శను తట్టుకోలేరు. **ఆర్సెనికమ్ ఆల్బమ్:** వీరు అధిక ఆందోళన కలిగి విశ్రాంతి లేని, మరణమున్నా, ఒంటరితనం అన్నా భయం, మందులు వాడి ఉపయోగం లేదు అని భావించటం, స్వార్థం, పిరికిగా ఉండటం, పొదుపుగా ఉండటం వంటి లక్షణాలుంటాయి. **లైకోపోడియం:** ఉత్సాహంగా లేకపోవడం, ఒంటరిగా ఉండటానికి భయం, కొత్తపనులు చేయడానికి ఇష్టపడక పోవటం సున్నిత స్వభావం కలిగి ఉండటం లక్షణాలు, కాళ్లు, చేతులు తిమ్మిర్లు, బరువుగా ఉండటం, భుజం, మోచేయి నొప్పి, వాతరోగం, కీళ్ళ దగ్గర రాళ్లు ఏర్పడటం, నడుమునొప్పి కీళ్ల నొప్పి, వాపు, లక్షణాలుంటే వాడదగిన ఔషదం.



# ఆస్తమాకు అద్భుత చికిత్స

ఈ దుమ్ము ధూళి, రసాయనాలు ప్రభావం వల్ల దీర్ఘకాల సమస్యలు వస్తాయి. అందులో ఆస్తమా ఒకటి. ప్రస్తుతం ప్రపంచంలో చాలామందిని వేధిస్తున్న సమస్య. ఆధునిక జీవనశైలి, కాలుష్యం కారణంగా ఎంతోమంది ఈ వ్యాధి బారినపడుతున్నారు. ఈ ఆస్తమాకు ఆయుర్వేదవైద్యమే సరైనపరిష్కారం అని చెబుతున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్‌మనోహర్. బ్రతకడానికి కావలసిన ప్రాణ వాయువును శ్వాసప్రక్రియ ద్వారా ఊపిరితిత్తులు అందిస్తాయి. ప్రతిరోజు మన శ్వాస కోశాలు వివిధ రకమైన వాతావరణపరిస్థితులకు, ఎలర్జెన్స్‌కు, రసాయనా లకు, పొగ, దుమ్ము, ధూళీ మొదలైన వాటికి లోనవు తుంటాయి. వీటివలన వివిధరకాల దీర్ఘకాలిక వ్యాధులు వస్తాయి. వాటిలో ఆస్తమాఒకటి. ముక్కు లోకి, ఊపిరి తిత్తులలోకి లేదా శరీరంలోకి సరిపడని సూక్ష్మ పదార్థాలు గాలి ద్వారా లేదా ఆహారంద్వారా ప్రవేశించి నప్పుడు వాటికి ప్రతిచర్యగా మన శరీరం స్పందించి వివిధ రకాల రసాయనాలను విడుదల చేస్తుంది. వీటి ప్రభావం వలన శ్వాసనాళాలు కుచించుకు పోతాయి. ఊపిరి తీసుకోవడం కష్టమవుతుంది. ఆస్తమా ఉన్నవారిలో తరుచుగా ఆయాసం రావడం, పిల్లకూతలు, దగ్గు, చాతి బరువుగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వీటితోపాటు కొంత మందిలో తరుచుగా తుమ్ములు రావడం, ముక్కు నుంచి నీరు కారడం, తరుచుగా, జలుబు చేయడం వంటి లక్షణాలు కూడా ఉంటాయి. ఆస్తమా రావడానికి గల కారణాలు చాలా ఉన్నప్పటికీ ప్రధానమైనవి. జన్యు సంబంధిత కారణాలు. వాతావరణ పరిస్థితులు, ఇంటి లోపల, బయటా గల వివిధ కాలుష్య కారకాల వలన ఆస్తమా రావచ్చు లేదా పెరగవచ్చు. మనిషి జీవించడానికి కావలసిన శ్వాస ప్రక్రియ శ్వాసకోశాల ద్వారా జరుగు తుంది. ఆక్సిజన్‌ను పీల్చుకోవడం, ఇదోక నిరంతర ప్రక్రియ. ఒక విధంగా ఈ శ్వాసప్రక్రియ మనిషి జీవితాన్ని శాసిస్తుంది అనడంలో ఎలాంటి సందేహం లేదు. ప్రస్తుత జీవన విధానంలో వాతావరణ కాలుష్యం ఎక్కువగా ఉంది. దానికి ముఖ్య కారణం నగరాలు విస్తరించడం. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం 2001నాటికే భారతదేశంలోసుమారు 2.5 కోట్లమంది ఉబ్బసం వ్యాధి తోనూ, 1.5 కోట్ల మంది వివిధరకాల శ్వాసవ్యాధులతో బాధపడుతున్నారని ఒక అంచనా. ఈ దుమ్ము ధూళి, రసాయనాల ప్రభావం వల్ల దీర్ఘకాల సమస్యలు వస్తాయి. అందులో ఆస్తమా ఒకటి. ఈ పదార్థాలు ముక్కుద్వారా, శ్వాస నాళాలు, ఊపిరితిత్తులోకి వెళ్లినప్పుడు,ఒక ప్రతి చర్య జరిగి కొన్ని రసాయనాలు ఉత్పత్తి అవుతాయి. ఆ ప్రభావంవల్ల, శ్వాసనాళాల్లో సున్నితమైన పొరవాపు వస్తుంది. ఎర్రగా అయి శ్లేష్మం ఉత్పన్నం చెంది. కుచించు కుపోతుంది. తర్వాత పిల్లికూతలు, దగ్గు, శ్లేష్మం, ఆయాసం వస్తుంది. దీన్నే శ్వాసవ్యాధిగా పరిగణిస్తాం. కారణాలు: 1.జన్యు పరమైనవి. 2.వాతావరణ కాలుష్యం, ఇంటిలో, బయట వాతావరణంలో కాలుష్యం. 3.ముఖ్యంగా ఇంటిలో డస్ట్‌మైట్స్. ఇవిఎక్కువగా పరుపులు, దిండ్లు, బీరువాలపై ఉంటాయి. 4.పెంపుడు జంతువులు, కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన వాటి వెంట్రుకలు. 5.ఎలుకలు, బొద్దింకలు విసర్జించే రసాయనాలు. 6. జిరాక్స్, ధూమపానం, లెడ్ వంటి కంపెనీలలో పనిచేసే వారికి ఆస్తమా వస్తుంది. ఆయుర్వేదచికిత్సా పద్ధతులు: వాత, కఫ దోషాల ప్రకోపం వలన ఈ శ్వాససంబంధ వ్యాధులు సంభవిస్తాయి. ఆయుర్వేదంలో చికిత్సా పద్ధతులను అవలం భించేప్పుడు వైద్యులు, రోగ బలంను పరిగణనలోకి తీసుకుని చికిత్సా పద్ధతులను అవలంబి స్తుంటారు. ముఖ్యంగా నిధాన పరి వర్జనము, శమన, శోధనచికిత్సాపద్ధతులద్వారా చికిత్సఅందిస్తారు. ఈ శ్వాస సంబంధ వ్యాధులలో రోగ నిరోధక శక్తి పెంచు కోవలసిన అవసరంఉంది అందుకు ఆయుర్వేదంలో ఉత్తమ రసాయ నాలను ఆచార్యులు వివరించారు. వీటితో పాటు శస్య కర్మ, విరేచనకర్మ లాభాదాయకంగా ఉంటుంది. ఈ సమస్య తో బాధపడే రోగులు తేలికపాటి ఆహారం, తేలిక పాటి వ్యాయామం, యోగా, ప్రాణయామం చేయటం ద్వారా ఫలితాలు పొందవచ్చు.


డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద

## నిగారింపునిచ్చే

# ఫ్లవర్ ఫేస్‌ప్యాక్‌లు

**పువ్వులంటే ఇష్టపడని మగువ ఉండదంటే అతిశయోక్తి అవసరమే లేదు. అయితే కేవలం అలంకరణకు , సువాసనకే కాకుండా పువ్వులు శరీర అందాన్ని కూడా రెట్టింపు చేస్తాయి. పువ్వుల్లో ఉండే కొన్ని రకాల నూనెలు. పోషణ అందించే గుణాలు, సువాసనలు శరీర అందాన్ని ద్విగుణీకృతం చేయడానికి దోహదపడతాయి. పువ్వుల్లో దాగున్న ఈ సౌందర్య గుణాల వల్లనే వాటిని రకరకాల క్రీముల్లో ఉపయోగిస్తున్నారు. అంతేకాదండీ పార్లర్స్‌లో కూడా ఫేస్‌ప్యాక్‌ల రూపంలో వీటిని వినియోగిస్తున్నారు. ఈ ఫ్లవర్ ఫేస్‌ప్యాక్‌లు చర్మానికి నిగారింపునివ్వడమే కాదు, చర్మ సౌందర్యాన్ని పెంచుతాయి. మచ్చలు, మొటిమలను నివారిస్తాయి! మరి ఇంట్లోనే ఈ ఫేస్‌ప్యాక్‌లను ఏవిధంగా తయారు చేసుకోవచ్చో మీరూ తెలుసుకోండి!**

### గులాబీపూల ప్యాక్

ప్రేమకు బ్రాండ్ అంబాసిడర్‌గా పనిచేసే గులాబీలు అందం ఆకర్షణతో పాటు ఇన్‌టేకింగ్‌లో కూడా లాభాలనిస్తాయి. గులాబీలు తినడంవల్ల ఎన్నో లాభాలున్నాయట. రోజ్‌వాటర్ మనకు తెలుసు. ఈ గులాబీ నీటిని భారతీయులు రకరకాల బ్యూటీ ప్రోడక్ట్స్‌లో ఎక్కువ ఉపయోగిస్తారు. ఇదే కాదు, బోలెడు ప్రయోజనాలు కలిగించే గులాబీ పూవుల ప్యాక్ చర్మరంధ్రాలను టైట్ చేస్తుంది. గులాబీపువ్వు రెక్కలను పొడిచేసి, పాలు కలిపి పేస్ట్‌లా చేసుకుని ముఖానికి పట్టించాలి. 15 నిమిషాల తర్వాత ముఖం శుభ్రం చేసుకోవాలి. ఈవిధంగా వారానికి ఒక్కసారి చేస్తే మృతకణాలు తొలగిపోతాయి. ఈ ప్యాక్ చర్మానికి మంచి మాయిశ్చరైజర్‌ను అందిస్తుంది.

### లావెండర్ పూలతో

లావెండర్‌పూలు చూడడానికి చాలా ఆకర్షణీయంగా కనబడతాయి. వీటిని ఎక్కువగా అత్తరు తయారీ ఉత్పత్తుల్లో ఉపయోగిస్తారు. ఈ లావెండర్ పూలలో చర్మకాంతిని పెంచే గుణాలుంటాయి. ఈ పూవు చర్మాన్ని సున్నితంగా మార్చడంలో అద్భుతంగా పనిచేస్తుంది. లావెండర్ రెక్కలను కొన్ని నిమిషాలు ఉడికించాలి. తర్వాత ఆ నీటిని ఉడికిన రెక్కలను వేరు చేయాలి. ఈ రెక్కలను ఓట్స్ పౌడర్‌లో మిక్స్‌చేసి మెత్తటి పేస్ట్ చేసుకోవాలి. దీన్నిచర్మానికి పట్టించి ఆరిన తర్వాత శుభ్రం చేసుకోవాలి. ఆనీటిని కూడా అప్పుడప్పుడు ముఖానికి రాసుకోవచ్చు.

### కమలం పూవులతో

కమలం పూవు లక్ష్మీదేవికి చిహ్నంగా భావిస్తారు. అంతేకాదు చాలా ఆకర్షణీయంగా ఉంటుంది లోటస్ ఫ్లవర్. లోటస్ ఫ్లవర్స్‌లో లినోలిక్ యాసిడ్ ఉంటుంది. అంతేకాదు ఇతర మినరల్స్‌కూడా ఉంటాయి. వీటిని స్కిన్ వైటనింగ్ కోసం ఉపయోగిస్తారు. కొన్ని లోటస్ రెక్కలను ఉడికించి వడకట్టాలి. ఆ నీటికి రోజ్‌వాటర్ కలిపి, ఫేస్‌కి అప్లయి చేయాలి. కాసేపటి తర్వాత ముఖం కడుక్కుంటే మెరిసే వర్చస్సు మనసొంతమవుతుంది.

### మందారం పూవులతో

రకరకాల వెరైటీలలో పూసే మందార పువ్వులను జుట్టు పెరగడానికి మంచి కండీషనర్‌గా ఉపయోగిస్తారని అందరికీ తెలుసు. అయితే ఈ 'మందార పువ్వుల ఫేస్‌ప్యాక్' మొటిమలను నివారిస్తాయి. ముందుగా మందారం రెక్కలు, ఉడికించిన బ్రౌన్ రైస్, కొన్ని చుక్కల ఎసెన్షియల్ ఆయిల్‌ను మిశ్రమంగా తయారు చేసుకోవాలి. అలాగే విటమిన్ ఈ లిక్విడ్ కూడా కలుపుకోవచ్చు. అన్నింటినీ మిక్స్‌చేసి పేస్ట్ చేసి ముఖానికి పట్టించి ఆరిన తర్వాత శుభ్రం చేసుకోవాలి.

### మల్లెపూలతో

మల్లెపూలు అంటే చాలా మందికి ఇష్టం. వాటిల్లో ఉండే గుణాలు కొన్ని రకాల సమస్యలను నివారిస్తాయని మనకు తెలిసిన విషయమే. మల్లెపూల ఫేస్‌ప్యాక్ ఎక్కువగా పొడిచర్మం ఉన్నవారికి బాగా ఉపయోగపడుతుంది. కొన్ని మల్లెపూల రెక్కలను ఉడికించి వడగట్టుకోవాలి. వడగట్టిన ఆ నీటికి కొంచెం మీగడ కలిపి ముఖానికి పట్టించాలి. 15 నిమిషాల తర్వాత శుభ్రం చేసుకోవాలి. లేదా మల్లెపూలు, పెరుగు కలిపి మిక్సీపట్టి పేస్ట్‌చేసుకుని ముఖానికి పట్టించినా మెరుగైన ఫలితాలు పొందవచ్చు.

### బంతిపూలతో

సంక్రాంతి వచ్చిందంటే చాలు బంతిపూలు గుర్తొస్తాయి కదా. అయితే ఇటీవలి కాలంలో ఎప్పుడైనా సరే బంతిపూలు దొరుకుతున్నాయి. కొన్ని బంతిపూల రెక్కలను మెత్తటిపేస్ట్‌లా చేసి పాలు, పెరుగు, తురిమిన క్యారెట్ కలిపి ముఖానికి పట్టించాలి. 20 నిమిషాల తర్వాత శుభ్రం చేసుకుంటే చర్మం ప్రకాశవంతంగా మారుతుంది.

### చేమంతి పూలతో

చలికాలంలో ముఖంపై పగుళ్ళు గీతలు కనిపిస్తుంటాయి. ఎన్ని మాయిశ్చరైజర్లు అప్లై చేసినా కొద్ది సేపటికే ఇంకిపోతుంది. ఆ సమయంలో రోజంతా ముఖం మృదువుగా ఉండాలంటే చేమంతి ప్యాక్ వేసుకోండి. రెండు చేమంతి పూలను నీళ్లలో ఉడకపెట్టాలి. ఆ నీటిలో కాస్త తేనె, పాలు పోసి బాగా కలుపుకోవాలి. రోజూ ఉదయం బయటకి వెళ్లేటప్పుడు ఈ మిశ్రమంతో ముఖంపై బాగా మసాజ్ చేసుకొని రెండు నిమిషాల తర్వాత గోరువెచ్చని నీటితో కడుక్కోవాలి. ఇలా చేస్తే రోజంతా ముఖం తాజాగా అందంగా ఉంటుంది.

- నివేదిత



**మంచం పక్కన స్టూలు మీదున్న రాజా మొబైల్ మోగింది.**

**"ఇన్‌స్పెక్టర్ రాజా హియర్' రాజా అన్నాడు. అటువైపున ఎవరో చెప్తున్నది వింటూ మంచం మీంచి దిగాడు. అటూ ఇటూ తిరుగుతూ, ఊకొడుతూ ఉండి పోయాడు. 'వద్దు. నేనే వస్తాను, వీలైనప్పుడు... కంగారుపడకుండా!"**

రాజా మొబైల్‌ని గోడవారగా ఉన్న టేబుల్‌మీదికి విసిరి కొట్టాడు.

'కూల్‌హోమ్ అతనికి డబ్బెవడిమ్మన్నాడు?" నిశిత వైపు తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"నేనే ఇచ్చాను."

"ఎందుకిచ్చావ్?" రాజా గద్దించాడు.

'డైరెక్టుగా చెప్పనా, ఇన్‌డైరెక్టుగా చెప్పనా?"

రాజా గుడ్లురిమి చూశాడు. "ఏం, డైరెక్టుగా చెప్తే కింద పడిపోతాననుకుంటున్నావా?"

"హుఁ! ఇప్పటికే పడిపోయారు కింద! ఇప్పుడు కొత్తగా పడేదేముంది?"

"నిశితా!"

"నా భర్త లంచగొండి కావడం నేను సహించను! అందుకే ఫ్రిడ్జ్ రేటు షాపువాడి మొహాన పారేశాను!"

"అది లంచమని ఎవడన్నాడు?"

"అతనే. ఇన్‌స్పెక్టరుగారు పెద్ద సహాయం చేశారు. దానికి మా సంతోషం ఇలా వ్యక్తం చేసుకుంటున్నాం" అన్నాడు.

రాజా నిశిత కళ్ళల్లోకి ఆగ్రహంతో చూశాడు. ఒక్కొక్క పదాన్నే విడివిడిగా నొక్కుతూ ఇలా అన్నాడు: "అతను-అది-లంచం-అని-నీకు-చెప్పాడా?"

"అక్షరాలు వేరు. అర్థం అదే!" నిశిత కంఠంలో ఎగతాళి పలికింది.

రాజా అతిప్రయత్నం మీద ఆగ్రహాన్నీ, ఆవేశాన్నీ దిగమింగాడు. టేబుల్ మీదున్న గ్లాసులోని నీళ్ళు నెమ్మదిగా తాగాడు. మంచం దగ్గరగా నడిచి, నిశిత ముఖంలోకి తదేకంగా చూశాడు.

"నిశితా, నువ్వు కొన్ని జీవితసత్యాలు తెలుసుకోవాలి. మన జీవితం ఇప్పుడిప్పుడే ప్రారంభమైంది. నేను పోలీసాఫీసర్ని. డ్యూటీ పరంగా ఎవరెవరికో, ఏవేవో సహాయాలు చేయాల్సి ఉంటుంది. సహాయం పొందిన వ్యక్తులు ఏదో ఒకటి ఇస్తూ, తమ కృతజ్ఞతను తెలియజేసుకుంటారు. మన లైఫ్‌లో అదొక రొటీన్. ఏడుకొండల వాడికి మొక్కులు మొక్కే భక్తులు తమ కోరికలు తీరగానే, ఫలితం దక్కగానే తలనీలాలు, తులాభారాలు చేయడం ముడుపుల్ని హుండీలో వేయడం లాంటిదే ఇది కూడా. ఆవేశంలో దానికి లంచం అనే పేరు తగిలించి ఇచ్చిన వ్యక్తినీ, పుచ్చుకున్న వ్యక్తినీ తప్పుపట్టడం అన్యాయం..."

"నువ్వు ఇన్‌స్పెక్టరుగా నీ డ్యూటీ చేస్తున్నావు. అందుకు ప్రజల ధనాన్ని నీకు జీతంగా ఇస్తోంది ప్రభుత్వం. దానికి అదనంగా నువ్వు ఒక్క రూపాయి ఎవరివద్దయినా తీసుకుంటే - అది అక్రమార్జన చేయడానికి యిచ్చిన లంచమే! నీ ఉద్యోగం అక్రమార్జనకు ఇవ్వబడిన లైసెన్స్ అని అనుకోవడం ఘోరం!" నిశిత నిర్భయంగా అంది. "నీ దృష్టిలో అది బహుమానం కావచ్చు. వస్తు రూపంలో, ధనరూపంలో తెలియజేసే ధన్యవాదం కావచ్చు. నా దృష్టిలో అది అక్రమార్జనే. లంచమే! నన్ను మోసం చేయొద్దు; నిన్ను మోసం చేసుకోవద్దు!"

"అది లంచం కాదు, కాదు, కాదు!" రాజా బిగ్గరగా అరిచాడు. "నేనెప్పుడూ నీకు లెక్చర్లివ్వలేదు. పారితోషికాలు, బహుమతులు తీసుకోను అని వాగ్దానం చేయలేదు. నీ మొగుడు స్వచ్ఛంద సేవకుడు కాదు. ఉద్యోగి. ఉద్యోగ జీవితంలో ఇది సర్వసాధారణం. సాధారణమైన దాన్ని అసాధారణంగా, అక్రమంగా ఊహించుకుని, మడి కట్టుకున్నవాణ్ణి సహోద్యోగులు వెలివేస్తారు. అతని సమక్షంలో భయపడతారు. పరోక్షంలో ద్వేషిస్తారు. గడ్డి మేటిలో కుక్కని ఎవ్వడూ భరించడు! ఎప్పుడో, ఎక్కడో, ఎందులోనో ఇరికించి సఫా చేస్తారు. మీ నాన్న సంగతే తీసుకో... ఆయన..."

### జరిగిన కథ

*తన బిడ్డలు నీతినిజాయితీగా బతకాలని ఆశించి కష్టపడి వారిని పెంచి పెద్ద చేస్తుంది నిగమ. కానీ వాళ్ళు అందుకు భిన్నంగా తయారవుతారు. కన్న కొడుకుల దుర్మార్గాలకు వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తుందా కన్నతల్లి. ఫ్లాష్‌బ్యాక్‌లో కెళితే, తన తండ్రిని చంపిన వ్యక్తి కూతుర్ని ప్రేమించి పెళ్ళాడి ఇల్లరికం వెళ్ళడంతోపాటు, ఓ డబ్బున్న మారాజుకు దత్తపుత్రుడై పోతాడు పెద్దకొడుకు. అతని తమ్ముడు కూడా డబ్బున్న విదేశీ యువతిని పెళ్ళాడేందుకు తల్లినే మోసం చేస్తాడు. కన్న కొడుకు చేసిన మోసం తెలిసి దిగ్భ్రాంతికి గురవుతుందా తల్లి. ఆఖరి కొడుకు కూడా అడ్డదారిలో ప్రభుత్వ డాక్టరు ఉద్యోగం సంపాదించాడని తెలిసి నిగమ డీలాపడుతుంది. ఇక ఆమె ఏకైక అల్లుడు కూడా ఇన్‌స్పెక్టర్ గారి ఉద్యోగం చేస్తూ అక్రమ ఆర్జనకు అలవాటు పడతాడు. భర్త అవినీతి కార్యకలాపాల్ని నిగమ కూతురు అసహ్యించు కోవడంతో వారి మధ్య పొరపొచ్చాలు ప్రారంభమవుతాయి. ఆ తర్వాత......*

"డోంట్ టాక్ ఎబౌట్ మై ఫాదర్!" నిశిత అరిచింది.

రాజా చిన్నగా నవ్వాడు. "ఓకే నిశితా! లంచానికీ, కృతజ్ఞతకీ ఉన్న తేడా నీకు తెలియదు! సహాయం చేయడానికో, చేసిందానికో వ్యక్తిని పీడించి గుంజుకుంటే, అది లంచం. సహాయం పొందిన వ్యక్తి కృతజ్ఞతా సూచకంగా ఏదయినా తృణమో, పణమో ఇచ్చుకుంటే, అది 'ధన్యవాదం..'

"దయచేసి లంచం గురించి పాఠాలు చెప్పొద్దు!!" నిశిత ఎగతాళిగా అంది.

"నువ్వు అర్థం చేసుకుని, నేర్చుకునేదాకా

# మదరిండియా 11



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

పాఠం చెప్తూనే ఉంటాను!" రాజా నిర్లక్ష్యంగా అన్నాడు. "నేను నిన్ను పెళ్ళి చేసుకున్నాను. నాకు మీ అమ్మగారు వెండిసామాన్లు ఇచ్చారు. బ్రేస్‌లెట్ ఇచ్చారు. ఉంగరం ఇచ్చారు. అది లంచం అనుకోవాలా? నీకూ మా వాళ్ళు నగలు పెట్టారు. అదీ లంచమేనా?"

"అది లాంఛనం; లంచం కాదు!"

రాజా చిన్నగా నవ్వాడు. "రెండూ ఒక్కటే. లాంఛనం ప్రకృతి, 'లంచం' వికృతి!"

"రాజా..." నిశిత అతన్నే చూస్తూ నెమ్మదిగా పిలిచింది.

రాజా ఏమిటన్నట్టు చూశాడు.

"ఇప్పుడు చూపించిన నీ నిజస్వరూపాన్ని, పెళ్ళికి ముందు నేనెందుకు చూడలేక పోయాను?"

"చూసివుంటే ఏం చేసేదానివి?"

"సమాధానం కావాలా?"

"మీ అమ్మగారిలో ఉన్న ఆదర్శాల ఆవేశం నీలో కూడా ఉంది! కానీ విచిత్రం ఏమిటంటే, మీ అమ్మగారి కూతురిలో ఉన్న ఆదర్శ భావాలు కొడుకులలో లేవు. ఎందుకో తెలుసా? ఆ ఆదర్శాలు కడుపు నింపవు.."

"మా పెద్దన్నయ్య, రెండో అన్నయ్య గురించేగా నువ్వు విమర్శిస్తోంది? అమ్మ వాళ్ళని దూరంగా ఉంచింది. నీకు తెలుసా?"

"నేను నా చెల్లెలి మొగుడి గురించి కూడా మాట్లాడుతున్నాను!" రాజా వెటకారంగా అన్నాడు.

"సంకేత్ మీద నిందవేసి దాని వెనుక దాక్కునే ప్రయత్నం చేయొద్దు! వాడి గురించి నాకు తెలుసు!"

"హుఁ ఏం తెలుసు? గవర్నమెంటు హాస్పిటల్‌కి సప్లై అయ్యే సర్జికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ అమ్ముకుంటున్నాడని తెలుసా? కుక్కకాటు మందు ప్రయివేట్ డాక్టర్లకు అమ్ముకుంటున్నాడని తెలుసా? దొంగ సర్టిఫికెట్లు అమ్ముకుంటున్నాడని తెలుసా?" రాజా నవ్వుతూ అన్నాడు.

నిశిత నిర్ఘాంతపోయి చూస్తూ ఉండిపోయింది.

రాజా చిన్నగా నవ్వాడు. "మాట్లాడు! ఫోన్ తీసుకుని మీ అన్నయ్యకు నీతులూ ఆదర్శాలూ ఉపదేశించు!"

నిశిత రాజా ముఖంలోకి నిదానించి చూసింది. "సంకేత్‌కు నీతులు ఉప

దేశించాల్సింది నీ భార్య కాదు; వాడి భార్య! ఆదర్శాలు ఉపదేశించాల్సింది వాడి చెల్లెలు కాదు, నీ చెల్లెలు! వాడి భార్య అయిన నీ చెల్లెల్ని హెచ్చరించు!"

రాజా వెటకారంగా నవ్వాడు. "నీకో సంగతి తెలుసా? ఆదర్శాలు ఎవరు వల్లించినా వినే స్థితిలో నీ అన్నలు లేరు. ఆదర్శ వృక్షానికి దిగిన అవినీతి ఊడలవి! సంకేత్ ముక్కుసూటిగా గవర్నమెంటు డాక్టరుగిరీ సంపాదించాడనుకుంటున్నావా? అవినీతి, ఆశ్రిత పక్షపాతం తనని అందలం ఎక్కించాయి. మీ అమ్మగారికి కూడా తెలిసిపోయింది..."

"నాన్‌సెన్స్!" నిశిత అరిచింది. "నేను నమ్మను!"

"నీ ఇష్టం! రాజా నవ్వుతూ అన్నాడు. మీ అమ్మ సంకేత్‌కి నీతులు చెప్పే ప్రయత్నం చేసింది. నా చెల్లెలు ఆమె కళ్ళు తెరిపించింది. ఇవాళా రేపూ రికమండేషన్లూ, లంచాలూ లేకుంటే ఉద్యోగాలు రావు. మడికట్టుకున్న వ్యక్తి... ఏమవుతాడో మీ కుటుంబానికి స్వానుభవమే!"

"రాజా...!"

"ఎదుగు! లోకాన్ని చదువు!"

"లోకాన్ని చదివి, అన్యాయాలూ, అక్రమాలూ మనిషికి సహజమైన లక్షణాలనీ, వాటిని ఆధారం చేసుకున్నవాడే బతుకుతాడనీ అర్థం చేసుకొమ్మంటావా? ఎంత మారిపోయావు రాజా!"

"మారకపోతే మరణం తప్పదు!" అంటూ రాజా బెడ్‌రూంలోంచీ వెళ్ళిపోయాడు. తలుపు భళ్ళున మూసుకుంది. 'మారకపోతే మరణం తప్పదు!' అంటూ భర్త పరోక్షంగా తన తండ్రిని గుర్తు చేశాడని నిశిత గ్రహించింది.

●●●

గొడవ జరిగిన నాటి నుండీ వారం రోజులు రాజా ముభావంగా ఉండిపోయాడు. ముక్తసరిగా మాట్లాడి, వెళ్ళిపోతున్నాడు. ఏది వడ్డిస్తే అది రుచిగా ఉందని గానీ, రుచిగా లేదనిగానీ అనకుండా, తినేసి వెళ్ళిపోతున్నాడు. ప్రతీరోజూ నైట్ డ్యూటీ ఉందంటూ వెళ్ళిపోతున్నాడు..

వారం రోజుల తరువాత 'నైట్‌డ్యూటీ'కి వెళ్ళకుండా, బెడ్‌రూంలోకి వచ్చాడు. మంచం మీద పడుకున్న నిశిత దగ్గరగా కూచున్నాడు. అతని చెయ్యి నిశిత భుజం మీద వాలింది. "నిశితా!"

నిశిత అతనివైపు తిరిగి, ప్రశ్నార్థకంగా చూసింది.

"అయామ్ సారీ, నిశితా! న్యాయంగా ఉద్యోగం చేసుకోమన్నందుకు అడ్డంగా వాదించాను. తిరగబడ్డాను. విమర్శించాను. నువ్వు చెప్పిందంతా నా మంచికోసమే అని మెల్లగా అర్థమైంది..."

"నిజంగా?" నిశిత ఆశ్చర్యంగా అంది.

"ఇవాళ... తెలిసొచ్చింది. నాలాగే నిర్లక్ష్యంగా వ్యవహరించిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఏసీబీకి అడ్డంగా దొరికిపోయాడు. ఇప్పుడు జైల్లో ఉన్నాడు. ఆ ప్రమాదం నాకూ జరగవచ్చు అనే ఆలోచన, నన్ను కుదిపేసింది. ఇకనుంచీ జీతం తప్ప అదనంగా ఒక్క రూపాయి కూడా ముట్టను.."

"రాజా... నిజంగా?!"

"నా ముఖంలోకి చూడు. నా కళ్ళల్లోకి చూడు, నిశితా! చూసి, నీ రాజా అబద్ధమాడుతున్నాడేమో చెప్పు!"

నిశిత వెంటనే పైకి లేచింది. రాజా చేతులు ఆమె చుట్టూ అల్లుకున్నాయి.

"సంకేత్ గురించి చెప్పకుండా ఉండాల్సింది. ఆవేశంలో అనేశాను. నిజమే అయినా అది సంకేత్ వ్యక్తిగతం. స్వర్గస్థులైన మీ నాన్నగారి గురించి అనవసరంగా నోరు పారేసుకున్నాను. అయాం రియల్లీ సారీ.. అదంతా మరిచిపో నిశితా, మరిచిపోతావా?"

"మరిచిపోతాను. నువ్వు మారిపోయావుగా! అన్నీ మరిచిపోతాను; నన్నూ మరిచిపోతాను!" నిశిత ఆవేశంగా అంది. ఆమె చేతులు రాజా మెడ చుట్టూ తీగల్లా అల్లుకున్నాయి.

●●●

అంతే...

రాజా ఆ తరువాత నగలు తెచ్చి ఇవ్వలేదు. నగదు తెచ్చి ఇచ్చి దాచమనలేదు. ముందు సరాసరి ఇంటికే డోర్ డెలివరీగా వచ్చినట్టు గిఫ్టులు రావడం మానేశాయి. రాజాలో మార్పు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది నిశితకు.

రాజా ఆవేశంలో అన్నట్టు సంకేత్ అక్రమార్జనకు రుచి మరిగాడా? ఆ విషయం అమ్మకు కూడా తెలుసన్నాడు రాజా. కవిత అమ్మతో వాదించిందనీ అన్నాడు. నిజమే అయితే, సంకేత్ గురించిన తన సందేహాన్ని తీర్చగలిగిన వ్యక్తి ఒక్కరే. అమ్మ! అయితే అమ్మనడిగి, ఆమె మనసును కెలికే ధైర్యం తనకు లేదు!

రాజా మారానన్నాడు. మార్పు కనిపిస్తోంది. ఆ మార్పు శాశ్వతమేనా అన్న సందేహం ఒక్కోసారి తనను కొరుక్కు తింటోంది. కాకులు తమ మధ్య ఒక చిలుకను బతకనిస్తాయా, కాకిగా మార్చేస్తాయా! తన సందేహాన్ని తీర్చగలిగిన వాళ్ళు లేరు! సంకేత్ విషయంలో మనకు నిజం రూఢి కావాలి. రాజా మార్పు విషయంలో సందేహం తీరిపోవాలి! అసత్యాన్ని చూపే శక్తీ, నిజం నిగ్గు తేల్చే శక్తీ ఒకటుంది. అది కాలం! నిశిత వంటి కాలానికే ఆ భారం వదిలేసి, తేలిగ్గా నిట్టూర్చింది.

●●●

నిశితలో కాపురం చేస్తున్న మొదటి సందేహానికి అనుకున్న దానికన్నా తొందరగానే కాలం సమాధానం చెప్పింది. హైదరాబాదు నుండీ రెండో శనివారం అత్తయ్య వచ్చింది. తల్లీ కొడుకులు డిపార్ట్‌మెంట్ జీపులో తిరుమలకు వెళ్ళి, రాత్రికి తిరిగి వచ్చారు. ఆదివారం అందరూ శ్రీనివాస మంగాపురం వెళ్ళొచ్చారు.

సోమవారం ఉదయం అత్తయ్య తిరుచానూరు వెళ్ళాలంది. రాజా ఆమెను తీసుకుని, తిరుచానూరు వెళ్ళాడు. వచ్చిన ప్రతీసారీ, రెండు రాత్రులూ అత్తయ్య రెండో బెడ్‌రూంలో పడుకుంటుంది. సెకండ్ బెడ్‌రూంలో బెడ్‌స్ప్రెడ్ మార్చడానికి



## ఎంగేజ్‌మెంట్ చేసెయ్యకండి

ఇది సోనాక్షి సిన్హా ఆవేదన! ఇటీవల సోనాక్షి పెళ్ళికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చిందనీ, త్వరలోనే ఎంగేజ్‌మెంట్ కూడా జరగబోతోందన్న వార్తలు జోరుగా వినిపించాయి. వీటి మీద సోనాక్షి పై విధంగా స్పందించింది. పెళ్ళి, ఎంగేజ్‌మెంట్ వాటి మీద దయచేసి ఊహాగానాలు ఆపేయండి అంటూ ట్వీట్ చేసింది. తనకు పెళ్ళి ఆలోచనే లేదు, చేసుకోవాలనుకున్నప్పుడు అందరికీ చెప్పే చేసుకుంటాను. అదంతా నా పేరెంట్స్ చూసుకుంటారు. అంతే తప్ప మీకు మీరుగా నా ఎంగేజ్‌మెంట్ డేట్ ఫిక్స్ చేసెయ్యడం, పెళ్ళి డేట్ అనౌన్స్ చేయడం వంటివి చేయకండి అంటూ గాసిప్పు రాయుళ్ళకు గట్టిగా చురకలు అంటించింది.

# వాళ్ళిద్దరూ నాటకం ఆడుతున్నారట!

*రణబీర్, కత్రినాల ప్రేమ వ్యవహారం ముగిసింది, ఇద్దరూ ఇక జన్మలో కలుసుకోరు అని అనుకున్న వారికి ఓ షాకింగ్ న్యూస్ తెలిసిందట! రణబీర్ నుంచి విడిపోయిన తరువాత ఇద్దరూ కలిసి ఉన్న ఇంటిని కత్రినా ఖాళీ చేసేసి కొత్త ఇంటికి మారింది. ఈ సందర్భంగా బాగా ముఖ్యమనుకున్న వారిని పిలిచి పార్టీ ఇచ్చిందట! ఇక్కడే జరిగింది ఓ సంఘటన. పార్టీకి వచ్చిన కొద్దిమంది అతిథులు వెళ్ళిపోగా ఒక్కరే మిగిలారట! ఆ ఒక్క గెస్ట్ కూడా వెళ్ళిపోబోతుండగా, రణబీర్ పిల్లిలా ఇంట్లోకి వచ్చాడట! రణబీర్‌ని చూసి ఆ గెస్ట్ ఖంగుతినగా, కత్రినా మాత్రం రణబీర్ వస్తున్న విషయం తనకు ముందుగా తెలుసు అన్నట్టు ప్రవర్తించిందట! దాంతో వీరిద్దరూ నిజంగా విడిపోలేదనీ, విడిపోయినట్టు నాటకం ఆడుతున్నారనీ బాలీవుడ్ జనాలు గుసగుసలాడుతున్నారు.*



వెళ్ళింది నిశిత. బెడ్‌స్ప్రెడ్‌ను లాగి, కిందపడేసింది. ఉతికిన దాన్ని మంచం మీద సర్దింది. తలగడల కవర్లనూ మార్చింది. నేల మీద పడవేసిన బెడ్‌స్ప్రెడ్‌నీ, తలగడ కవర్లనూ అందుకోడానికి కిందికి వంగింది నిశిత. మెరుస్తున్న వస్తువు ఏదో ఆమె దృష్టిని ఆకర్షించింది. బ్రీఫ్‌కేస్ మూతలో ఇరుక్కున్న గొలుసు మెరుపు అది. ఆ బ్రీఫ్‌కేసు నిశితలో ఆశ్చర్యం నింపింది. ఈ మధ్య ఎప్పుడూ అది మంచం కింద లేదు. నిశిత చెయ్యిచాపి, బ్రీఫ్‌కేసును ఇవతలికి లాగింది. మూతలోంచీ బంగారం గొలుసు భాగం వేళ్ళాడుతోంది. ఆశ్చర్యపోతూ నిశిత బ్రీఫ్‌కేసు మంచం మీద పెట్టింది. ఆ గొలుసు భాగం తనకి గుర్తుంది. ఆలోచిస్తూ బ్రీఫ్‌కేస్ బాక్స్‌ని వేళ్ళతో నొక్కింది. ఆమెను ఇంకా ఆశ్చర్యపరుస్తూ లాక్స్ తెరుచుకున్నాయి.

నిశిత చేతులు మూతని పైకి లేపాయి. ఆమె గుండె ఒక్కసారి లయ తప్పి, దడదడ కొట్టుకోవడం ప్రారంభించింది. బ్రీఫ్‌కేస్ నిండుగా నోట్ల కట్టలు. వెయ్యి రూపాయల నోట్ల కట్టలు! నోట్ల కట్టల మీద రాజా స్వహస్తాలతో తన మెడలో వేసిన డైమండ్ నెక్లెస్...

●●●

ఆందోళననూ, ఆవేశాన్నీ అణగదొక్కి మెల్లగా ఆలోచనల్ని మేలుకొలిపింది నిశిత. నోట్ల కట్టలున్న బ్రీఫ్‌కేస్, అత్తయ్య రెండు నెలలకోసారి పడుకునే మంచం కింద ఎందుకుంది? బ్రీఫ్‌కేసులో నోట్ల కట్టలు ఎక్కణ్ణించీ వచ్చాయి? ఎవరు తెచ్చారు?

నోట్ల కట్టల మీద నెక్లెస్ ఎవరు పెట్టారో తనకు తెలుసు. నెక్లెస్ పెట్టిన చేతులే నోట్ల కట్టల్ని సర్ది ఉంటాయి. సర్దిన చేతులే సంపాదించి ఉంటాయి. తన భర్త చేసే వృత్తి అంత పెద్ద మొత్తంలో డబ్బుని చూసే వృత్తికాదు. రాజాది నెలసరి జీతం వృత్తి! సంపాదన, జీతంతో సరితూగి ఉంటే, నెలకొకసారి అది సక్రమార్జన. అధికంగా ఉంటే, అది అక్రమార్జన! రాజా మారిపోయాడా అన్న తన మొదటి సందేహానికి కాలం తొందరగానే సమాధానం చెప్పింది!

అత్తగారు పడుకునే మంచం కింద ఎందుకుందో కూడా అర్థమవుతోంది. ఆ అర్థం కావడం కొద్దిగా అనుమానంగానే ఉంది. అత్తగారితోబాటు బ్రీఫ్‌కేస్ ట్రెయినెక్కితే తన అనుమానం నిజమే... ఆ అనుమానం తీరడానికి తను సాయంత్రం దాకా వేచి చూడాలి.

సాయంత్రం అయ్యింది.

"నిశితా, సాయంత్రం రాలేను. ఎస్పీగారొస్తున్నారు. అమ్మను ట్రైన్ ఎక్కించు. వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్" బైటికెళ్తూ అన్నాడు రాజా.

"అలాగే" అంది నిశిత.

వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ కదిలింది. అత్తయ్య వెళ్ళిపోయింది. అత్తయ్యతో బాటు బ్రీఫ్‌కేసు వెళ్ళిపోయింది! తిరుచానూరు నుంచి వచ్చాక, బ్రీఫ్‌కేస్ తాళం సరిగా వేయలేదని అత్తయ్య గుర్తించి ఉంటుంది. ఎవ్వరికీ అనుమానం రాకుండా ఉండటానికి నిశిత బ్రీఫ్‌కేసును మంచం కింద, యథాస్థానంలో ఉంచేసింది. ఏమీ ఎరగనట్టు ఉండిపోయింది.

సందేహాలన్నీ పటాపంచలై పోయాయి. అత్తయ్య ప్రతినెలా రెండవ శనివారం తిరుపతి రావటానికి కారణం ఏడుకొండల వాడి మీద భక్తి కాదు. శనివారం ఆయనకి ఇష్టమైన దినం అనీ కాదు. నెలనెలా ఆ ఏడు కొండలవాడి దయతో కొడుకు సంపాదించే సొమ్మును క్షేమంగా ఇంటికి చేరవేసే కొరియర్ అత్తయ్య. తన నుండీ ప్రోత్సాహం ఉండదని గ్రహించిన రాజా, డబ్బుని అమ్మ హవాలా ద్వారా ఇంటికి చేరవేస్తున్నాడు! తనకి అర్థమైపోయింది. రాజా మారలేదు. రాజా మారడు. ప్రతీనెలా అత్తయ్య బ్రీఫ్‌కేస్ ఎందుకు తీసుకెళ్తోందో ఇప్పుడు అర్థమవుతోంది.

●●●

"రాజా, నా డైమండ్ నెక్లెస్ తీశావా? బీరువాలో లేదు.." ఆ రాత్రి బెడ్‌రూంలోకి వచ్చిన భర్తను అడిగింది నిశిత.

"తీశాను. అమ్మకు ఇచ్చి పంపించేశాను. అది నేను అక్రమంగా ఆర్జించానని నీలో అనుమానం ఉంది. అది నాకు తెలుసు. దానిని చూసిన ప్రతీసారీ నన్ను నువ్వు అనుమానిస్తావు. ఆ నెక్లెస్ నీకు ఆనందాన్నివ్వదు. అనుమానాన్నిస్తుంది! అందుకే జాగర్తగా ఉంచమని అమ్మ చేతికి ఇచ్చాను" రాజా తడుముకోకుండా అన్నాడు.

నిశిత మాట్లాడకుండా చూసింది.

"పొరపాటు చేశాననుకుంటున్నావా" రాజా అడిగాడు.

"మంచి పని చేశావ్!" నిశిత క్లుప్తంగా అంది.

●●●

తన భర్త లంచగొండి అయిపోయాడనీ, క్రమం తప్పకుండా నెలవారీ కలెక్షన్స్ అందుతున్నాయనీ, రాజా పతనం వైపు పయనం చేస్తున్నాడనీ చెప్పి, అమ్మ ఒడిలో తలపెట్టుకుని ఏడవాలనిపిస్తోంది నిశితకు. అయితే అమ్మకు చెప్పే శక్తి తనకు లేదు. అల్లుడి నిర్వాకం గురించి వింటే అమ్మ గుండెలవిసిపోతాయి. రాజా స్వార్థం తన సమస్య. భవిష్యత్తులో రాజా నిర్వాకం గురించి అమ్మకు తెలుస్తుంది. తప్పదు! అయితే అది తన ద్వారా తెలీదు. ఆ బరువుని అమ్మ గుండెల మీదికి తను చేతులారా ఎత్తదు. అమ్మకు తెలిసి, తనను అడిగితే, ఏదీ దాచదు!

ప్రస్తుతం తన కర్తవ్యం ఏమిటి? కళ్ళున్న కబోదిలా చూడనట్టు ఉండిపోవాలా? రాజా చేస్తున్న దుర్మార్గం క్షంతవ్యం కాదు! లంచాన్ని లంచంగా భావించి, బాధించి గుంజుకునే అలవాటుపడిపోయిన లంచగొండికన్నా తన భర్త నీచుడు! లంచాన్ని లాంఛనం అనే అహంకారి నిస్సందేహంగా నీచుడే! హత్య చేసే వ్యక్తి దుర్మార్గుడు, కర్కోటకుడు. తాను చేసే హత్య 'హతుడికి విముక్తి' అని భావిస్తూ, వాదిస్తూ హత్య చేసే రాక్షసుడిని ఏమనాలి? ఆ రాక్షసుడు క్షంతవ్యుడు కాడు. తన భర్త కూడా

క్షంతవ్యుడు కాదు! శిక్ష అనుభవించాలి! శిక్షించాలి! ఆ శిక్షించే శక్తి ఏది? శిక్షించే వ్యక్తి ఎవరు? రాజా చేసిన, చేస్తున్న, చేయబోతున్న పాపాలన్నింటికీ అతని అర్ధాంగిగా తను సమాధానం చెప్పాలి. సమాధానం చెప్పాల్సింది లోకానికి కాదు; తనకే!

తనే స్వహస్తాలతో తన భర్త కేస్ హిస్టరీని తయారు చేస్తుంది! స్త్రీ రూపం ధరించిన చిత్రగుప్తుడి లాగా తానే తన భర్తకు శిక్ష విధిస్తుంది. ఆ శిక్ష అతనికే కాదు; తనకు కూడా! అతని భార్యగా తనకూ శిక్ష తప్పదు. అతనికి డైరెక్ట్ పనిష్‌మెంట్. అది తనకు ఇన్‌డైరెక్ట్ పనిష్‌మెంట్! ఆడది అయిన తనకు ఆ శిక్ష ఎక్కువ నష్టం కలిగిస్తుంది. ఎక్కువ కష్టాన్ని అందిస్తుంది. అయినాసరే, తన నిర్ణయం మారదు. తను రాజాకు శిక్ష విధిస్తుంది. ఆ శిక్ష ఏమిటో ఎవరికీ తెలీదు. అమలుజరిపే తనకు తప్ప ఆ శిక్ష గురించి ఎవ్వరికీ తెలీదు. చివరికి అనుభవించే రాజాకు కూడా!

●●●

అమ్మ గురించిన ఆలోచనలు నిశితను నిత్యక్షోభకు గురి చేస్తున్నాయి. అమ్మ ఏకాంత్ సంపాదన కలుషితమని గ్రహించింది. పైసా తీసు




కోవడం లేదు. సాకేత్ అమ్మను మోసం చేశాడు; అవమానించాడు. సాకేత్ ఇచ్చే సొమ్ము ఆమెకు విషతుల్యం. తీసుకోనంది. రాజా చెప్పింది నిజమే అయితే అమ్మ, సంకేత్ ఇచ్చే నెలసరి ఖర్చు సొమ్మును కచ్చితంగా తీసుకోదు! తనకు తెలుసు.

భర్త తనకు ఇచ్చేదాన్లోంచీ అప్పుడప్పుడూ అమ్మకు ఎంతోకొంత ఇవ్వాలని తనకు అనిపించింది. అమ్మ తీసుకోదు. అల్లుడి ఆర్జనమీద బతకడం అన్యాయం అంటుంది. ఇప్పుడిక తను రాజా అక్రమార్జనతో అమ్మకు సహాయం చేయదు. అమ్మకు కొన్ని నియమాలున్నాయి. అమ్మ పాటించే కొన్ని ధర్మాలున్నాయి. ఆకలి తీరడానికో, అవసరాలు తీరడానికో అమ్మ నియమాలకు భంగం కలిగించే శక్తి తనకు లేదు; ఇష్టమూ లేదు!

ముఖ్యంగా, అమ్మ రెండు నియమాలను రాజీ లేకుండా పాటిస్తుంది. ఒకటి: అన్నశుద్ధి. రెండు: వస్త్ర శుద్ధి. తినే ఆహారాన్నీ, ధరించే వస్త్రాలనూ శుద్ధంగా అంటే శుభ్రంగా ఉంచుకోవడం కాదు. న్యాయంగా, ధర్మంగా, శ్రమకు తగిన పారితోషికం రూపంలో లభించిన డబ్బుతో సమకూర్చుకునే అన్నంలో అన్నశుద్ధీ, ధర్మార్జనతో సమకూర్చుకునే వస్త్రాలతో వస్త్రశుద్ధీ ఉంటాయంటుంది అమ్మ. ఎవరి చెమట వారికి వస్త్రంగా మారాలి. ఎవరి చెమట వారికి అన్నంగా మారాలి!

తన భర్త రాజా సంపాదిస్తున్న కలుషిత ధనంతో అమ్మకు సహాయం చేయడం అటుంచి, తాను అన్నశుద్ధినీ, వస్త్రశుద్ధినీ పాటించడం ఎలాగన్నదే నిశిత ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్య. అమ్మ గురించిన ఆలోచన సమస్య కాదు. తనను తాను ధర్మబద్ధంగా ఎలా పోషించుకోవాలో అమ్మకు తెలుసు! తాము పెద్దవాళ్ళయ్యాక ఆపించిన ట్యూషన్లు మళ్ళీ ప్రారంభించి ఉంటుంది!

తాను కూడా ఏదయినా స్వయం ఉపాధి వెతుక్కోవాలి. భర్త అక్రమార్జనతో అన్నవస్త్రాలు సమకూర్చుకోకూడదు. తన మీద ఒక గురుతర బాధ్యత ఉంది. ఆ బాధ్యత తీరేదాకా తను బైటపడకుండా, యథాప్రకారం జీవితం గడపాలి. భార్యగా తన ధర్మాలు నెరవేర్చాలి. భర్తపట్ల తనలో వేళ్ళూనిన వ్యతిరేక భారాన్ని తనలోనే దాచుకోవాలి. రాజా మారిపోయినట్టు నాటకం ఆడుతున్నట్టే, తాను అతన్ని నమ్ముతున్నట్టు నాటకం ఆడాలి. ప్రయత్నించి అతనికి మానసికంగా దూరంగా ఉండొచ్చు. పైకి కనిపించనివ్వకుండా మానసికంగా దూరం పాటించవచ్చు. శారీరకంగా? శారీరకంగా రాజాకు దూరంగా ఉండాలా? సమాధానం లేని ప్రశ్న నిశిత మెదడులో తేలుకొండెలా వేస్తోంది.

●●●

ఆఫీసులో కూచుని ఏదో ఫైల్ పరిశీలిస్తున్నాడు సాకేత్. టేబుల్ మీద మొబైల్ చిన్నగా చప్పుడు చేసింది. సాకేత్ మొబైల్ అందుకున్నాడు. క్రేమర్.

"యస్, అంకుల్?"

"సాకేత్... షెరటాన్. రూం టూటూటూ. టెన్ మినిట్స్‌లో ఇక్కడ ఉండాలి.."

"టెన్ మినిట్స్?... అంకుల్, రష్ అవర్... ట్రాఫిక్..."

"నేను చెప్పింది నువ్వు విన్నావు. టెన్‌మినిట్స్!" క్రేమర్ ఆర్డరిస్తున్నట్టు చెప్పి కనెక్షన్ కట్ చేశాడు.

హోటల్ షెరటాన్... ఏదో చాలా ముఖ్యమైన పని అయి ఉంటుంది.

నిజం చెప్పుకోవాలంటే ముఖ్యమైన 'పని' కాదు; ముఖ్యమైన 'వ్యవహారం!' క్రేమర్ ఎప్పుడూ పది నిమిషాలే అంటాడు. ఇరవై నిమిషాలైనా పదే అనుకుంటాడు. సాకేత్ కుర్చీలోంచి లేచాడు.

●●●

హోటల్ షెరటాన్. గది టూటూటూలో అడుగుపెట్టి, తలుపు దగ్గరే ఆగాడు సాకేత్ క్రేమర్ భారీ విగ్రహం ముందు రెండు సోఫాల్లో రెండు భారీ విగ్రహాలున్నాయి.

"కమాన్, సాకేత్!" చేతిలో ఉన్న విస్కీగ్లాసు కింద పెడుతూ అన్నాడు క్రేమర్. అతనితో పాటు విస్కీ చప్పరిస్తున్న ఇద్దరూ గ్లాసుల్ని టీపాయ్ మీద పెట్టారు.

సాకేత్ వాళ్ళ దగ్గరగా వెళ్ళాడు.

"సాకేత్, దిసీజ్ జాన్ విక్టర్ ఫ్రమ్ వాషింగ్‌టన్ డి.సి. మై ఇంటిమేట్ ఫ్రెండ్ అండ్ అమెరికాస్ గ్రేట్ ఇండస్ట్రియలిస్ట్!"

జాన్‌విక్టర్ లేచి నిలుచున్నాడు. ఇండియాలో లావుపాటి భారీ మనిషిని తాను ఇంతవరకూ చూడలేదనుకున్నాడు సాకేత్. ఎర్రగా కందిపోయిన ట్టున్న వెడల్పాటి ముఖం. నీలం రంగు కళ్ళు. పొట్టిగా కత్తిరించిన క్రాపు... విక్టర్ చెయ్యి చిన్న కొండచిలువలా సాకేత్ వైపు సాగింది.

"నైస్ మీటింగ్ యూ మిస్టర్ సాకేత్!" విక్టర్ నవ్వుతూ అన్నాడు. విక్టర్ అరచెయ్యి రబ్బరులా ఉంది.

"మై ప్లెజర్ సర్!" సాకేత్ వినయంగా అన్నాడు.

"సాకేత్ మీట్ మై అనదర్ ఫ్రెండ్ ఆల్బర్టో ఫ్రమ్ ఇటలీ! ఆల్బర్టో ఈజ్ వన్ ఆఫ్ ద బిగ్గెస్ట్ గ్లోబల్ కాంట్రాక్టర్స్..."

"మిస్టర్ ఆల్బర్టో... గ్లాడ్ టు మీట్ యూ" సాకేత్ అన్నాడు. ఆల్బర్టో సాకేత్ చేతిని పట్టుకుని వదిలేశాడు. "క్రేమర్, యుగాట్ హ్యాండ్‌సమ్ సనిన్లా!" అన్నాడు.

ఆల్బర్టో, విక్టర్‌లాగే భారీమనిషి. వెడల్పాటి మొహం. చెవుల్ని తాకుతున్న క్రాపు. గోధుమ రంగు కళ్ళు, మరీ చిన్నగా ఉన్నాయి. వెడల్పుగా పైపెదవిని కప్పేసిన మీసాలు.

క్రేమర్ సోఫాలోంచి లేచాడు. "కూచో, సాకేత్..." అంటూ కుర్చీమీద పడున్న టీవీ రిమోట్ అందుకున్నాడు. మ్యూజిక్ ఛానల్ ఆన్‌చేసి, వాల్యూం కొద్దిగా పెంచి, తన సోఫాలో కూచున్నాడు. సాకేత్ వైపు చిరునవ్వుతో చూశాడు.

"సాకేత్, నా మిత్రులు జాన్ విక్టర్, ఆల్బర్టో ఇద్దరూ ఒక మెగా బిజినెస్ డీల్ మీద వచ్చారు. వాళ్ళకు మన సహకారం కావాలి..."

"మన సహాయమా?"

"యా! మల్టీక్రోర్ వెంచర్! ఇండియన్ కరెన్సీలో కొన్ని లక్షల కోట్ల రూపాయల వెంచర్! అది నన్నూ నిన్నూ టాప్ లెవెల్‌కి తీసుకెళ్ళి పోతుంది. అందులో మనం ఇన్‌వాల్వ్ కావాలని నిశ్చయించాను..."

"అలాగా...'

"ఇందులో మనవాళ్ళకి నా సహాయం కన్నా నీ సహాయం ముఖ్యం. ఎందుకంటే వాళ్ళు అనుకుంటున్న మెగా వెంచర్ కార్యస్థానం నీ ఆంధ్రప్రదేశ్".

**(ఇంకా వుంది)**

# పెళ్ళికి ముందే...

## -అవధానుల సుధాకరరావు



**కార్తీకమాసం...**
**ఇంకా పూర్తిగా చీకట్లు తొలగిపోని వేకువ సమయం.**
**వాసుదేవరావు జోరుగా, హుషారుగా స్కూటర్ నడుపుతున్నాడు.**
**చలిగాలి ఈడ్చికొడుతోంది. సన్నటి వర్షంలా మంచు కురుస్తోంది.**
**"అశోకుడు చెట్లు నాటించెను. మా ఆంజనేయశర్మగారు అడుగడుక్కీ స్పీడుబ్రేకర్లు వేయించెను. ఎంతైనా ధర్మాత్ముడండీ పాపం" అన్నాడు.**

"అవునా సార్.." అంది వెనకాల కూర్చున్న భానుమతి తుంటరిగా చెవికొరికి. 'వెనకసీటుని పెళ్లాం పావనం చేసినప్పుడు ఆయన్ని పుణ్యాత్ముడనీ, ఆఫీసుకి వెళ్లే సమయంలో 'ఓరి పాపాత్ముడా' అనీ కసిగా తిట్టుకోవడమేనా? న్యాయం ఉండాలి సార్" అంది ఆటపట్టిస్తూ. బండి నడుపుతున్నప్పుడు అతని జుత్తు గాలికి ఎగరడాన్ని చాలా ముచ్చటగా చూస్తోంది భానుమతి. నడివయసులోకి ప్రవేశించినా, ఇంకా కాలేజీ కుర్రాడిలాగే ఉంటుంది అతని తీరు, జోరు. పెళ్లిచూపులకి వచ్చినప్పుడు ఎలా ఉన్నాడో, ఇప్పుడూ అదే పర్సనాలిటీ. హాఫ్ కేజీ కూడా వెయిట్ పెరగలేదు. తొలి యవ్వన ఛాయలు మాసిపోలేదు. ఏదో కూనిరాగం తీస్తుంటే, "కాస్త గట్టిగా అనండి సార్! శ్రోతలు కోరిన పాటలకి నేను పిచ్చి అభిమానిని" అంటూ మరింత గట్టిగా హత్తుకుని కూర్చుంది. వాసుదేవరావు ఉత్తేజం మరింత ఎక్కువైంది. మెత్తని ఆమె స్తనాల స్పర్శకి మత్తెక్కిపోతూ "రంగులలో కలవో.. ఎద పొంగులలో కళవో..." అంటూ రాగం తీశాడు.

"రోజురోజుకి నువ్వు.." వీపు మీద గిచ్చింది.

"అవునా? థాంక్స్ ఫర్ ద కాంప్లిమెంట్. పాపం.. మా కృష్ణమూర్తి ఎంత దురదృష్టవంతుడో"

"ఎవడా కృష్ణుడు, వాడికి ఏం మాయరోగమట?"

"డ్రైవింగ్ రాదు పాపం" "రాకపోతే?"

"స్పీడ్‌బ్రేకర్ల గిలిగింతల తుళ్ళింతలకి నోచుకోలేక పోతున్నానని రోజూ బోరుమని ఒకటే ఏడుపు పాపం" వాళ్ళ కబుర్లు అలా సాగుతుండగానే, స్కూటర్ దేవాలయాన్ని చేరుకుంది.

అక్కడ ట్రస్టీ ఆంజనేయశర్మగారు ఆ దంపతులకి సాదరస్వాగతం పలుకుతూ "త్వరగా కాళ్ళు కడుక్కుని రండి, పూజకి టైమవుతోంది" అని గబగబా మెట్లెక్కి ఆయన దేవాలయం లోపలికి వెళ్ళిపోయాడు. భానుమతి 'ట్యాప్' దగ్గరకు వెళ్లి, కాళ్ళు కడుక్కుంది. వాసుదేవరావు ఇంకా అక్కడే నిలబడి ఉండడం చూసి "రండి త్వరగా" అని పిలిచింది. "ఏంటి హడావుడి? గుళ్లో దేవుడు ఎక్కడికి పోతాడు?" అని, ఆగమన్నట్లు చేత్తో సైగచేశాడు. చక్రాలపీట నెట్టుకుంటూ ఓ యాచకుడు దగ్గరకు రాగానే "ఏం రంగన్నా! బాగున్నావా?" అని పలకరించి, ఓ వంద నోటు తీసి అతని చేతిలో పెట్టి, గబగబా గుడి మెట్లు ఎక్కి భానుమతిని కలుసుకున్నాడు.

"దర్శనం చేసుకుని బయటికొచ్చాకే దానధర్మాలు చెయ్యాలని ఎక్కడ రాసుంది? ఎవరు చెప్పారు? దేవుడు గుడిలో మాత్రమే ఉన్నాడనుకుంటారెందుకు?"

"సరె సరె... మీ వాదనలు కాసేపు వాయిదా వేస్తారా?" అన్నది భానుమతి. మైకులోంచి పూజారిగారు గొంతు చించుకుని అష్టోత్తరనామావళి పఠిస్తున్నాడు. పూజాకార్యక్రమాలు పూర్తికావడానికి అరగంట పట్టింది. దేవాలయ ప్రాంగణంలో అరుగు మీద కూర్చున్నారిద్దరూ. "అటు చూడండి, రాలిన పారిజాతాలు ఎంత బావున్నాయో" అంది భానుమతి ముచ్చటగా. "నువ్వే ఒక నవపారిజాతాని వోయ్ భానూ! ఈ దేవాలయంలో, నీ దేహంలో నాకు కొత్త అందాలు తొంగిచూస్తున్నట్లు అనిపిస్తోం దేవిటి?" అన్నాడు గాలికి రెపరెపలాడుతున్న పైటకేసి గుటకలు మింగుతూ.

"సమయం, సందర్భం ఉండాలి"

"మనసుని నియంత్రించడం ఎవరితరం? సరసం, సంతోషం ఆపుకోకూడదు, దాచుకోకూడదు" "అదేమో గానీ, నా మనసులో మాత్రం ఒక రహస్యం దాచి పెట్టానే మరి.." "అలాగా! ఆడాళ్ళు అందాలే అనుకున్నా, రహస్యాలు కూడా దాచుకుంటారని తెలీదు. అయితే ఏం? మీరు మనుషులు కాదా? మీకు అనుభూతులు, భావాలు ఉండవా? ఉండకూడదని ఏ బడుద్దాయంటాడు? నాకేం అభ్యంతరం లేదు. నీ సీక్రెట్స్ గురించి నాకు చెప్పనక్కరలేదు" అన్నాడు. భానుమతి ముచ్చటగా చూసింది. ఇంకో మగాడైతే అంతతేలిగ్గా వదుల్తాడా? కూపీలు లాగడూ? ఆరాలు తియ్యడూ? అప్పటికి పూర్తిగా తెల్లవారిపోయింది. ఆరోజు వాళ్ల పెళ్ళిరోజు. తియతియ్యగా పదిహేను సంవత్సరాల కాలం ఇట్టే దొర్లిపోయింది.




వాసుదేవరావు ఆఫీసుకి సెలవు పెడదామనుకున్నాడు. కానీ అర్జెంట్ మీటింగ్ ఉండడంతో, బాస్‌కి ఇబ్బంది కాకూడదని భానుమతిని కన్విన్స్ చేశాడు. "నిన్ను డిజప్పాయింట్ చెయ్యట్లేదు కదా?" అన్నాడు ఆఫీసుకి బయల్దేరుతూ. "చెయ్యక పోవడమేమిటి?" అంది. అతను అర్థం కానట్లు చూస్తుంటే, ఆవిడే చొరవచేసి గాఢంగా పెదాలు కలిపింది. ఎలామర్చిపోయానబ్బా? అంటూ యమ రెచ్చిపోయి, ఆమె దేహమంతా తెగ ముద్దులుపెట్టేసి, హద్దులు దాటబోతుంటే ఆమె అదుపుచేసి, "ప్యాంటు, షర్టు వేసుకున్నాక బుద్ధిగా ఆఫీసుకి వెళ్ళాల్సిందే. ఇంటికొచ్చి లుంగీ కట్టుకున్నాక, దొరగారి శృంగారానికి నేను సిద్ధంగా ఉంటాగా" అని బుజ్జగించి, పంపించింది.

•••

మధ్యాహ్నం రెండు గంటలు. ఆఫీసులో అందరూ 'లంచ్' కార్యక్రమంలో మునిగి ఉన్నారు. అంతలో గుమ్మందగ్గర ఓ వ్యక్తి అనుమానాస్పదంగా తచ్చాడుతూ ఉండటం పసిగట్టి, "దొంగ... దొంగ... పట్టుకోండి" అని అరిచారెవరో. ఆ వ్యక్తిని నలుగురు కలిసి పట్టి తీసుకువచ్చారు.

అతను బక్కపలచగా, మాసిన గుడ్డలు, పెరిగిన గడ్డంతో ఉన్నాడు.

"ఎవరయ్యా నువ్వు? ఎందుకొచ్చావ్?" అనడిగాడు డ్రైవర్ కనకారావు.

అతను దీనంగా అందరికేసి చూస్తూ చేతులు జోడించి "అయ్యా నేను దొంగనీ కాదు, యాచకుణ్ణీ కాదు" అన్నాడు. 'మరెవరు? మావోయిస్టుల మనిషివా? రెక్కీ జరుపుతున్నావా?' అందరూ కలిసి తుపాకీ గుళ్ళలా అతని మీద ప్రశ్నల వర్షం కురిపిస్తుంటే, వాసుదేవరావు వాళ్ళందరినీ శాంతింపచేశాడు. ఆ

వచ్చిన వ్యక్తితో ఆదరంగా మాట్లాడి, అసలు విషయం తెలుసుకున్నాడు.

అతని సమస్య అర్థమయ్యాక, వాసుదేవరావు ఊరుకుంటాడా? ఎదుటి మనిషి కష్టంలో ఉన్నాడంటే, ఎంతసాయం చెయ్యాలో అంతా చెయ్యాల్సిందే.

"సుబ్బారావుగారూ! మీరేం భయపడకండి. మీరు రావలసిన చోటికే వచ్చారు. మా ఆఫీస్ స్టాఫంతా పైకి కౌరవ సంతానంలా ఉంటారు గానీ, చీరలు కట్టుకోవలసిన వాళ్ళండీ" చెప్పాడతనితో. "అదేంటి గురూ! అంటే మేము ఆడవాళ్ళమనా నీ ఉద్దేశం?" "అవునేమో! కాకూడదా? అయితే తప్పేంటి? శరీరాలు కఠినమేగానీ, మనసులు బహు సున్నితం అని నా భావం! ఎదుటి మనిషి కష్టానికి కరిగిపోయే జాలిగుండెలు మీవి అని చెప్పదల్చుకున్నా. మీరు రాక్షసులా చెప్పండి...?' 'కాదు గురూ, అబలల్లాంటివాళ్ళం. ఏం చెయ్యమంటావో చెప్పు?' అన్నారు అందరూ కోరస్‌గా. "చూశారా సుబ్బారావుగారూ! ఇక మీరు నిశ్చింతగా ఉండొచ్చు"అని అప్పటికప్పుడు డొనేషన్ వసూలు చేసే కార్యక్రమం మొదలుపెట్టాడు. ఆడ, మగ, చిన్న, పెద్ద అనే హోదాల తారతమ్యం లేకుండా అందరూ పోటీపడి, ఉత్సాహంగా నోట్లవర్షం కురిపించారు. ఆశ్చర్యం! నలభైవేలు పోగయింది. వాసుదేవరావు అంతటితో ఊరుకోలేదు. పై అధికారులతో మాట్లాడాడు. ఆమోదం పొందాడు. "సుబ్బారావుగారూ! మా పోలీస్ డిపార్ట్‌మెంట్‌వారి కల్యాణ మండపం" మీకు 'ఫ్రీ'గా కేటాయించాం అని వాసుదేవరావు చెబుతుంటే, "ఏంటి హడావుడి? ఎవరిది పెళ్ళి?" అంటూ అక్కడికి వచ్చాడు రమణమూర్తి. విషయం అంతా విని, "నన్నూ ఒక చెయ్యి వెయ్యనివ్వు బాస్! ఇది మా చెల్లి పెళ్ళి అనుకుంటా! మా 'వైష్ణవీ కేటరింగ్' తరపున పెళ్ళిభోజనం, టిఫిన్లు నేను చూసుకుంటా" అన్నాడు. కన్యాదాత కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "దిక్కుతోచక పిచ్చివాడిలా తిరుగుతున్న నన్ను ఆ దేవుడే ఇక్కడికి నడిపించి తీసుకొచ్చాడు. చిట్‌ఫండ్ కంపెనీలో అవసరానికి పనికొస్తుందని డబ్బు దాచుకున్నాను. వాడు బోర్డు తిప్పేశాడు. ఇక మాకు చావే దిక్కనుకున్న సమయంలో.. అతనికి దుఃఖం పొంగుకొచ్చి, మాట పూర్తి చేయలేక పోయాడు. "సుబ్బారావుగారూ! మీరు దాచుకున్న డబ్బు కూడా ఇప్పించే పూచీనాది. కానీ నా వాటా ఎంతో చెప్పండి?" అడిగాడు వాసుదేవరావు.



అక్కడున్న అందరితో పాటు, కన్యాదాత కూడా విస్తుపోయి చూశాడు. "చెప్పరేంటండీ బాబూ! ఇంత 'ఫేవర్' ఎవడన్నా ఊరికే చేస్తాడా?" "ఏం కావాలి బాబూ?" భయం భయంగా అడిగాడతను.

"మా అందరితో కలిసి, మీరు కడుపునిండా అన్నం తినాలి మాస్టారూ!" అని చెప్పడంతో, హర్షాతిరేకంతో అంతా చప్పట్లు కొట్టారు. "ఈ బడిపంతులు మీద ఎందుకింత అభిమానం బాబూ?" "వెండి తెరమీద, వెకిలివేషాలు వేసే పోరంబోకు హీరోలకి కాదు మాస్టారూ, చదువుచెప్పి, సమాజాన్ని సరైన దారిలో నడిపించే మీలాంటి ఉపాధ్యాయులకి అభిమాన సంఘాలు ఉండాలి అసలు. చెల్లెలు పెళ్ళి జరిగేవరకు మీకు మేం అండగా ఉంటాం, మీరు నిశ్చింతగా ఉండండి" అన్నాడు వాసుదేవరావు.

●●●

"ఏంటి, ఇంకా బయలుదేరలేదా మన్మథా? సాయంత్రం నాలుగ్గంటలప్పుడు ఫోన్‌చేసి, అడిగింది భానుమతి.

"అంత తొందరగా ఉందేం భానూ?"

"అవును.." "ఫస్ట్‌నైట్ రిపీటవుతుందా? లేక మరేదన్నా స్పెషల్ ఉందా?"

"చాలా ఉంది. మీరు త్వరగా వచ్చి చూడండి. ఎంత థ్రిల్లింగా ఉంటుందో" అంటూ ఊరిస్తుంటే, "ఇంకెందుకు ఆలస్యం? రెక్కలు కట్టుకుని వాలిపోనూ?" అంటూ దారిలో బుట్టెడుపూలు, స్వీట్లు కొనుక్కుని, ఇల్లు చేరుకున్నాడు. ఇంటికి రాగానే భానుమతి కనిపించలేదు. "బాగున్నావా వాసుదేవా? ఎన్నాళ్ళైంది తండ్రీ నిన్ను చూసి" అంటూ పలకరించింది శేషమ్మ. భానుమతికి ఆవిడ మేనత్త వరస. వాసుదేవరావు ఆవిడ పక్కన కూర్చుని "నమ్మలేకుండా ఉన్నాను పిన్నీ! ఇంత కాలానికి మా మీద దయ కలిగిందా?" అనడిగాడు చేతులు పట్టుకుని ఆప్యాయంగా. భానుమతి టిఫిన్‌ప్లేటు, మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది. "ఆకల్లేదు" అన్నాడు. "అదేంటి మీకిష్టమైన జీడిపప్పు ఉప్మా" అంది భానుమతి. "ఇటివ్వు, మా అబ్బాయికి నేను తినిపిస్తా" అంటూ ప్లేటు అందుకుని, స్పూన్‌తో ఉప్మా నోటికందించింది. వాసుదేవరావుకి శేషమ్మగారంటే ఉన్న అభిమానం మాటల్లో చెప్పలేనిది. ఆమె లేకపోతే తనకి భాను దక్కేదా? ఆ అందాల అపరంజిబొమ్మ తన జీవితంలోకి ప్రవేశించి రాగరంజితంచేసి రోజూ యిలా అనురాగడోలికల్లో తేలియాడిస్తోందంటే, అందుకు శేషమ్మగారు తనకి సపోర్ట్ చేయడం వల్లనే.

వాసుదేవరావు కళ్లముందు ఆనాటి దృశాల్లో కొన్ని కదలాడాయి. పెళ్లిచూపుల కార్యక్రమంలో స్వీట్, హాట్ల కార్యక్రమం ముగిశాక అమ్మాయిని తెచ్చి, కూర్చోపెట్టారు తనకెదురుగా. అందం కదిలొచ్చి, కళ్లముందు సాక్షాత్కరించింది. తన 'స్వీట్ హార్ట్' ఆమేనని ఫిక్సయిపోయి, తీయని కలలు కంటుండగా, అమ్మాయి తండ్రి ఒక్కసారి వీరభద్రుడి అవతారం ఎత్తాడు. కారణం. తనతండ్రి దాచకుండా ఉన్న విషయం చెప్పడం. ఎప్పుడో పదిహేనేళ్ల క్రితం తన అక్క కూతురు ఓ దళితుణ్ణి పెళ్లి చేసుకున్న విషయం వింటూనే, ఆయన అగ్గిరాముడై "ఈ సంబంధం క్యాన్సిల్" అంటూ తీర్మానించేసరికి వాసుదేవరావు గుండె గుబగుబలాడిపోయింది. శేషమ్మగారు అప్పుడు తనపాలిట దేవతలా రంగంలోకి దిగింది. అన్నగారిని గదిలోకి తీసుకెళ్లి, ఏం ఉపదేశం చేసిందో, పది నిమిషాల తర్వాత బయటికొచ్చి "క్షమించండి బావగారూ! నోరుజారాను. ముహూర్తాలు ఎప్పుడు పెట్టుకుందాం" అన్నాడు.

"ఇప్పుడే..." అనబోయి వాసుదేవరావు నిగ్రహించుకున్నాడు.

మంచిముహూర్తాలు లేక, ఒక ఆరునెలలు ఆగవలసి వచ్చింది.

భానుమతి మెడలో తాళికడుతూ, మనసులో శేషమ్మగారికి దండం పెట్టుకున్నాడు వాసుదేవరావు.

●●●

“అచ్చం ఫస్ట్‌నైట్‌లా గదిని, మంచాన్ని అలంకరించావు. వెరీనైస్..” అన్నాడు వాసుదేవరావు.

“ఈ క్రెడిట్ నాదికాదు. మా అత్తయ్యది”.

“సరే! నువ్వుకూడా శోభనం పెళ్ళికూతురులా వెలిగిపోతున్నావు. ఏమిటి విశేషం?” “కరిగిపోదామని..”

“ఆవిర్లు పొంగుకొస్తున్నాయి ఒంట్లోంచి” అంటూ తమకంగా ఆమెని చుట్టేసి, ఒళ్ళంతా ముద్దుల వర్షం కురిపిస్తుంటే ఆమె తాళలేక, మోహంతో తీగలా మెలికలు తిరుగుతూ అతణ్ణి తనలో కలిపేసుకుంది. పైకి చూస్తే బలం లేనట్లు కనిపిస్తాడుగాని, పడకలో అతడి ప్రతాపం ఆమెకి తెలీదా? పది నిమిషాల ప్రణయకేళిలో ప్రపంచాన్ని మరిచిపోయారిద్దరూ. పచ్చగా, నాణ్యమైన బంగారంలా మెరిసిపోతున్న ఆమె మేనిసొగసు అతనికి ఎంత చూసినా తనవితీరదు. స్త్రీ శరీరంలో ఆకర్షణేకాదు, నిత్యనూతనత్వాన్ని కూడా కూరి ఉంచాడు ఆ సృష్టికర్త!

“ప్రభాత్ టాకీస్ గుర్తుందా?” అడిగాడతను ఆమె ముంగురులు ప్రేమగా సవరిస్తూ.

“లేకేం..? మా అత్తయ్యని చూడగానే తమరికి గుర్తొచ్చింది కదూ? ఈ రోజు ఉదయం కోవెలలో మీతో ఒక విషయం చెప్పాను గుర్తుందా?” “ఏవిటది?” “మీ దగ్గర ఓ ‘రహస్యం” దాచిపెట్టానని ‘అవును’. ‘మన మధ్య మొదటిసారిగా ఇవ్వాళ ఆ ప్రస్తావన వచ్చిందో, లేదో మా అత్తయ్య అలా వచ్చింది”. “ఇంతకీ విషయం చెప్పవోయ్...’ నడుం చుట్టూ చేతులు పోనిచ్చి, దగ్గరకు లాక్కుంటూ అడిగాడు. “మన ఎంగేజ్‌మెంట్ జరిగాక, ఒక సాయంత్రం వేళ ఎంతో ఆశతో మీరు మా ఇంటికి వచ్చారు”

“అవును. నా కోరిక విని, మీ నాన్న తిక్కశంకరయ్య అవతారం ఎత్తాడు. సంప్రదాయం గల కుటుంబం మాది. పెళ్లికాకుండానే సినిమాలు, షికార్లేవిటి బుద్ధిలేకుండా అని ఎగిరిపడుతుంటే మన పాలిట దేవతలా మీ అత్తయ్య...”

“ఉండండి నేను చెబుతా.. మన ముగ్గురం కలిసి, ఓ డొక్కు, టూరింగ్ టాకీస్‌లో సినిమాకి వెళ్లాం. అది మరాఠీ భక్తిరస చిత్రం. మనమధ్య అడ్డుగోడలా ఉంటానని, మా అత్తయ్య ఇంట్లో చెప్పిందే కాని, మనకి పూర్తిగా ‘లైసెన్స్’ ఇచ్చేసింది. అప్పుడు మీరు ‘టైటిల్స్’ దగ్గర్నుంచి శుభం కార్డుదాకా... నన్ను ఉక్కిరిబిక్కిరి చేశారు. మీ చేతివేళ్లు నా ఒంటిని వీణగా మార్చి, అనురాగరాగాలు పలికించాయి. ఆ రాత్రి ఇంటికి వెళ్లిపోయాం. మరో రిక్షాలో మీరు వెళుతుంటే, నా ప్రాణాన్ని మీతో పట్టుకెళ్ళిపోతున్నట్టు అనిపించిందండీ..” “ఏంటి.. నిజమే? అప్పుడే అంత ప్రేమ ఎలా ఏర్పడిందే?” బోలెడంత ఆశ్చర్యం ప్రకటించాడు వాసుదేవరావు. ‘ఉత్త ప్రేమేకాదండీ” మరి?

“కోరిక. హద్దులు లేని వాంఛ. మాటల్లో చెప్పలేని తాపం. మీరు నాలో తట్టుకోలేని మోహం రేకెత్తించి, తుఫాను రేపారు. నిద్రపట్టక చచ్చాను. ఇంట్లోంచి పారిపోయి, మీ దగ్గరకొచ్చి కౌగిట్లో కమ్మగా కరిగి, మీలో ఐక్యమై, నా సర్వస్వం మీకు అర్పించాలన్న తీవ్రమైన యావ ఆ రాత్రంతా నన్ను కుదిపి వేసింది” “ఏంటి తాళికట్టకుండానే... పెళ్లికిముందే” అన్నాడు కళ్లింతచేసి, వింతగా చూస్తూ. “అవును ముందు, వెనకలు ఆలోచించేస్థితిలో లేను”.

“మరి ఈ మాట ఈ పదిహేనేళ్ళలో ఎప్పుడూ చెప్పలేదే?”

“సిగ్గు” “ఓహో దాన్ని జయించడానికి ఇంత కాలం పట్టిందా నీకు? అవును కదూ, అదే మన భారత స్త్రీ గొప్పదనం” అంటూ చటుక్కున పెదాల మీద ఓ తీపిముద్దిచ్చి, “ఇదిగో చూడమ్మాయ్! ఆనాటి రాత్రి నీ శరీరం ఎంత కాలిపోయిందో, తట్టుకోలేనంతగా ఎంత రగిలిపోయావో అదంతా క్లారిటీగా, ప్రాక్టికల్‌గా నువ్వు నాకు చూపించాలి. మాటల్లో చెబితే నా బుర్రకెక్కడంలేదు. కాబట్టి రియలిస్టిగ్గా రెచ్చిపోయావనుకో..”

“అనుకోవడాల్లేవు స్వామీ!....” నువ్వడిగింది ఏనాడైనా కాదనన్నా? సరదా పడితే వద్దంటానా’ అంటూ రాగయుక్తంగా భానుమతి ఉప్పొంగిన గోదారిలా, పోటెత్తి పరవళ్లు తొక్కుతున్న కృష్ణమ్మలా పతిదేవుడి మతి పోగొట్టడం మొదలుపెట్టింది. వాసుదేవరావు సరికొత్త ఎంజాయ్‌మెంటుతో, ఎన్నడూ పొందని అనుభూతులమత్తులో పరవశిస్తున్నాడు. తెల్లగా తెల్లారిపోయినాగానీ వారు మాత్రం చల్లబడలేదు.

**సెల్:94934 10034**





# పెళ్లైన కొత్తలో...!

**రెండు విభిన్నమైన కుటుంబాలకు చెందిన ఇద్దరు స్త్రీ పురుషుల మనసులను ఒక్కటి చేసే బంధం పెళ్ళి. ఈ పవిత్ర బంధం సాక్షిగా ఆ ఇద్దరూ జీవితాంతం కలిసి ముందుకు సాగుతారు. ఆ సుదీర్ఘ ప్రయాణంలో ఒక్కోసారి చిన్న చిన్న గొడవలు, అలకలు సహజం. అందులోనూ అప్పుడే పెళ్ళైన దంపతులైతే ఒకరిపై ఒకరికి సంపూర్ణమైన అవగాహన ఏర్పడే వరకు చిన్న చిన్న విభేదాలు అప్పుడప్పుడు చోటు చేసుకుంటూనే ఉంటాయి.**

రెండు వేరువేరు కుటుంబాల నుంచి వచ్చిన ఇద్దరు మనుషులు కలిసి కొత్త జీవితం ప్రారంభించినప్పుడు గొడవలు సహజమే. ఈ రెండు కుటుంబాల్లోనివారూ పెరిగిన వాతావరణం, పద్ధతులు, అలవాట్లే వారి భేదాభిప్రాయాలకు మూలం. అయితే ఈ గొడవలవల్ల నూతన దాంపత్య జీవితంలో స్త్రీపురుషులు పొందాల్సిన ఆనందాన్ని అప్పుడప్పుడు కోల్పోతుంటారు. కాబట్టి సందర్భానుసారం కలిసి ముందుకెళ్తేనే సంసారం సజావుగా కొనసాగుతుందని ఇద్దరూ గ్రహించాలి. అందుకే పెళ్ళైన కొత్తలో ఎక్కువగా గొడవ పడేందుకున్న అవకాశాలు, ఆ అంశాలపైన, ఆనందంగా ఉండడానికి కావల్సిన మార్గాలపైన ఓ లుక్ వేయండి!

### డబ్బే లోకం కాకూడదు

భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతుంది, ప్రపంచం డబ్బుచుట్టూ తిరుగుతుందని నానుడి. డబ్బు ప్రభావమే భార్యాభర్తల గొడవల్లో ఎక్కువ చోటు చేసుకుంటుంది. ఒకరికి విచ్చలవిడిగా ఖర్చుచేసే అలవాటు ఉంటే, మరొకరు పొదుపరై ఉంటారు. కానీ ఖర్చులో ఇద్దరిదీ భారీచెయ్యే అయితే చెప్పే అవసరమే ఉండదు. షాపింగ్‌కి అంత ఖర్చైందా అని భర్త అంటే, మీ ట్రిప్‌కి పది వేలు ఖర్చు కాలేదా అని భార్య ప్రశ్నిస్తుంది. ఇలా ఖర్చుల కోసం గొడవపడకుండా ఉండాలంటే ముందుగానే ప్రతి నెలా జీతం వచ్చిన వెంటనే కూర్చుని ఖర్చుల వివరాలు రాసుకోవడం ద్వారా ఒక ప్లానింగ్ చేసుకోవాలి. మీ బడ్జెట్‌లోనే ఎవరెవరి ఖర్చులకు ఎంత మొత్తం కావాలో వివరాలు పొందుపరుచుకోవాలి. ఖర్చులు గనుక మన ఆదాయాన్ని మించిపోతే, కొన్ని ఖర్చులు వాయిదా వేయడం లేదా తగ్గించుకోవడమో చేయవచ్చు. పొదుపు అంశాలపై కూడా దృష్టిసారిస్తే మరీ బాగుంటుంది. పెళ్లికి ముందు ఇద్దరి ఆదాయాలు, ఖర్చులు వేరు వేరుగా ఉండవచ్చు. అయితే పెళ్ళి తర్వాత ఒకరికి అనుగుణంగా ఇంకొకరు సర్దుకుపోయి జీవించడం వల్ల ఆర్థిక విషయాల్లో ఎలాంటి గొడవలూ రాకుండా ఉంటాయి.

### నీది నాది కాదు - మనది అనుకోవాలి

పెళ్లయిన కొత్తలో ఎక్కువమంది ఎదుర్కొనే సమస్య ఇంటి పని ఎవరు చేయాలి అని. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగం చేస్తున్న ఇవాల్టి పరిస్థితుల్లో ఇంటి పనులన్నీ భార్యే చేయాలంటే వీలయ్యే విషయం కాదు. ఇంటిపని ఆడవారే చేయాలనే సంప్రదాయబద్ధమైన ఆలోచనా ధోరణి వల్ల భార్యపై ఒత్తిడి పెరిగిపోయే అవకాశం ఉంది. ఈ ఒత్తిడి ఆమె అనారోగ్యానికి దారితీయడమే కాదు, ఇద్దరి మధ్య గొడవలకూ దారి తీస్తుంది. అందుకే ఇద్దరూ కలిసి ఒకరి పనులు మరొకరు పంచుకోవడం మంచిది. ఇద్దరూ ఒకే టీమ్ సభ్యులుగా భావించి ఏపని ఎవరు చేయాలో ముందస్తు నిర్ణయంతో శ్రమ విభజన చేసుకుంటే ఇక ఎలాంటి ఇబ్బందులూ ఎదురయ్యే అవకాశం ఉండదు. అయితే ఒక్కొక్కసారి ఇద్దరిలో ఒకరికి అత్యవసరమైన పనులు ఉన్నప్పుడో లేదా ఇతర కారణాల వల్ల భాగస్వామి తన పని పూర్తి చేయలేకపోయినప్పుడో రెండోవారు పరిస్థితిని అర్థం చేసుకోవాలి. వారే ఆ పనులు పూర్తి చేయాలి. అప్పుడే ఇద్దరి మధ్యా ఎలాంటి గొడవలకూ తావుండదు.



### పరస్పర గౌరవం

పెళ్లయిన తర్వాత భార్యాభర్తలిద్దరూ కొత్తలో ఒకరినొకరు క్షణం కూడా ఎడబాటు లేకుండా కలిసే ఉంటారు. అయితే ఎప్పుడూ కలిసే ఉండటం వల్ల కొన్నిసార్లు కొంతమంది తమ వ్యక్తిగత జీవితాన్ని కోల్పోయినట్టు ఫీల్ అవుతారు. అంతకుముందులా తమ ఫ్రెండ్స్‌తో క్లోజ్‌గా ఉండలేకపోతున్నామనే ఫీలింగ్ కలుగుతుంది. ఫీలయిపోతుంటారు. కొత్తల్లో ఈ ఫీలింగ్స్ ఉండకపోవచ్చు. కొన్నాళ్ల తర్వాత ఈ భావన కలగడం సహజం. అలాంటి భావం ప్రవేశించినంత మాత్రాన మన వ్యక్తిగత స్వేచ్ఛను కోల్పోతున్నట్లు కాదు. అలాంటి భావనకు దూరంగా ఉండాలి. భాగస్వామి నుంచి మనం ఎక్కువ ఆశిస్తున్నామా? లేక అవసరమైన స్థాయిలోనే ఆశిస్తున్నామా? అనే విషయాన్ని ఎప్పటికప్పుడు ఆత్మపరిశీలన ద్వారా మనం నిర్ధారించుకోవాల్సి ఉంటుంది. ఎందుకంటే వారికి కూడా కొన్ని సరదాలు ఉంటాయి. కాబట్టి వారి నుంచి మరీ ఎక్కువ ఆశించకుండా భాగస్వాములిద్దరూ తమ తమ స్నేహితులను కలిసేందుకు, తమ అభిరుచులను ఎక్సేంజ్ చేసుకోవడానికి వారికంటూ కొంత ప్రత్యేక సమయం

కేటాయించుకునేలా చూసుకోవాలి. అంటే నెలలోని నాలుగు వారాల్లో ఒక వారం ఎవరి స్నేహితులతో వారు ఎంజాయ్ చేసేలా ఉండాలన్నమాట. లేదంటే, ఒకవారం ఒకరి స్నేహితుల దగ్గర, మరోవారం మరొకరి స్నేహితుల దగ్గర గడిపేలా కూడా ప్లాన్ చేసుకోవచ్చు. దీనివల్ల ఒకరి స్నేహితుల్ని మరొకరు ఓన్ చేసుకునేందుకు, మింగిల్ అయ్యేందుకు అవకాశం లభిస్తుంది. ఇలా గడపడం వల్ల ఒకరి గురించి మరొకరు క్షుణ్ణంగా తెలుసుకోవడానికీ, అప్పటివరకు తమకు తెలియని భిన్న భావజాలాలున్న స్నేహితుల గురించి తెలుసుకునే వీలు కలుగుతుంది. ఒకరి ఇష్టాయిష్టాలను మరొకరు గౌరవించుకోవడానికి ఇది దోహదపడుతుంది.

## కోపం అదుపులో ఉండాలి

నచ్చని పని చేస్తే ఎవరికైనా కోపం వస్తుంది. కానీ ఆ కోపం తగ్గించుకుని ఓర్పుతో ఎదుటి వారికి అర్థమయ్యేట్టు దేనిగురించి అయినా వివరించగలిగినప్పుడే ఆ బంధం గట్టిపడుతుంది. అయితే కొంతమందికి కోపం ముక్కుపైనే ఉంటుంది. అలాంటి వారి కోపం తాటాకుమంట లాంటిదన్నమాట. ఎంత త్వరగా కోపం వస్తుందో అంత త్వరగా చల్లారిపోతుంది కూడా. కానీ మరికొంత మంది కోపాన్ని అస్సలు అణచుకోలేరు. దానివల్ల భాగస్వామిని మన్నించలేకపోతారు. దీంతో భాగస్వామి ఏ విషయం మాట్లాడినా నచ్చదు. అది లేనిపోని గొడవలకు దారితీస్తుంది. అందుకే కోపాన్ని ఎంతగా అణచుకుంటే అంత మంచిది. ముక్కుమీద కోపం ఉన్నవారు ఓర్పు, సహనం ప్రాక్టీస్ చేయాలంటే కాసేపు ఒంటరిగా కూర్చోవాలి. ఇద్దరి మధ్య గొడవ రావడానికి కారణం ఏంటి? చిన్న విషయాలకే భూతద్దంలో పరిశీలించుకుని మరీ గొడవలకు దిగుతున్నారా? అనే విషయాన్ని ఇద్దరూ కలిసి పరిష్కరించుకోవడం మంచిది. అప్పుడే ఇద్దరి మధ్య ఏర్పడిన వివాదానికి పరిష్కార మార్గం లభిస్తుంది. అంతేకాదు ఇకముందు కూడా మరోసారి ఇలాంటి చిన్న చిన్న గొడవలు రాకుండా జాగ్రత్తపడచ్చు.

## అందరికీ చెప్పకండి

భార్యాభర్తలన్నాక చిన్న చిన్న గొడవలు, మనస్పర్థలు సాధారణమే. అయితే ఇలాంటి చిన్న విషయాలను మనసులో దాచుకోకుండా స్నేహితులకో, తల్లిదండ్రులకో చెప్పడం మంచి పద్ధతి కాదు. ఫలితంగా మనసులో బాధ తీరిపోవచ్చు. కానీ ఇలా చేయడం వల్ల అందరికీ తెలియడం తప్ప మరే ప్రయోజనమూ ఉండదు. అంతేకాదు దీనివల్ల కొంత తెలిసి మరికొంత తెలియక అవగాహనలేక మీ భాగస్వామిపై మరింత కోపం పెరిగేలా మీకు లేనిపోని మాటలు చెప్పవచ్చు. తద్వారా మళ్ళీ లేనిపోని మాటపట్టింపులు ఏర్పడవచ్చు. చాలావరకు చిన్న చిన్న విషయాలను ఇతరులకు చెప్పకపోవడమే మంచిది. దంపతులిద్దరూ కలిసి పరిష్కరించుకుంటే మూడో వ్యక్తి ప్రమేయం లేకుండానే సమస్య తీరుతుంది. ఒక వేళ ఆ గొడవ మరీ సీరియస్‌గా మారితే, ఇద్దరి ఆలోచనల ద్వారా పరిష్కారానికి అవకాశం లేకపోయినప్పుడు మాత్రమే తల్లిదండ్రులకు చెప్పాలి. అంతేకాని చీటికి మాటికి చిన్న చిన్న గొడవలను కూడా పెద్దవిగా చేసి ఇతరులతో చెబితే, ఇతరులకు లోకువైపోతారు. అంతేకాకుండా మీ కొత్త జీవితం ప్రారంభించిన భాగస్వాముల మధ్య దూరం మరింత పెరిగి పెద్దదయ్యే అవకాశాలుంటాయి.





## పట్టించుకోనితనమూ డేంజరే

జరిగిన గొడవల్ని భూతద్దంలో చూసే దంపతులు కొందరైతే గొడవలున్నా అసలు గొడవలేమీ జరగలేదనుకుని సాదాసీదాగా ప్రవర్తించే వారు మరికొందరుంటారు. నిజానికి ఈ రెండూ సరైన పద్ధతులు కావు. అదేంటి గొడవల్ని తేలిగ్గా తీసుకుని కలిసిపోవడం తప్పంటారేమిటి? అని అనుకుంటున్నారా! అవును మనసులో ఎలాంటి వ్యతిరేక ఆలోచనలు, అభిప్రాయాలు లేకుండా తేలిగ్గా తీసుకోగల్గితే ఫర్వాలేదు. కానీ మనసులో ఏదో పెట్టుకొని తేలికగా తీసుకున్నట్లు నటించడం అంటే దానర్థం ఇంకోసారి వివాదం వచ్చిన సందర్భంలో పాత విషయాలన్నీ కలిపి బదులు తీర్చుకుందామని ఎదురుచూడటమేనన్నమాట! ఇలాంటి ధోరణి అస్సలు మంచిదికాదు. ఇలా ప్రతిసారి టిట్ ఫర్ టాట్ ధోరణిలో ప్రవర్తిస్తే ఆ దంపతుల అనుబంధం, వారి జీవన ప్రయాణం గతుకుల రోడ్డులా మారిపోవడం ఖాయం. అందుకే ఇలాంటి చిన్న చిన్న వివాదాస్పద అంశాల్ని మనస్ఫూర్తిగా మర్చిపోయి భాగస్వామిని ప్రేమగా దగ్గరికి తీసుకోవాలి. పరస్పర అనురాగం, ప్రేమ ఇరువురి మధ్యా ఏర్పడినప్పుడు, ఎలాంటి మనస్పర్థలైనా వారిరువురినీ ఏమీ చేయలేవు. ఆ ఫలితంగా వారి దాంపత్య బంధం శాశ్వతమవుతుంది.



## క్షమించగలిగాలి

క్షమించడం ఓ గొప్ప లక్షణం. ఎదుటివారు తమ తప్పు తెలుసుకుని క్షమాపణ కోరితే బెట్టు చేయకుండా ఒప్పుకోవాలి, అప్పుడే భార్యాభర్తల బంధం నిలబడుతుంది. క్షమించి వారిని దగ్గరకు తీసుకోవాలి. మరో ముఖ్యమైన విషయం ఒకరు కోపంగా ఉన్నప్పుడు మరొకరు కోప్పడడం మంచి పద్ధతి కాదు మౌనంగా ఉండటం లేదా ఓర్పు వహించడం ముఖ్యం. కోపంగా ఉన్నప్పుడు వారిని కాసేపు ఒంటరిగా వదిలేయాలి. ఆ తర్వాత దగ్గరికి తీసుకుని ప్రేమగా బుజ్జగించాలి. ఇలా చేయడం వల్ల మరోసారి గొడవలు రాకుండా ఉండటంతో పాటు ఒకరినొకరు అర్థం చేసుకునే తత్వం ఇద్దరిలోనూ పెరుగుతుంది.

-సంతోషి

# దీక్ష ఆగినా ఆగని
# పోరాటం



**సైనికుల ప్రత్యేకాధికారాల చట్టాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ ఇరోమ్ షర్మిల 16 ఏళ్ల పాటు నిరాహార దీక్ష చేసింది. ఈ చట్టాన్ని రద్దు చేయడానికి దేశ సైనిక వ్యవస్థ ససేమిరా అంటోంది.**

ఇరోమ్ చానూ షర్మిల ఓ అసాధారణ పోరాటం సాగించిన సాధారణ మహిళ. దాదాపు 16 ఏళ్ల నిరవధిక నిరాహార దీక్ష చేసిన షర్మిల గత ఆగస్టు 9నే దీక్షకు స్వస్తి చెప్పింది. మణిపూర్ ఉక్కు మహిళగా పేరు తెచ్చుకున్న 44 ఏళ్ల షర్మిల సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయాల్సిందిగా డిమాండ్ చేస్తూ 2000 నవంబర్ 4న నిరవధిక నిరాహార దీక్ష చేపట్టింది. ఇప్పుడామె తన లక్ష్యం సాధించడానికి రాజకీయ ప్రవేశం చేస్తానని ప్రకటించారు. స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నికల్లో పోటీచేస్తానని ఆమె నిరాహార దీక్షకు స్వస్తి చెప్పిన తరువాత ప్రకటించారు. ఈ చట్టం కశ్మీర్‌లోనూ, ఈశాన్య రాష్ట్రాలలోనూ మాత్రమే అమలు జరుగుతోంది. ఈ చట్టం కింద సైనికులకు సాయుధ, ఉగ్రవాద పోరాటాలను అణచడానికి విశేష అధికారాలు సంక్రమిస్తాయి.

షర్మిలను ప్రభుత్వం దాదాపు ప్రతి యేటా అరెస్టు చేస్తుంటుంది. ఇది రొటీన్ వ్యవహారంగా మారిపోయింది. ఆత్మహత్యకు పాల్పడిందనే నేరంపై ఆమెను అరెస్టు చేసి జైలుకు పంపిస్తుంటుంది. ఆత్మహత్యా ప్రయత్నానికి గరిష్ఠ స్థాయి శిక్ష ఏడాది మాత్రమే. అందువల్ల ఆమెకు కోర్టు విచారణ, జైలు శిక్ష ప్రతి ఏటా తప్పనిసరి కార్యక్రమంగా మారిపోయింది. ఆమెను జైలుకి తీసుకెళ్లిన తరువాత ఆస్పత్రికి తరలిస్తారు. అక్కడ ఆమెకు సెలైన్, బలవర్ధక ఔషధాలను ముక్కు ద్వారా లోపలికి పంపిస్తారు. కోర్టు ఆమెను రొటీన్‌గా కొన్ని ప్రశ్నలు అడుగుతుంది. ఆమె నిరాహార దీక్ష కొనసాగించాలనుకుంటోందా, ఆస్పత్రిలో చేర్చాల్సిన అవసరం ఉందా, ఆరోగ్యం బాగానే ఉందా, జైలులో బాగానే చూస్తున్నారా... వంటి ప్రశ్నలను కోర్టు ఆమెను అడుగుతుంది. ఆమె చెప్పే సమాధానాలూ రొటీన్‌గానే ఉంటాయి.

విచారణ పూర్వగానే అంబులెన్స్ వచ్చేస్తుంది. కోర్టు న్యాయమూర్తి కార్యాలయం ముందు ఆగుతుంది. అందులో ఏకే 47లతో తొమ్మిది మంది కమాండోలు ఉంటారు. వాళ్లంతా ఓ పైలట్ వాహనంలో(జీపీలో) కూర్చుంటారు. జీపీ ముందు వెడుతుండగా దాని వెనుకే అంబులెన్స్ బయలుదేరుతుంది. అంబులెన్స్‌లో కూడా ఆమెకు తోడుగా ఇద్దరు సాయుధ పోలీసులు కూర్చుని ఉంటారు. ఆహారం తీసుకునే ట్యూబ్ ప్రతి రోజూ ఆమె ముక్కుకు తగిల్చే ఉంటుంది. ఆహారాన్ని ద్రావకాల రూపంలో ఆ ట్యూబు ద్వారా తరచూ పంపిస్తుంటారు. ఆమె కోర్టుకు హాజరైనప్పుడల్లా, ఆమె సోదరుడు ఆమె వెంటే ఉంటాడు. ఆమెకు చెందిన జస్ట్ పీస్ ఫౌండేషన్ సభ్యులు కూడా ఒకరిద్దరు వచ్చి ఆమె పక్కనే కూర్చుంటారు. ఇలా ఏడాదికి ఒకసారి కోర్టుకు వచ్చినపుడు మాత్రమే ఆమె తన వాళ్లను సన్నిహితంగా కలుసుకోవడానికి వీలుంటుంది. ఆమెను మీడియా కలుసుకోవాలంటే మాత్రం అధికారుల నుంచి అనుమతి తీసుకోవాల్సి ఉంటుంది.



### ప్రజా వ్యతిరేక ప్రభుత్వం

ఆమె మణిపురితో పాటు హిందీ, ఇంగ్లీషుల్లో కూడా అనర్గళంగా మాట్లాడుతుంది. ప్రభుత్వ తీరుతెన్నుల గురించి ఎవరైనా ఏదైనా ప్రశ్నిస్తే, ఆమె వెంటనే "పాలనకు సంబంధించినంత వరకూ ఈ ప్రభుత్వం ఓ చెవిటిది. ఇంతకంటే చెప్పేదేమీ లేదు" అని చెబుతుంది. నిరాహార దీక్ష కారణంగా ఆమె శరీరం శుష్కించిపోయినా ఆమె గొంతు మాత్రం గట్టిగా, సూటిగా, స్పష్టంగా వినిపిస్తుంది. "ఇప్పటి ప్రభుత్వాలకు ప్రజల బాధలు పట్టవు. అందులోనూ పేద ప్రజల బాధలు అసలే పట్టవు. ప్రజల బాధలు కళ్లెదుట కనిపిస్తున్నా సరే, ప్రభుత్వంలో మార్పు రాదు. ఇంతకన్నా దుష్పరిపాలన మరొకటి ఉండదు. ప్రభుత్వం ఎవరి కోసమూ ఏమీ త్యాగం చేయదు" అని ఆమె చెబుతుంటుంది.

పదహారేళ్ల క్రితం, అంటే 2000 నవంబర్ 2న ఇంఫాల్, మయన్మార్‌లను కలిపే టిడ్డిమ్ రోడ్డులో అస్సాం రైఫిల్స్‌కు చెందిన భద్రతా దళ సైనికులు కవాతు చేస్తూ వెడుతున్నారు. ఇంతలో హఠాత్తుగా వారి ముందు ఓ శక్తిమంతమైన బాంబు పేలింది. సైనికులు వెంటనే తిరగబడ్డారు. చెల్లాచెదురవుతున్న జనం మీద కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో బస్టాపులో నిలబడి ఉన్న ఓ పది




మంది అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ప్రాణాలు కోల్పోయినవారిలో ఓ 62 ఏళ్ల మహిళ ఉంది. రాష్ట్రపతి దగ్గర నుంచి జాతీయ సాహస పురస్కారం పొందిన ఓ 18 ఏళ్ల యువకుడు కూడా ఉన్నాడు. ఆ వార్త మర్నాడు పతాక శీర్షికలకు ఎక్కింది. ఇరోమ్ షర్మిల తన తల్లి దగ్గరకు వెళ్లి, "ఇవాల్టి నుంచి దేశ ప్రజలందరికీ ఉపయోగ పడబోయే ఓ మహత్కార్యాన్ని నేనే తలకెత్తుకోబోతున్నాను. నన్ను ఆశీర్వదించు" అని కోరింది. ఆ మర్నాటి నుంచి ఆమె సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టా(ఏఎఫ్ఎస్‌పీఏ)నికి వ్యతిరేకంగా తన నిరవధిక నిరాహార దీక్ష ప్రారంభించింది. మూడు రోజుల తరువాత ఆమెను పోలీసులు అరెస్టు చేశారు.

ఇది జరిగిన కొద్ది రోజులకే అప్పటి ప్రధాని మన్మోహన్ సింగ్ పార్లమెంట్‌లో ఒక ప్రకటన చేస్తూ, ఈ చట్టం స్థానంలో మరో 'మానవీయ చట్టా'న్ని తీసుకురాబోతున్నట్టు వెల్లడించారు. అయితే, అప్పటి హోం మంత్రి పి. చిదంబరం ఆ తర్వాత పార్లమెంట్‌లో మరో ప్రకటన చేస్తూ, ఈ చట్టం మరో ఏడాదిపాటు యథాస్థితిలో కొనసాగుతుందని చెప్పారు. షర్మిల లాగానే తాను కూడా ఈ విషయంలో కొద్దిగా నిరుత్సాహపడ్డానని కూడా ఆయన తెలిపారు. ఇది ఇలా ఉండగా అప్పట్లో అవినీతి నిర్మూలన ఉద్యమాన్ని చేపట్టిన అన్నా హజారే నిరాహార దీక్ష చేస్తున్న షర్మిలను చూడడానికివెళ్లి, ఆమె ఉద్యమానికి, ఆమె దీక్షకు తనమద్దతు ప్రకటించారు. మణిపూర్‌లో సైనికుల ఆగడాలకు, అఘాయిత్యాలకు వ్యతిరేకంగా ఉద్యమం చేపట్టిన షర్మిలకు మీరా ఫైబిస్, అపుంబా లూప్ అనే మరో ఇద్దరు మహిళా ఉద్యమకర్తలు కూడా మద్దతునిచ్చారు. నిజానికి ఆ ఇద్దరు మహిళలు కూడా ఈ సైనిక ఆగడాలకు వ్యతిరేకంగానే ఉద్యమం ప్రారంభించారు.

## స్పందించని ప్రజానీకం

ఓ బాలీవుడ్ నటిని హాలీవుడ్ నటుడు ముద్దుపెట్టుకోవడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని దాఖలు చేయడానికి చూపించిన ఆసక్తిని చాలామంది షర్మిల విషయంలో చూపించలేదు. షర్మిలను చూడడానికి వీల్లేదంటూ భద్రతా దళాలు, పోలీసులు నిషేధించడాన్ని దేశంలో ఒక్కరంటే ఒక్కరు కూడా అడ్డుకోలేకపోయారు. "షర్మిల చుట్టూ ఉన్న గట్టి భద్రత మరీ పిచ్చెక్కిస్తోంది" అని హ్యూమన్ రైట్స్ అలర్ట్ అనే సంస్థకు చెందిన బబ్లూ లోయింగ్‌బామ్ వ్యాఖ్యానించారు. జయప్రకాశ్ నారాయణ్ చుట్టూ పెట్టినట్టు ఆమెకు కాపలా పెట్టారని ఆయన అన్నారు. "ఆమె ఎవరికీ హాని చేసే మనిషి కాదు. ఆమె చీమకు, ఈగకు కూడా అపకారం చేసే మనిషి కాదు. ఆమెకు కాపలా ఉన్న పోలీసులకు సైతం ఆమె అంటే ఎంతో గౌరవం" అని ఆయన వ్యాఖ్యానించారు.

ఇంతకూ ఈ చట్టం ద్వారా జరుగుతున్న మానవ హక్కుల ఉల్లంఘనల వివరాలు, బాధితుల వివరాలతో ఓ లిస్టు తయారు చేద్దామని 2000 సంవత్సరంలో ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఆ ప్రయత్నాల్లో షర్మిల కీలక పాత్ర పోషించారు. ఆ ప్రయత్నం ఓ కొలిక్కి వచ్చే లోపునే ఆమెను పోలీసులు అరెస్టు చేయడం జరిగింది. "మెర్సీ అనే గ్రామీణురాలిని మణిపూర్ సీఆర్‌పీ పోలీసులు దారుణంగా రేప్ చేసి చంపారు. ఆమె భర్తను, మావగారిని కట్టేసి, తుపాకి చూపెడుతూ ఈ దారుణానికి ఒడిగట్టారు. సైనికుల ప్రత్యేకాధికారాల చట్టం పనిచేసే తీరు ఇదీ" అని షర్మిల వివరించింది. ఈ సంఘటన ఆమెను మానసికంగా కుదిపేసింది. ఇటువంటి సంఘటనలకు సంబంధించిన పూర్తి సాక్ష్యాధారాలు, ప్రత్యక్ష్య సాక్షుల కథనాలు, ఇతర వివరాలను షర్మిల సేకరించింది. అయితే, ఈ చట్టాన్ని రద్దు చేయడానికి రక్షణ శాఖ ఏమాత్రం అంగీకరించడం లేదు.

షర్మిల శక్తిమంతమైన మహిళలున్న కుటుంబం నుంచి వచ్చింది. ఆమె తల్లికి ఆమె తొమ్మిదవ సంతానం. ఆమె నాయనమ్మ ఇరోమ్ తోన్సిజా దేవి 2008లో తన 105వ ఏట కన్నుమూసింది. 1939లో బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా మహిళలంతా పోరాటం జరిపినప్పుడు అందులో తోన్సిజా దేవి కీలక పాత్ర పోషించారు. షర్మిల తండ్రి నందో సింగ్ రాష్ట్ర పశు సంవర్ధక శాఖలో పనిచేస్తుండేవారు. 1989లో కేన్సర్‌తో మరణించారు. షర్మిల స్కూల్లో ఓ సగటు విద్యార్థి. ఆమెకు మహాత్మా గాంధీ, నెల్సన్ మండేలా, మార్టిన్ లూథర్ కింగ్ లంటే ఎంతో అభిమానం. 1990ల ప్రాంతంలో జర్నలిజం కోర్సు కూడా చేసిన షర్మిల అంధుల పాఠశాల, యువజనాభివృద్ధి మండలి వంటి వాటిలో పని చేసింది. అనేక సదస్సులు, గోష్ఠి కార్యక్రమాల్లో పాల్గొంది. 1998లో యోగా, ప్రకృతి వైద్యం నేర్చుకుంది. 2000 ప్రాంతంలో కొద్దికాలం హ్యూమన్ రైట్స్ అలర్ట్‌లో కూడా శిక్షణ పొందింది.

> **దీక్ష విరమించి రాజకీయ రంగ ప్రవేశ ప్రకటన చేసి పోరాటమార్గాన్ని సరికొత్త పంథాకు మళ్ళించారు షర్మిల. ఈశాన్య రాష్ట్రాల్లో, కశ్మీరులో అమలు చేస్తున్న సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం ఎప్పటికైనా రద్దు అవుతుందనే ఆత్మవిశ్వాసంతో ఉన్నారామె. జైలు గోడలమధ్యనే యవ్వనజీవితాన్ని కోల్పోయిన షర్మిల తన సుదీర్ఘపోరాటంలో ప్రభుత్వాన్ని కనీసం కదిలించగలిగిందా?**

## అహింసాయుత పోరాటం

ఆస్పత్రిలో ఒంటరిగా ఓ గదిలో ఉండే షర్మిల రోజు ఉదయమే యోగా చేస్తుంటుంది. నడవాలోనే కాసేపు వాకింగ్ చేస్తుంది. కవితలు రాస్తుంటుంది. పుస్తకాలు చదువుతుంటుంది. చదివిన ప్రతి పుస్తకాన్నీ ఇంఫాల్ పబ్లిక్ లైబ్రరీకి ఇచ్చేస్తుంది. గత పదహారేళ్ల కాలంలో కొన్ని వందల పుస్తకాలను లైబ్రరీకి ఇచ్చి ఉంటుంది. ఆస్పత్రిలోని జైలు వార్డులో కూర్చునే పత్రికలకు వ్యాసాలు రాస్తుంటుంది. ఆమెకు ఉత్తరాలు రాసేవాళ్లు కూడా ఉన్నారు. జాంజిబార్‌లో పుట్టి, గోవాలో పెరిగిన డెస్మండ్ కోటినో ఆమెకు తరచూ ఉత్తరాలు రాస్తూ దగ్గరయ్యాడు. ఈ ఏడాది మొదట్లో అభిమానంతో రాసిన ఉత్తరాలు ఆ తరువాత ప్రేమ లేఖలుగా మారిపోయాయి. ఆ తరువాత షర్మిల కూడా రాయడం మొదలుపెట్టింది. నిజానికి ఒకరినొకరు చూసుకోకుండానే వాళ్లిద్దరూ ప్రేమలో పడ్డారు. అతను ఇంఫాల్‌లో ఆమెను ఆస్పత్రిలో చూడడానికి వచ్చినప్పుడు చాలా మంది అతన్ని అనుమానించారు. ఆమెను ఉద్యమం నుంచి దూరంగా తీసుకువెళ్లిపోవడానికి ప్రభుత్వం పంపిన ఏజెంటుగా అనుమానించిన వాళ్లున్నారు. విచిత్రమేమిటంటే, ఇదే భయంతో ఆమె అభిమానులు, సాటి ఉద్యమకర్తలు అతన్ని ఒకపట్టాన ఆమెను చూడనిచ్చేవారు కాదు.



"ప్రభుత్వం ఆ కుటిల చట్టాన్ని రద్దు చేసిన తరువాత ఆమె ఇష్టం. ఎవర్ని పెళ్లి చేసుకున్నా మాకు అభ్యంతరం లేదు. కోటినో ఇవన్నీ పట్టించుకోకుండా వ్యవహరించడం మాకు బాగాలేదు" అని బబ్లూ వ్యాఖ్యానించాడు. అప్పటి నుంచి కోటినో తనకు తానుగా ఆమెకు దూరంగా ఉంటూ వచ్చాడు. తరచు ఆమెను కలుసుకోవడం వల్ల ఆమెకు ఇబ్బందులు ఏర్పడుతున్నాయని అతను భావించాడు. కోర్టు బయట ఆమెను ఓ మీడియా ప్రతినిధి ఓ ప్రశ్న అడిగాడు. "పదహారేళ్ల నుంచి నిరాహార దీక్ష చేస్తున్నారు. జైలులోనే యవ్వన జీవితమంతా అయిపోయింది. జీవితంలో ఏదైనా కోల్పోయానని మీరు మనసులో భావిస్తున్నారా?" అన్న ఆ ప్రశ్నకు ఆమె జవాబు చెబుతూ, "నేనేమీ కోల్పోలేదు. ప్రభుత్వంలో కదలిక తెచ్చాను. ఏదో విధంగా ఆ రాక్షస చట్టాన్ని రద్దు చేయించగలనని నాకు నమ్మకం ఉంది. ప్రభుత్వం ఆ చట్టాన్ని రద్దు చేయడం ఖాయం. దేశ ప్రజలు ఈ చట్టం గురించి అర్థం చేసుకున్నారు" అని అంది. నవ్య

13

శరత్‌చంద్ర

# సమంత@లవ్

సెల్: 98492 41286

**కారులో కూర్చుంటూ, "దినకర్, క్విక్. బావగారిని వెంటనే కలవాలి. నా అంచనా తప్పు కాకపోతే అతడు సూసైడ్ టెండెన్సీలో ఉండాలి. వెంటనే మనం కౌన్సెలింగ్ మొదలు పెట్టాలి" అంది అరుణ.**

**దినకర్ గొంతులో తడారిపోయింది.**

**"ఏంటి అరుణా నువ్వు చెప్పేది..." అన్నాడు దినకర్ ఆత్రుతగా.**

"అవును దినా! వారిద్దరిదీ డీప్ లవ్. ఒకరి కోసం మరొకరు చనిపోయేంత ప్రేమ ఉంది వాళ్ళకి. మనం ఇమీడియట్‌గా రియాక్ట్ కాకపోతే ఎవరో ఒకర్ని కోల్పోతాం" చెప్పింది అరుణ.

"అన్నయ్య...నాన్నను చూడడానికి మన ఊరు వచ్చాడు" చెప్పాడు దినకర్.

"అక్కడే ఆయన జీవితం చాలించినా ఆశ్చర్యం లేదు. సూసైడ్ టెండెన్సీలోకి రావచ్చు. కారు తీయండి.." ఆదేశించినట్టుగా అరిచింది అరుణ.

మరు నిమిషంలో దినకర్ స్వగ్రామం రాజోలు వైపు వారి వాహనం బయలుదేరింది. దారిలోనే జరిగిందంతా రమణకు చెప్పాడు దినకర్.

"నేనూ రానా?" అడిగాడు రమణ.

"వద్దు. క్యాజువల్‌గానే వెళ్ళాలి. అన్నయ్యను చిన్నగా మాటల్లో దింపాలి. కన్విన్స్ చేయాలి. కౌన్సెలింగ్ ఇవ్వాలి. తనని మభ్యపెడుతున్నామన్న ఫీలింగ్ వస్తే అన్నయ్య మరోలా రియాక్ట్ కావచ్చు. అంతే కదా అరుణా..." అన్నాడు దినకర్. అరుణ ఫోన్ తీసుకొని "రమణగారూ, మీరూ...సమీరా సమంతగారితో క్యాజువల్‌గా ఉండండి. ఆమెకి సపోర్టివ్‌గానే ఉండండి. శ్రీకర్ బావ ఊరెళ్ళారన్న డిప్రెషన్‌లో ఉంటుంది. తనని మామూలు మూడ్‌లో ఉంచేందుకు ప్రయత్నించండి" అంది.

"ఓకేనమ్మా..." చెప్పాడు రమణ.

•••

సడన్‌గా మరదలు, తమ్ముణ్ణి చూసి సర్‌ప్రైజ్

**జరిగిన కథ**

పెళ్ళి, తాళి వ్యవస్థపై నమ్మకంలేని సమంత, ప్రియుడు శ్రీకర్‌తో సహజీవనం అగ్రిమెంట్ చేసుకుంటుంది. ఒక బిడ్డను కని తన తండ్రి కోర్కె తీర్చమంటాడు శ్రీకర్. అందుకు తిరస్కరించి, అతన్ని మరో వివాహం చేసుకోమంటుంది. అతడి క్షేమం కోరుకుంటుంది. అతడికి దూరంగా వెళ్ళిపోవాలనుకుంటుంది. వయసుమళ్ళిన కంపెనీ బాస్‌తో సహజీవనానికి ఒప్పుకుని అతడితో అమెరికా వెళ్ళే ప్రయత్నాలు ప్రారంభిస్తుంది. కానీ సమంతను అమెరికా వెళ్ళనీయకుండా అడ్డుకుని, శ్రీకర్‌తో ఆమె కాపురం నిలబెట్టాలని స్నేహితులు తమ ప్రయత్నాలు ముమ్మురం చేస్తారు. సమంత కూడా అంతే తీవ్రంగా ప్రయత్నాలు చేస్తుంది. ఆ తర్వాత..



అయ్యాడు శ్రీకర్. "అరే, మీరూ వచ్చారా?" అన్నాడు నవ్వుతూ శ్రీకర్.

"అవును అన్నయ్యా! పెద్దోడు వచ్చాడు, మీరు కూడా ఒకసారి వచ్చిపోండ్రా...అన్నాడు నాన్న" చెప్పాడు దినకర్.

"నేనెప్పుడు పిలిచాన్రా?" అన్నట్టు చూశాడు సుధాకర్ రావు. దినకర్ కళ్ళతోటే తండ్రికి సైగ చేశాడు. ఏదోలే తుంటరి అబద్ధం ఆడుతున్నాడని సీరియస్‌గా తీసుకోలేదు సుధాకర్ రావు. కొడుకుతో అరుణ కూడా రావడం చూసి "అరుణా, బావున్నావామ్మా!" అడిగాడు సుధాకర్ రావు.

"బావున్నాను మావయ్యా" చెప్పింది.

"అరుణక్కూడా రెండ్రోజులు లీవు దొరికింది. ఒకటే బోర్ కొడుతోందంటే తీసుకొచ్చా" చెప్పాడు దినకర్.

అలిశమ్మ కళ్ళు చాటంత చేసుకొని "మీ అన్నదమ్ములిద్దర్నీ ఒక్కసారి చూస్తుంటే క్రిస్మస్ పండగ వచ్చినట్టు ఉందిరా" అంది.

"సర్లేవే...వీళ్ళకి మంచి కూర చేయవే" అన్నాడు సుధాకర్ రావు.

"నీ పెద్దకొడుక్కి గోంగూర మాంసం ఇష్టం. చిన్నకొడుక్కి ఎండు రొయ్యలూ గోంగూర ఇష్టం. మాంసమంటే దొరుకుతుంది. ఎండురొయ్యలు ఎక్కడ పట్టాలి?" ఆలోచనల్లో పడింది అలిశమ్మ.

"ఒకసారి మార్కెట్‌కి వెళ్ళిరావే" చెప్పాడు సుధాకర్ రావు.

"ఎంతసేపు...పది నిమిషాల్లో వచ్చేస్తా" అని బయలుదేరింది.

అందరూ కబుర్లలో పడ్డారు. ఈ ఆనంద సమయంలో సమంత కూడా ఉంటే బావుండేదని అనిపించింది శ్రీకర్‌కి. తనకు బిడ్డల్ని కనక పోయినా పర్వాలేదు. తన దగ్గరే ఉండిపోతే ఎంత బావుండేది అనిపించింది.

బావ ఏదో ఆలోచిస్తున్నాడని అర్థమై టాపిక్ డైవర్ట్ చేసింది అరుణ. "బావగారూ, మావయ్యగారి ఫుడ్ కంట్రోల్ గురించి కనుక్కున్నారా?" అడిగింది.

"నాన్న వినరుగా! 'ఒక్క కాయకు ఏమవుతుందిలేరా' అని నిన్న కూడా మామిడి పండు తిన్నారు. దానివల్ల షుగర్ లెవల్స్ పెరుగుతాయి కదా...ఏంరా దినా?" అడిగాడు.

"అవును. ఏంటి నాన్నా, నువ్వేమైనా చిన్న పిల్లాడివా? అసలే హార్టు ప్రాబ్లమ్ ఉంది. దానికి తోడు కిడ్నీ ప్రాబ్లమ్ కూడా రావాలా?" అన్నాడు కాస్త దబాయిస్తున్నట్టుగా.

"కిడ్నీ ప్రాబ్లమ్ ఎందుకొస్తుందిరా?" అడిగాడు సుధాకర్ రావు.

"షుగర్ పెరిగితే కిడ్నీ కూడా పాడవుతుంది నాన్నా! అందుకే నోరు కట్టేసుకోవాలి" చెప్పాడు దినకర్.

భోజనాలు పూర్తయిన తర్వాత అందరూ పెరటి దొడ్లో కూర్చున్నారు. కాస్త దూరంలో లేగ దూడ ఒకటి తల్లి కోసం ఏడుస్తోంది. "పాపం విడిపించండ్రా దాన్ని" ఎవరో అంటున్నారు.

"విడిస్తే పాలన్నీ తాగేస్తుంది. కేంద్రానికి ఏం పోస్తావ్?" అంటున్నాడు మరో వ్యక్తి.

అటుగా వెళ్ళేవాళ్ళంతా ఇద్దరు అన్నాతమ్ములనూ పలకరించి వెళుతున్నారు. దినకర్ చిన్ననాటి జ్ఞాపకాలు వల్లె వేస్తున్నాడు.

"చిన్నప్పుడు ఈతకు వెళ్ళేవాణ్ణి. అన్నయ్య తన్నేవాడు. 'నన్ను తన్నడం కాదు, చేతనైతే నేర్చుకో' అనేవాణ్ణి."

"నీళ్ళతో చెలగాటమేంట్రా" అని కేకలేసేవాడు.

"చెలగాటమే అనేవాణ్ణి మొండిగా. తర్వాత తనే రాజీకొచ్చి 'ఒరేయ్ దినా, సర్పంచ్ కొడుకు ఈతకెళ్ళే కదా చనిపోయింది. వద్దురా' అనేవాడు. అన్నయ్యది భయం కాదు ప్రేమ అని అర్థమైంది. అందుకే అప్పుడు మాట ఇచ్చా. సర్లే అన్నయ్యా ఈతకెళ్ళనని. ఇప్పటి వరకూ మళ్ళీ వెళ్ళలేదు" నవ్వుతూ చెప్పాడు దినకర్.

"మొన్న హెల్త్‌క్లబ్ స్విమ్మింగ్ పూల్ ఓపెనింగ్‌కి వెళ్ళినా, ఈతకొట్టలేదు అందుకేనా.." అంది అరుణ కూడా నవ్వుతూ. అంతలో సుధాకర్ రావు అక్కడికి వచ్చాడు.

"రండి మావయ్యా" అంది అరుణ మంచం పైన జరుగుతూ.

"దినాకి వాడి అన్నయ్య చెప్పాడంటే అది సుగ్రీవాజ్ఞే. మనం ఎన్ని చెప్పినా వినడు. వాడు చెబితే ఓకే అంటాడు. ఇంటర్లో కూడా ఎంపీసీ తీసుకుంటానన్నాడు. నేను బైపీసీ తీసుకోరా... నువ్వు డాక్టరు కావాలని మీ అమ్మ కోరిక అని బ్రతిమాలాను. ససేమిరా వినలేదు. వీడికి చెప్పా. వీడు చాలా గంభీరంగా. "రేయ్ దినా, నేను ఎంపీసీ తీసుకొని ఇంజనీర్ అవుతున్నా కదా! నువ్వు బైపీసీ తీసుకో! అమ్మ లక్ష్యం నెరవేరుతుంది కదా" అన్నాడు. అప్పటిదాకా ససేమిరా అన్నవాడు కిక్కురుమనలేదు. "వీడి టోటల్ కంట్రోల్ వాళ్ళన్నయ్యే" ఆనందంగా చెప్పుకు పోతున్నాడు సుధాకర్ రావు.

నవ్వింది అరుణ.

"అన్నచాటు తమ్ముడన్న మాట.." అంది అల్లరిగా దినకర్‌ని చూస్తూ.

"అవును! ఇప్పుడు అన్నయ్య నిన్ను వదిలేయమని చెపితే చాలు, నిమిషంలో వదిలేస్తా.."



అన్నాడు దినకర్ నవ్వుతూ.

"రేయ్ దినా, అలా మాట్లాడకు, తప్పు" అన్నాడు శ్రీకర్ మందలిస్తున్నట్టు.

అరుణ వెంటనే "అదేం లేదులే బావగారూ, ఆయన నన్ను వదిలినా నేను ఆయన్ని వదలనుగా. వదల బొమ్మాళీ వదలా..." అన్నది నవ్వుతూ.

"ఒసేయ్ అరుణా, గత జన్మలో నాతో కాపురం చేసి అరవైయేళ్ళుగా కుళ్ళబొడిచిన నువ్వు...ఈ జన్మలో కూడా నా భార్య అయ్యావా..?" అన్నాడు దినకర్ అరుంధతి సినిమాలో పశుపతి క్యారెక్టర్ని అభినయిస్తూ.

నవ్వింది అరుణ.

"మా దినకర్ మంచి మిమిక్రీ ఆర్టిస్టు. మా నాన్న కళ్ళుగప్పి సినిమాలకు వెళ్ళేవాళ్ళం. నేను మాత్రం మౌనంగా ఉంటే వీడుమాత్రం సినిమా డైలాగులు చెప్పి దొరికిపోయేవాడు. దాంతో బెత్తం తీసేవాడు నాన్న" చెప్పడం ఆపాడు శ్రీకర్.

"అన్నయ్య అడ్డుగా వచ్చి, నా మీద పడే దెబ్బల్ని తను భరించేవాడు" చెప్పాడు దినకర్ అన్న కళ్ళలోకి చూస్తూ.

"అయితే బావగారు త్యాగయ్య అన్నమాట" అంది నవ్వుతూ.

పిల్లలు సరదాగా మాట్లాడుతూ ఉంటే "చీకటి పడకముందే లోపలికి రండి" అంటూ లోనికి నడిచాడు సుధాకర్ రావు.

"తమ్ముడు డాక్టరు కావాలని అమ్మ ఎందుకు కోరుకుందో తెలుసామ్మా....నేను ఐదో తరగతిలో ఉండగా అమ్మకి కేన్సరని తెలిసింది. తను ఇక ఎక్కువ కాలం బ్రతకదని అర్థమైన తర్వాత మన ఇంట్లో ఒక్కడన్నా డాక్టరు కావాలిరా అంటూ ఉండేది. వీడికేమో నన్ను ఫాలో కావడం అలవాటు. నేను ఎంపీసీ తీసుకున్నానని వీడు దాన్నే తీసుకోవాలనుకున్నాడు. ఎనీహౌ మా దిన డాక్టరయ్యాడు. మా అమ్మ కోరిక తీర్చాడు. బంగారం లాంటి నిన్ను భార్యగా పొందాడు" చెప్పాడు శ్రీకర్ అరుణను చూస్తూ తృప్తిగా.



**పుట్టినప్పటి నుండీ మరణించేవరకు మన కనుగుడ్డు సైజులో ఎదుగుదల ఉండదు.**

"సమంతక్క అందం, గుణంతో పోల్చుకుంటే నాలాంటి లక్షమంది కూడా దిగదుడుపే! అందరూ నన్ను అందగత్తె అంటారు కానీ, అలా అనే వాళ్ళందరికీ ఒక్కటే సమాధానం. మా అక్కని చూడండి అని చెబుతాను" అంది అరుణ నవ్వుతూ.

"అందుకే కదా అన్నయ్యకి వదినంటే అంత ప్రాణం..." అందుకున్నాడు దినకర్.

"బయటకు కనిపించే అందంకన్నా లోపల ఉండే ఆమె హృదయం ఎంతో అందమైందిరా. పేదల పట్ల ఆమె కన్సర్న్ ట్రెమండస్. జీతంలో పైసా దాచుకోదు. తను మంచి నీళ్ళు తాగైనా, అవతలి వాడికి భోజనం పెట్టాలని చూస్తుంది" సమంత గురించి మురిపెంగా చెప్పుకుపోతున్నాడు శ్రీకర్.

**బంధాన్ని తెగతెంపులు చేసుకుని అమెరికా వెళ్ళిపోవాలన్న ఆమె కోరిక ఫలించడానికి ఇంకా నెలరోజులు గడువుంది. ఆమె నిర్ణయాన్ని భరించలేకపోయాడా తాత్కాలిక భర్త. అతడిలో సూసైడ్ టెండెన్సీ బయలుదేరింది. ఒక మానసిక వైద్యురాలు అది గమనించింది. మరింతకీ ఆత్మహత్య బారినుండి ఆ వైద్యురాలు అతన్ని కాపాడగలిగిందా?**

"మీరు అదృష్ట జాతకులు బావగారూ! అందుకే అక్కయ్యలాంటి మానవతామూర్తి దొరికింది" మనస్ఫూర్తిగా ప్రశంసించింది అరుణ.

"మానవతామూర్తే కానీ, నా మీద దయ లేకుండా పోయిందమ్మా.." ఏదో ట్రాన్స్‌లో ఉండి చెప్పాడు.

"ఏమైంది బావగారూ..." అప్పుడే తెలిసినట్టు అడిగింది అరుణ. యుఎస్ పర్యటన...కర్కరేతో వెళ్ళాలనుకోవడం అంతా చెప్పేశాడు. నవ్వింది అరుణ.

"మిమ్మల్ని తను ఆట పట్టిస్తోంది. మిమ్మల్ని విడిచి క్షణం కూడా తను బ్రతకదు. పిల్లలు కావాలంటున్నారని ఒక ఝలక్ ఇస్తోంది, అంతే" చెప్పింది అరుణ.

శ్రీకర్ చిన్న పిల్లాడిలా "అంతేనంటావా?" అడిగాడు.

"అవును" అంది.

"అసలు నాకు పిల్లలే అవసరం లేదు. సమంత ఉంటే చాలు" పసిపిల్లాడిలా అనేశాడు శ్రీకర్.

"తనని మరింత ప్రేమించండి. ఆ ప్రేమలో ముంచెత్తండి. తన ఆటకు తెరవేస్తుంది" చెప్పింది అరుణ.

అయోమయంగా చూశాడు శ్రీకర్. ఆమె మాటలు అతడి మనసుపైన ప్రభావం చూపుతున్నాయి.

"మరి, కర్కరే ప్రయత్నాలు...అతడితో ఉండేందుకు ఒప్పుకోవడం ఇదంతా ఏమిటి?" అడిగాడు.

"వంద సంవత్సరాలు తపస్సు చేసినా, ఆమె కాలి గోరును కూడా అతడు తాకలేడు. ఒక్కసారి ఆడపిల్ల మనసు ఇస్తే, ఇక అతణ్ణి తప్ప వేరే ఎవర్నీ దగ్గరకు రానివ్వదు" స్థిరంగా చెప్పింది అరుణ.

దినకర్ భార్య వైపు అభినందనగా చూశాడు. అన్న ముఖంలో వస్తున్న మార్పు అతడికి సంతోషాన్నిచ్చింది.

ఆత్మవిశ్వాసం నింపుకొని శ్రీకర్ హైదరాబాద్‌కి, దినకర్, అరుణలు విజయవాడకు బయలుదేరారు. వెళ్ళే ముందు నవ్వుతూ అత్త అలిశమ్మతో శ్రీకర్ వినేలా అన్నాడు దినకర్. "అత్తా, వచ్చే ఏడాది నా కొడుకుతో నీ ఇంటికి వస్తా" అన్నాడు.

"అంత సంతోషమా నాయనా ..." అంది. సుధాకర్ రావు కూడా వింటున్నాడు.

"అవును అత్తా! సైన్సు ఎంతో అభివృద్ధి చెందింది. టెస్ట్‌ట్యూబ్ విధానం ద్వారా మాకు పిల్లలు పుడతారు" చెప్పాడు దినకర్.

శ్రీకర్ ముఖం కూడా వెలిగింది. "మన వంశం నిలవాలి...." మనసులోనే అనుకుంటూ పైకే అనేశాడు సుధాకర్ రావు.

•••

ఊరు నుంచి వచ్చిన శ్రీకర్‌ని అడిగింది సమంత "మీ నాన్నగారు ఎలా ఉన్నారు?"

"బావున్నారు. దిన వాళ్ళు కూడా వచ్చారు. నువ్వు వచ్చి ఉంటే బావుండేది" అన్నాడు.

"చెబితే వచ్చుండేదాన్ని. ఒక్కరోజులో తిరిగి వచ్చేస్తారనుకున్నాను. మూడు రోజులు గడిపేశారు.." అంది ఆరోపణగా.

"నా కోసం ఎదురు చూశావా?" అడిగాడు ఆశగా.

"నాకిక ఇక్కడ ఎవరున్నారు? ఒకరోజు సమీర, రమణ వచ్చారు భోజనానికి" చెప్పింది.

"అవునా? మంచి పని చేశారు. మరి నాకు చెప్పలేదే" అడిగాడు.

"రమణే నీ ఫోన్‌కి ట్రై చేశాడు" చెప్పింది.

"టవర్స్ సిగ్నల్స్‌ని సరిగ్గా రిసీవ్ చేసుకుంటున్నట్టు లేదు" అన్నాడు శ్రీకర్.

శ్రీకర్ మామూలుగా ఉండడం సమంతకు కాస్త సంతోషమనిపించింది. రాత్రి భోజనాలు చేశాక "స్లీప్ విత్ మీ" అడిగాడు గోముగా.

"ఓకే" అంది సమంత.

అతడితో మూడురోజుల ఎడబాటు ఆమెకి కూడా ఏదోలా ఉంది. పైగా ఉన్నంతకాలం అతణ్ణి సంతోష పెట్టాలన్న నిర్ణయంతోనే ఉంది.

ఆ రాత్రి తెల్లవార్లూ అతడు సమంతను నిద్ర పోనివ్వలేదు. "రేపు డ్యూటీకి వెళ్ళనీయవా?" అడిగింది.

"నో డ్యూటీ.." అన్నాడు మళ్ళీ ఆమె మీదకు వస్తూ. అతడి హుషారు ఆమెకి కూడా సంతోషాన్నిచ్చింది.

"ఈ జోరు ఇలాగే కొనసాగిస్తే సంవత్సరానికి ఇద్దరు ట్విన్స్‌ని కనాల్సి వస్తుందేమో, పిల్స్ వాడకపోతే" అంది నవ్వుతూ.

"నాకు పిల్లలు వద్దు. నువ్వు కావాలి" అన్నాడు నగ్నంగా ఉన్న ఆమె గుండెలకు ముఖాన్ని రుద్దుతూ.

"వంశం నిలపాలి కదా.." అంది క్రీగంట నవ్వుతూ.

"సర్లే, అల్లరి చాలించు" అని మరింత హత్తుకున్నాడు. ఇక అతణ్ణి ఆపడం తన వల్ల కాదనుకొని మరింతగా అల్లుకుపోయింది సమంత.

తెల్లవారుజామున ఐదు గంటలకు పడుకుంటే ఉదయం పది గంటలకి మెలకువ వచ్చింది. శ్రీకర్ ఇంకా లేవలేదు. పైకి లేస్తూ ఉంటే ఆమె సెల్ వైబ్రేషన్ వినిపించింది. ఫోన్ చేతికి తీసుకుంది.

పద్నాలుగు మిస్డ్ కాల్స్ ఉన్నాయి. అవి కర్క రేవి. లైవ్‌లో ఉన్న కాల్ కూడా అతడిదే.

"ఒంట్లో బావోలేదు. ఒక రోజు లీవు కావాలని" కోరుతూ ఎస్ఎంఎస్ ఇచ్చి సెల్ ఫోన్ స్విచ్ఛాఫ్ చేసింది.

●●●

కర్కరే మూడవుట్‌లో ఉన్నాడు. ఆరోజు ఉదయం నుంచీ అన్నీ అపశకునాలే ఎదురవుతున్నాయి. ఉదయాన్నే ఈ-మెయిల్ చెక్ చేసుకుంటే మెల్కోటే పంపిన లెటర్ కనిపించింది. "మరో నెల తర్వాతే మీరు యుఎస్‌కి వెళ్ళే విషయంలో హెడ్ ఆఫీస్ నిర్ణయం తీసుకుంటుంది" అన్న సమాచారమది. షిట్ అంటూ తల విదిల్చాడు.

ఉదయం నుండీ ఫోన్ చేస్తే సమంత ఫోన్ లిఫ్ట్ చేయలేదు. ఇరవైరెండోసారి ఆరోగ్యం బావో లేదని ఎస్ఎంఎస్ ఇచ్చి సెల్ స్విచ్ఛాఫ్ చేసింది. "ఇంత ఓవర్ ఫ్యాట్ ఉన్న ఆడది రేపు యు ఎస్‌లో మాత్రం ఏం సహకరిస్తుంది" తల కొట్టు కున్నాడు. ఇక్కడ ప్రమోషన్ వదులుకొని, బ్రైట్ ఫ్యూచర్‌ని వదులుకొని సబ్ జూనియర్‌గా యుఎస్ వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు. మరి సమంత ఏమిటి ఇలా? ఇంతా చేస్తే..మెల్కోటేగాడు నెల రోజులు వాయిదా వేశాడు. ఈ బ్రాంచి టర్నోవర్ పెంచడానికి రాత్రింబవళ్ళూ కష్టపడ్డాడు తను. ఆఫ్టాల్ చిన్న ఫేవర్. ఇది కూడా చేయలేక పోయాడా? ఆ రోజు మెల్కోటే పిలిచి మాట్లా డిన మాటలు గుర్తుకు వచ్చాయి.

"మిస్టర్ కర్కరే... మీలాంటి ఎఫిషియంట్ ప్రాజెక్ట్ మేనేజర్‌ని ఏ కంపెనీ వదులుకోదు. కానీ కంపెనీకి మీరు చేసిన సర్వీసును దృష్టిలో పెట్టుకొని మీ రిక్వెస్ట్‌ని యాక్సెప్ట్ చేస్తున్నాను. కానీ ఒక కండిషన్. పద్నాలుగు సంవత్సరాలుగా ఇక్కడ కంపెనీ కోసం మీరు చేసిన సర్వీసు యుఎస్‌కి వెళితే జీరో అవుతుంది. దానికి సిద్ధ మేనా?" అడిగాడు. ఒక్కసారిగా నేల కుంగిపో యింది. పెళ్ళీ పెటాకులు లేకుండా చేసిన సేవ ద్వారా వచ్చిన గుర్తింపు, అడిషనల్ పే వదులు కోవడం నిజానికి ఫైల్డిష్. కావాలనుకుంటే లక్షో... రెండు లక్షలో పడేస్తే అద్భుత సౌందర్యరాశులు తన కౌగిట్లో వాలతారు. దాహం తీర్చుకున్నానని పించుకోవచ్చు. కానీ సమంతపై తనకున్న దాహం ఒక్కరోజు.. ఒక్కరాత్రిలో తీరేది కాదు. జీవిత కాలం కావాలి. ఊపిరి ఉన్నంత వరకూ కావాలి. ఎంత రిస్క్ అయినా తీసుకోవాలి. ఆ నిర్ణయానికి వచ్చి "ఓకే సార్" అని చెప్పాడు.

మెల్కోటే నవ్వుతూ..."ఆఫ్టాల్ ఒక ఆడపిల్ల కోసం ఇంత బ్రైట్ ఫ్యూచర్ వదులుకుంటావా? ఆర్ యూ మ్యాడ్..." దరిదాపు కాస్త గద్దిస్తు న్నట్టుగానే అడిగాడు.

"తను ఆఫ్టాల్ కాదు సర్...నా డ్రీమ్. సుందర స్వప్నం" భావోద్వేగంతో చెప్పాడు కర్కరే.

"ఆ అమ్మాయి, వాడెవడో శ్రీకర్ అనే మన మాజీ ఎంప్లాయ్‌తో ఉంటోందట కదా? వాడు పిప్పి చేసేంతర్వాత నువ్వు తీసుకెళ్ళి ఏం చేసు కుంటావ్ కర్కరే" నిరాశ పరచాలని ప్రయత్నిం చాడు మెల్కోటే.

"తను పిప్పి కాదు సర్...అమృతభాండం! ఒక్క రోజు తనతో ఉండి చనిపోయినా జీవితం వృథా కాదు" భావావేశంతో చెప్పుకుపోయాడు కర్కరే.

"నా పిచ్చి కుదిరింది, తలకి రోకలి చుట్టండి' అన్నాడట నీలాంటి వాడొకడు. ఎనీహౌ, నీ ఖర్మ! నేను హెడ్ ఆఫీసుకు వెళ్ళిన తర్వాత నీకు అప్రూవల్ మెయిల్ ఇస్తా..." చెప్పి వెళ్ళాడు మెల్కోటే.

"సార్..?" అన్వర్ పిలుపుతో లోకంలోకి వచ్చాడు కర్కరే.

"ఏంట్రా...ఏమిటి నీ నస? నీకు హోంలోన్ శాంక్షన్ అయింది గదా. ఆపు ఇక నీ గస" అన్నాడు డిజప్పాయింట్‌మెంట్‌తో.

"అది కాదు సర్...మీకొక ఇన్ఫర్మేషన్" అన్నాడు నసుగుతూ.

"ఏంటో చెప్పి చావు.." అన్నాడు కోపంగా కర్కరే.

"ఈరోజు సమంతమ్మగారు రావడం లేదని లెటర్ పంపారు" చెప్పాడు.

"ఆ పెద్ద పొడిచావ్‌లే. అదో పెద్ద సమా చారం. ఆమె ఎస్ఎంఎస్ కొట్టి గంటయింది" అన్నాడు కోపంగా.

"అది కాదు సర్...ఇంకో సమాచారం కూడా ఉంది" చెప్పాడు అన్వర్.

"ఏమిటో చెప్పి ఏడువ్.." అన్నాడు కోపంగా.

"సమీర గారు నన్ను చూసి నవ్వారు.."

కర్కరే లేచి అన్వర్ చెంప ఛెళ్ మనిపించాడు. "ఆమె నిన్ను చూసి నవ్వితే నాకొచ్చే లాభమేంటి?" అన్నాడు కోపంగా.

"మరదే సార్. మీకు కోపం ఎక్కువ, విషయం తక్కువ" లోపల గొణుక్కున్నాడు.

"మరి చెప్పి చావు..నీ సమాచారమేమిటో"

"ఆ నవ్వులో ఏదో గూఢార్థం ఉంది సర్..." అన్నాడు తన ముఖం కర్కరే ముఖానికి దగ్గ రగా పెట్టి.

కర్కరే మెదడు పాదరసంలా పనిచేసింది. ఎక్కడో ఏదో తగులుతోంది. "ఎస్..." అన్నాడు కాస్త పెద్దగా.

"అదే సర్...ఆ క్లూ ఇవ్వడమే నా సమా చారం సర్" అన్నాడు అన్వర్.

"సారీ రా.." అన్నాడు కర్కరే.

"పర్వాలేదు సార్. మీరు కాక నన్ను కొట్టే వెధవ ఇక్కడ ఎవడున్నాడు? అయినా నా హోం లోన్ శాంక్షన్ అయినప్పట్నించీ నేను మీ భక్తుణ్ణి అయిపోయాను సర్. ఆఫీసులో చీమ చిటుక్కు మన్నా ఆ చప్పుడు మీకు వినిపిస్తా." చెప్పాడు గొప్పగా.

"చెప్పింది చాలు గానీ, ఆ సమీర దగ్గర ఏదైనా మేటర్ ఉందేమో పట్టుకురా...వెళ్ళు..." పురమాయించాడు.

●●●

మర్నాడు సమంత రాగానే ఛాంబర్‌లోకి పిలిచాడు కర్కరే. "నిన్న మీరు ఫోన్ తీసి ఉంటే బావుండేది" అన్నాడు కంప్లయింట్‌గా.

"ఏమైంది సర్.." అడిగింది.



## నా తీరు మారదు

నిత్యామీనన్ మీద వచ్చినన్ని పుకార్లు బహుశా మరే హీరోయిన్ మీదా వచ్చి ఉండవేమో! ఆమెకు తలపొగరనీ, ఎవరినీ లెక్కచేయదనే పుకార్లు ఎప్పటి నుంచో ఉన్నవే! ఇవి కాకుండా లవ్ ఎఫైర్ల మీద కూడా అడపాదడపా వస్తూనే ఉంటాయి. మొన్నామధ్య కన్నడ యాక్టర్‌తో ప్రేమాయణం నడుపుతోందనీ, త్వరలోనే వీరిద్దరూ పెళ్ళి చేసుకో బోతున్నారన్న వార్తలు బాగానే హల్‌చల్ చేశాయి. తాజాగా, హీరో సల్మాన్ దుల్కర్‌తో ప్రేమాయణం నడుపుతోందనీ, నిత్య కారణంగా ఆ హీరో కాపు రంలో చిచ్చు రగిలిందనీ, ఆ హీరోగారింట్లో తరచూ గొడవలు జరుగుతున్నాయనీ అంటున్నారు తమిళ తంబిలు. వీటి మీద కాస్త ఘాటుగానే స్పందిం చింది నిత్య. నా విషయంలో ఎవరేమనుకున్నా నాకు లెక్కలేదు. ఎవరినీ లెక్క చేయవలసిన అవసరం నాకు లేదు అని స్పష్టం చేసింది. అంతే తప్ప సల్మాన్ దుల్కర్‌తో ప్రేమ వ్యవహారం నడ పడం లేదని మాత్రం చెప్పకపోవడంతో ఈ ఎఫైర్ వార్తలు నిజమే అంటున్నారు తమిళ తంబిలు.

"బ్యాడ్ న్యూస్. మనల్ని యుఎస్‌కి పంపే విషయంలో మెల్కోటేగారు, తన నిర్ణయాన్ని మరో నెల రోజులు వాయిదా వేశాడు" చెప్పాడు కర్కరే నిస్పృహగా .

"ఇందులో ఆందోళన పడాల్సింది ఏముంది సర్.." అంది సమంత చాలా క్యాజువల్‌గా.

"నీకు ఆందోళన లేదా?" అడిగాడు మరింత ఆశ్చర్యపోతూ కర్కరే.

"నెల కాకపోతే మరో నెల తీసుకోమనండి సర్. నిర్ణయం ఎప్పుడు తీసుకున్నా అది మనకు అనుకూలంగానే ఉంటుంది" ధీమాగా, ధైర్యంగా చెప్పింది సమంత.

సమంత ఆత్మవిశ్వాసాన్ని మెచ్చుకున్నాడు కర్కరే. నిజానికి అతడికి తొందరగా ఉంది. సమంతతో ఎగిరిపోయే రోజు కోసం చకోరమై ఎదురు చూస్తున్నాడు. ఆమె సాన్నిహిత్యంలో గడపాలని తపన పడుతున్నాడు. అది వాయిదా పడడం అతడికి తీవ్ర నిరాశగా ఉంది. ఆలస్యమయ్యే కొద్దీ...సమంత మనసు మారుతుందేమో అన్న




ఆదుర్దా ఉంది. దాన్ని పటాపంచలు చేస్తూ..

"మీరు వర్రీ కాకండి సర్. శ్రీకర్‌తో బంధం తెంచుకోవడానికి నేను సిద్ధమైపోయాను. దాన్లో ఎలాంటి మార్పు లేదు. నన్ను అభిమానించే మీలాంటి వారితో నా భవిష్యత్తు ఆనందంగానే ఉంటుందన్న విశ్వాసం నాకుంది. మిమ్మల్ని సంతోష పెట్టేందుకు ప్రయత్నిస్తాను" మన స్ఫూర్తిగా అంది సమంత.

"థాంక్యూ సమంతా..." చప్పున లేచి ఆమె చేయి పట్టుకున్నాడు.

సమంత సున్నితంగా చేతిని వెనక్కి తీసుకుంది. "వస్తాను సర్.." అని తన క్యాబిన్ వైపు నడిచింది. అప్పటికే సమంత క్యాబిన్‌లో కూర్చొని ఆమె కోసం ఎదురు చూస్తోంది సమీర.

"ఏంటే...వర్క్ లేదా?" అడిగింది.

"లేకుండా ఎందుకు ఉంటుంది? కర్కరే సాబ్ డిజప్పాయింట్ అయ్యారా?" అడిగింది నవ్వుతూ.

"మీరెన్ని వేషాలు వేసినా నన్ను, శ్రీకర్‌ని కలిపి ఉంచలేరు. టైమ్ వేస్ట్ చేసుకోకండి" అంది సమంత.

"సర్లే, ముందు ఈ విషయం చెప్పు. కర్కరే సర్ అడ్వాంటేజ్ తీసుకుంటే నువ్వు పాజిటివ్‌గా మూవ్ అవుతావా?" అడిగింది.

చురుక్కున చూసింది సమంత.

"ఎలాగూ అతడితో ఉండబోతున్నావ్ కదా... అందుకు" అంది సమీర నీళ్ళు నములుతూ.

"అన్ని ప్రశ్నలకూ జవాబులు ఉండవు. కొన్ని వెండితెర మీద చూడాల్సిందే" అని "సర్లే హాస్పిటల్‌కి వెళ్తున్నావా?" అడిగింది సమీర కడుపు వైపు చూస్తూ.

"ఏం హాస్పిటలో ఏమో! నాకు.. మా ఆయనకి..నా కొడుక్కి నీ గురించి ఆలోచించడంతోనే కాలం గడిచిపోతోంది" అంది దిగులుగా కడుపు తడుముకుంటూ.

"సారీ! ఎంత ఒక నెలేగా..వర్రీ కాకండి" అంది.

"రాక్షసీ..." అని కోపంగా విసురుగా లేచింది సమీర.

చప్పున సమీర పడిపోకుండా పట్టుకుంది సమంత.

"ఈ జాగ్రత్తలన్నీ శ్రీకర్ మీద చూపించు" అంది కోపంగా.

"అతడూ, అతడి వంశం నిలబడాలన్నదే కదా నా తపన" అంది.

"నిన్ను మార్చడం నా తరం కాదు.." అంది తలకొట్టుకుంటూ.

సమీర వెళ్ళిన తర్వాత ఆమె సంధించిన ప్రశ్న గుర్తుకు వచ్చింది సమంతకు. కొద్ది రోజుల క్రితం కర్కరే చేసిన ప్రపోజల్ గుర్తుకు వచ్చింది.

"సమంతా...నీతో కనీసం రెండు మూడు గంటలు ఏకాంతంగా గడపాలని ఆశ పడుతున్నా" చెప్పాడు.

అతడి వైపు నిర్లిప్తగా చూసి, "సారీ సర్. భవిష్యత్తులో ఎలాగూ మీతోనే ఉంటాను కదా.." అంది.

కర్కరే నిరాశగా చూశాడు.

ఆమెకి తెలుసు మగాడి ఏకాంతం ఎక్కడికి దారితీస్తుందో! కర్కరే తాకిన తర్వాత ఆ దేహాన్ని శ్రీకర్ ముట్టుకోవడం ఆమె ఊహించలేకపోయింది. ఇక్కడ ఉన్నంత వరకూ శ్వాస కూడా శ్రీకర్ కోసమే అన్న స్థిర నిర్ణయంతో ఉంది. క్రితం రాత్రి శ్రీకర్ వేగం గుర్తుకు వచ్చిందామెకి. ఈ మధ్యకాలంలో ఎప్పుడూ అంత సంతోషంగా అతడు గడపలేదు. తాను కూడా ఆ స్థాయిలో సహకరించలేదు.

మొదటి రోజు స్పర్శించినట్టుగానే అనిపించింది. ఆ వేగం...ఆ కదలిక...తనకి ఊపిరాడలేదు. విడిగా కాస్త మెత్తగా కనపడతాడు గానీ, బెడ్ మీద పూర్తిగా డామినేట్ చేస్తాడు. ఈ హక్కు శాశ్వతంగా ఉండాలన్నదే అతడి తపన అని అర్థమవుతోంది. స్త్రీ పురుషుల సంబంధాల్లో ప్రపంచమంతా ఉంటుంది.

అందులో కుటుంబం...అతడి తాలూకు వ్యక్తులూ... ఆకాంక్షలూ దేనినీ ఛిద్రం చేసే హక్కు తనకు లేదు. మగవాడితో ఈ ఫిజికల్ అటాచ్‌మెంట్ లేకపోతే వారి మధ్య సహజీవనం ఎలా ఉంటుందో ఊహించలేం. శ్రీకర్ శారీరకంగా తనను ఎంత గాఢంగా వాంఛిస్తాడో, మానసికంగా కూడా అంతే ప్రేమిస్తాడని తనకు తెలుసు. చాలామంది మగవాళ్ళలా పక్క చూపులు చూడడు. కానీ కర్కరే? సమంత ఆలోచనలు ఆగిపోయాయి. ఇక అక్కణ్ణించీ ముందుకు పోలేదు.

●●●

మెల్కోటేకి మెయిల్ పెట్టాడు కర్కరే.

తనని యుఎస్‌కి పంపే విషయంలో తక్షణం నిర్ణయం తీసుకోవాలని కోరాడు. అలా సాధ్యం కాని పక్షంలో విధుల నుండి తప్పించాలని కోరాడు. అదే విషయం సమంతకి చెప్పాడు.

"సమంతాజీ! మీతో బ్రతకాలన్నది నా ప్రగాఢ కాంక్ష. మీరు కనిపించకపోతే, ఎవరినీ మరోలా చూసేవాడిని కాదు. మీరంటే నాకున్న ఇష్టం ఏ స్థాయికి వెళ్ళిపోయిందంటే...ఉద్యోగం వదులుకునేంత వరకూ! మెల్కోటే గారికి మెయిల్ పెట్టాను. పర్మిషన్ లేని పక్షంలో రిలీవ్ చేయమన్నాను" చెప్పడం ఆపాడు.

"మీరు కాస్త తొందరపడ్డారేమో..." అంది సమంత.

"అదేం లేదు. మీతో కలిసి బ్రతకాలనుకున్న తర్వాత అమెరికా అయినా ఒకటే, ఆస్ట్రేలియా అయినా ఒకటే. ఆస్ట్రేలియాలో నా మిత్రుడు ఒకడు సాఫ్ట్‌వేర్ కంపెనీ రన్ చేస్తున్నాడు. మన ఇద్దరికీ జాబ్స్ ఏర్పాటు చేస్తానని చెప్పాడు. అసలు మీరు జాబ్ చేయకపోయినా నాకభ్యంతరం లేదు. నాతో ఉంటే చాలు." చెప్పాడు కర్కరే.

"అలా నాకిష్టం లేదు. నేను జాబ్ చేయాలి. ఈ ఉద్యోగం కోసమే మా అమ్మ రాత్రింబవళ్ళూ కష్టపడి చదివించింది. ఇప్పుడు ఉన్న ఉద్యోగం వదులుకొని పెయిడ్ సర్వెంట్ స్థాయికి దిగజారలేను" అంది నిష్కర్షగా.

"ఛ...ఛ..నా ఉద్దేశం అది కాదు" వివరణ ఇవ్వబోయాడు.

"వద్దులెండి. మగాళ్ళందరూ చెప్పేదే మీరూ చెబుతారు. మీతో రావడానికి నా కారణాలు నాకున్నాయి. నాతో ఉండాలని అనుకునేందుకు మీ కారణాలు మీకున్నాయి. అందుకు ఉద్యోగం మానాల్సిన అవసరంలేదు. పైగా కంపెనీ మారడం కూడా నాకిష్టం లేదు. ఈ కంపెనీ నాకు ఉపాధిని ఇచ్చింది. దీనిని వదులుకునేంత బలమైన కారణం నాకు కన్పించడం లేదు. మీరు ప్రయత్నించండి. నెల తర్వాత కూడా మనకు అనుకూల నిర్ణయం రాకపోతే ఆలోచిద్దాం" అంది.

***(ఇంకావుంది)***

# హౌస్‌వైఫ్ పాత్ర కనుమరుగు?

హౌస్ వైఫ్ పాత్ర కనుమరుగైపోతుందని ఫ్యూచరాలజిస్టులు చెబుతున్నారు. ఇంట్లో ఉండి పనులు చేసేదీ, కుటుంబ నిర్వాహకురాలు, హోం ఫాదర్, హోం డాడ్ అని కూడా హౌస్‌వైఫ్ చెలామణీలో ఉంది. 'ఏమే ఇట్రా!' అని పిలవగానే, 'ఆ! పిలిచారా! వస్తున్నా.. చెప్పండి.. అని వచ్చి చేతులు కట్టుకుని విధేయంగా భర్త ముందు నిలబడే భార్య పాత్రలో ఇప్పటికే చాలా మార్పులు వచ్చాయి. అయితే 2050 నాటికి ఈ పాత్ర కనుమరుగవుతుందని ఫ్యూచరాలజిస్ట్ Dr.Ian Pearson జోస్యం చెప్పారు. కానీ 'శతకోటి దరిద్రాలకు అనంత కోటి ఉపాయాలన్నట్టు' కృత్రిమ తెలివితేటలున్న ఆండ్రాయిడ్లే రాబోయే కాలంలో హౌస్‌వైఫ్‌లుగా



చెలామణీ అవుతాయట. 80 శాతం పనులు చేయడానికవి సరిపోతాయంటున్నారు పియర్సన్. ఇల్లు శుభ్రం చేయడం, బట్టలు ఉతకడం, అంట్లు తోమడం, ఎక్కడి వస్తువులు అక్కడే సర్దిఉంచడం, సరుకులు తీసుకురావడం, ఇల్లు కాపలాకాయడం లాంటి పనులన్నీ రోబోలవే. ఇంటి ఫర్నీచర్ పూర్తిగా మారిపోతుందట. శరీరాకృతికి ఫిట్ అయ్యే కుర్చీలు, సోఫాలు అందుబాటులోకొస్తాయి. సెల్ఫ్ క్లీనింగ్ ఫ్యాబ్రిక్ వస్తుంది కనుక బట్టలు ఉతుక్కునే పనే ఉండదు! దుస్తులుకూడా వాటంతటవే రంగులు మార్చుకుంటాయి. వీడ కలల్ని నియంత్రించుకోవచ్చు, త్రీ-డీ హోలోగ్రాం ద్వారా సోషలైజ్ అయిపోతాం, రోబో చెఫ్‌లు, బాక్టీరియాలను పారద్రోలే డ్రోన్‌లు, యూవీ లైట్లు, మినీ రోబో టైడియర్లు, Sex Toys వస్తాయి. యాక్టివ్ కాంటాక్ట్ లెన్స్ ద్వారా మన టేస్ట్‌కు అనుగుణంగా, మన 'కనుసన్నల్లో' రూమ్ డెకరేషన్ చేసుకోవడం, నరాల వ్యవస్థకు అనుసంధానించే హెడ్‌సెట్‌ల ద్వారా ఇంట్లో సోఫాలో కూర్చుని కోరుకున్న బీచ్‌లో విహరించడం, బీచ్ ఇసుకను బొటనవేలితో తన్నినట్టు, వ్యాయామం చేసినట్టు, అమెజాన్ నీటిపై నడిచినట్టు అనుభూతులు పొందుతూ ఎన్నో కోరికలు తీర్చుకోవచ్చునట. ఇయాన్ పియర్స్ తన జోస్యంలో మనకు ఇచ్చిన గడువు 12 వేల 410 రోజులే! అంటే 34 యేళ్ళు! ఆ జోస్యం ఎంత ఫలిస్తుందో తెలియదుగానీ, భర్తలూ! ఈ లోపు మీరు మాత్రం భార్యల్ని మంచిచేసుకోండి. వాళ్ళ ప్రేమ సంపాదించుకోండి.






## వరంగల్లు జిల్లా కథా సర్వస్వము

**సంపాదకత్వం:** డాక్టర్ టి.శ్రీరంగస్వామి
**ధర:** 500 రూపాయలు
**పేజీలు:** 776
**ప్రతులకు:** నవచేతన పబ్లిషింగ్ హౌస్-బ్రాంచీలు, ప్రముఖ పుస్తక దుకాణాలు

ప్రత్యేక రాష్ట్ర కల సాకారం చేసుకున్న పోరుగడ్డ తెలంగాణ ఇప్పుడు స్వీయ సాహిత్య పరిరక్షణలో, మూలాల పునరుద్ధరణ, పునరుత్థాన చర్యల్లో క్రియాశీలంగా నిమగ్నమై ఉంది. అందులో భాగమే ఈ పుస్తకం. పరిశోధనాభిలాషి, నాలుగు దశాబ్దాలుగా వివిధ ప్రక్రియల తెలంగాణ వాఙ్మయాన్ని ప్రచురిస్తున్న శ్రీరంగస్వామి తమ 108వ పుస్తకంగా 108 కథలతో వరంగల్ జిల్లా కథా సర్వస్వం పుస్తకం ప్రచురించారు. 1927 - 2015 మధ్య కాలంలో వచ్చిన కథలు ఇందులో ఉన్నాయి. ఈ హైటెక్ యుగంలో, ఎన్నో గ్రంథాలయాలు తిరిగీ, పాత పత్రికలు తిరగేసీ, వ్యయప్రయాసలకోర్చి దాదాపు 800 పేజీలతో ఈ కథా సంకలనాన్ని కూర్చిన శ్రీరంగస్వామి గారికి పాఠకులు ఋణపడి ఉంటారు. అవార్డులూ, రివార్డులకోసం ఆయన ఈ కృషి చేయలేదు. తెలంగాణ కల నెరవేరడంలో అద్వితీయమైన పాత్ర పోషించిన వరంగల్లు జిల్లా జీవితాన్ని ఆవిష్కరించుకే ఈ ప్రయత్నం. వందేళ్ళ వరంగల్‌జిల్లా సమాజ గమనం, ఆ తీరుతెన్నులు ఈ కథల్లో నిక్షిప్తమై ఉన్నాయి. వీటిలో 1927-45 మధ్య కాలంలో వెలువడిన కథలను తొలితరం కథలుగా, 1946-56 మధ్య కాలంలో వెలువడ్డ కథలను అభ్యుదయ -హైద్రాబాద్ రాష్ట్ర కథలుగా, 1957-89 మధ్య వచ్చిన కథలను ప్రపంచీకరణానంతర తెలంగాణ ఉద్యమ కథలుగా వర్గీకరించారు. దూపాటి శేషమ్మ (1893- 1983)గారి కథ 'పరివారిక శిక్ష'తో ఈ సంకలనం ప్రారంభమైంది. చెడుమార్గం పట్టిన భర్తను సంస్కరించి ఋజుమార్గంలో పెట్టడం ఈ కథ సారాంశం. ఒద్దిరాజు రాఘవ రంగారావుగారు (1894-1973) రాసిన 'లండన్ విద్యార్థి', బి.వి. రంగారెడ్డి రాసిన 'పాశ్చాత్య వ్యామోహం' కథలు విదేశీ వ్యామోహాన్నీ, బ్రెయిన్ డ్రెయిన్ సమస్యను తెలియజేస్తాయి. ఓరుగల్లు ప్రస్తావన కథలో మొదట రాసింది రంగారెడ్డిగారే.

పొట్లపల్లి రామారావు, అద్దూరి అయోధ్యరామకవి, దాశరథి కృష్ణమాచార్యులు, మహిళా రచయిత్రి నందగిరి ఇందిరాదేవి సాయుధ రైతాంగ పోరాటంపై రాసిన కథలు రెండవ విభాగంలో ఉన్నాయి. ఎక్కడో తప్పిపోయిన కథాసాహిత్యమంతా వెతికి తెచ్చి గుదిగుచ్చి యింత సంకలనంగా తీర్చిదిద్దిన శ్రీరంగస్వామి, ఎవ్వరికీ అందుబాటులో లేని 1932 నాటి 'వ్యాసలత'లోని కథల్ని ఇందులో చేర్చారు. 'అక్షరాలేసిన తొవ్వ' అంటూ శ్రీనివాస్‌గారు రాసిన పీఠిక ఈ సంకలనానికి స్ఫూర్తిదాయకంగా నిలుస్తుంది.

## స్వీకారాలు

**రెండు సత్యాలు**
చందు సుబ్బారావు
ధర: 100 రూపాయలు
**పేజీలు:** 88
**ప్రతులకు:** విశాలాంధ్ర, ప్రజాశక్తి, సమత పబ్లిషర్స్

**సిగ్గుపడుతున్న స్వార్థం**
**పికినిక్ ముచ్చట్లు**
రాసభూమయ్య
ధర: 60 రూపాయలు
**పేజీలు:** 82
**ప్రతులకు:** రాస భూమయ్య, యెఖీన్‌పూర్., కరీంనగర్‌జిల్లా. సెల్: 94402 44962

**నాన్నా! నాకు మరణం లేదు**
అవయవ దానంపై కవితా సంకలనం
ధర: 60 రూపాయలు
**పేజీలు:** 88
**ప్రతులకు:** నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్. ఫోన్: 040-24652387

**మూడు కోరికలు**
**మరికొన్ని కథలు**
ఐజక్ బషేవిస్‌సింగర్
అనువాదం: కె.బి.గోపాలం
ధర: 60 రూపాయలు
**పేజీలు:** 112
**ప్రతులకు:** మంచి పుస్తకం, తార్నాక, సికింద్రాబాద్-17. సెల్: 94907 46614

**రహస్యభూతము**
**(ఆధునిక పద్యకావ్యము)**
డాక్టర్ ఎం.పురుషోత్తమాచార్య
ధర: 90 రూపాయలు
**పేజీలు:** 208
**ప్రతులకు:** శ్రీ రామచంద్ర ఎన్క్లేవ్, నెం.516, రామగిరి, నల్లగొండ-01, సెల్: 93966 11905 మరియు నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్

-లలితా త్రిపుర సుందరి

# కొమ్మ కొమ్మకో బొమ్మ

**ఇదో బొమ్మల కథ. చిన్న పిల్లలకు పెద్దవాళ్ళు చెబుతుంటారు కదా.... అనగనగా ఒక అడవి... ఆ అడవిలో పెద్ద పెద్ద చెట్లు... అంటూ మొదలెడతారు. ఈ కథ కూడా సరిగ్గా అక్కడే మొదలవుతుంది. కాకపోతే ఈ కథ అడవి గురించి కాదు ఓ దీవి గురించి. ఆ దీవి పేరు ఏమిటో తెలుసా? బొమ్మల దీవి (ఐలాండ్ ఆఫ్ డాల్స్) వినడానికి విచిత్రంగా ఉంది కదూ... అక్కడి విషయాలు తెలుసుకుంటే ఇంకా ఆశ్చర్యం కలుగుతుంది. చెప్పలేనంత ఆశ్చర్యాన్నీ, అంతే భయాన్నీ కలిగించే ఈ బొమ్మల దీవి గురించి తెలుసుకుందాం పదండి.**

దక్షిణ మెక్సికోలో ఓ చిన్న దీవి ఉంది. ప్రపంచంలో ఉన్న వేలాది దీవుల్లాంటిదే ఈ దీవి కూడా! అయితే సుమారు 60 సంవత్సరాల క్రితం మామూలుగా ఉండే ఈ దీవి స్వరూపం ఒక్కసారిగా మారిపోయింది. దీవిలోని చెట్ల నిండా బొమ్మలు వేలాడడం మొదలయ్యాయి. చెట్లకు పళ్ళు, కాయలకు బదులు బొమ్మలు వేలాడడం చూసి చుట్టుపక్కల దీవుల వాళ్ళు ఈ దీవి గురించి మాట్లాడడానికి కూడా భయపడేవారు.

ప్రస్తుతం ఈ దీవి పర్యాటకులను ఆకర్షిస్తుండడంతో అడపాతడపా ఈ దీవిలో జన సంచారం కనపడుతోంది.

### అంతుచిక్కని రహస్యం?

చెట్లకు వేలాడుతున్న బొమ్మల గురించి తెలుసుకోవాలంటే ఓ అరవై సంవత్సరాలు వెనక్కి వెళ్ళాల్సిందే! ఈ దీవిలో డాన్ జూలియన్ సంటానా అనే ఓ వ్యక్తి ఉండేవాడు. ఓ రోజు అతని కళ్ళెదురుగా పన్నెండు సంవత్సరాల పాప దీవిలోని నీటి ప్రవాహంలో కొట్టుకుపోయి అతను చూస్తుండగానే చనిపోయింది. ఆ పాపను రక్షించాలని అతను ప్రయత్నించినా ఫలితం లేక పోయింది. ఆ సంఘటన సంటానాను బాగా కదిలించింది. తన కళ్ళెదురుగా ఓ పాప ప్రాణం పోతున్నా ఏం చేయలేకపోయానన్న బాధతో ఆ రోజంతా బాధపడుతూనే ఉన్నాడు. అదే బాధలో మరుసటి రోజు తనకు తెలియకుండానే ఆ ప్రవాహం దగ్గరకి వచ్చాడు. పాప చనిపోయిన చోట ఓ బొమ్మ అతనికి కనిపించింది. ఆ బొమ్మ ఆ పాపదే అయి ఉండవచ్చన్న ఉద్దేశంతో దాన్ని తీసుకు వచ్చి తన ఇంటి దగ్గరగా ఉన్న చెట్టుకు కట్టేశాడు. ఆశ్చర్యంగా అతనికి ప్రతిరోజూ బొమ్మలు కనిపించడం ప్రారంభించాయి. కనిపించిన ప్రతి బొమ్మనీ తీసుకొచ్చి దీవిలోని చెట్లకు కట్టేవాడు. ఇలా కట్టడంలో అతనికో నమ్మకం ఉండేది. చనిపోయిన పాప ఆత్మ ఆ బొమ్మల్లోనే ఉందని భావించేవాడు. అలా 50 సంవత్సరాల పాటు ప్రవాహంలో కొట్టుకువచ్చిన బొమ్మలన్నింటినీ చెట్లకు కడుతూనే ఉన్నాడు.



### ఈ బొమ్మలు ఎక్కడి నుంచి వచ్చాయి?

అది ఇప్పటికీ అంతుచిక్కని రహస్యమే అంటారు ఆ దీవి చుట్టుపక్కల దీవుల్లో నివసించే ప్రజలు. ప్రవాహంలో ప్రతిరోజూ ఓ బొమ్మ కొట్టుకురావడం







మామూలు విషయం కాదు. కానీ సంటానా ఆ విషయం గ్రహించలేకపోయాడన్నది వారి అభిప్రాయం. బొమ్మ కనిపించిన రోజునే దాన్ని అలా వదిలేసి ఉంటే బాగుండేదని మరికొందరు అంటూంటారు. బొమ్మల్లో చనిపోయిన వారి ఆత్మలు చేరాయని మరికొందరి నమ్మకం.

**బొమ్మలు కావు అవి భూతాలు**



కొందరి అభిప్రాయం ఇదే! అవి మామూలు బొమ్మలు కావని పర్యాటకులు సైతం అంగీకరిస్తారు. ఆ బొమ్మల్లో చాలా వరకూ కళ్ళూ, ముక్కూ, కాళ్ళూ చేతులూ ఊడిపోయి ఉన్నాయి. వాటిని కట్టి దశాబ్దాలు గడుస్తున్నా ఒక్క బొమ్మ కూడా కింద ఊడి పడడం ఎవరూ చూడలేదంటారు. అవి ఎంత జీర్ణావస్థకు చేరుకున్నా కింద పడిపోకుండా చెట్టుకి వేలాడుతూ ఉండడానికి కారణం వాటిల్లో ఆత్మలు ఉండడమే అన్నది కొందరి వాదన. ఈ రోజుకి కూడా ఆ దీవిలోకి ఒంటరిగా వెళ్ళడానికి ఎవరూ సాహసించరు. గుంపుగా వెళ్ళి వస్తుంటారు. వెళ్ళిన వాళ్ళు కూడా అక్కడ నివసించే ఆత్మలు తమనేమీ చేయకుండా ఓ బొమ్మను కట్టి వస్తూంటారు. దాంతో ఇప్పుడు వేలాది బొమ్మలు వేలాడుతూ కనిపిస్తాయి. దీవి గురించి ఏమాత్రం అవగాహన లేకుండా అక్కడికి వెళ్ళిన వాళ్ళు వేలాడుతున్న ఆ బొమ్మలుచూసి దడుసుకోవడం ఖాయం అంటారు.



**బొమ్మల్లో ఆత్మ ఉందా?**

ఇందులో నిజం ఎంత ఉందో తెలుసుకోవాలని వెళ్ళిన వారికి కొన్ని అనూహ్యమైన సంఘటనలు ఎదురయ్యాయి. దాంతో బొమ్మల్లో ఆత్మలు దాగున్నాయన్న వార్తకు మరింత బలం చేకూరింది. అర్ధరాత్రి వేళ ఆ బొమ్మలు ఒకదానితో మరొకటి సరదాగా పోట్లాడుకుంటూ ఉంటాయట! ఒకదాన్నొకటి తోసుకోవడం, కొట్టుకోవడం చేస్తుంటాయట. ఇలా కొట్టుకున్న సమయంలో కొన్ని బొమ్మలకు తల మీద రక్తం మరకలు అంటుకున్న రుజువులు కూడా కనిపిస్తాయి. వాటిల్లో ఆత్మ లేకపోతే బొమ్మల తలమీద రక్తం ఎలా వచ్చింది? అన్న ప్రశ్న చాలామంది వేస్తుంటారు. ఆ దీవిలో జనసంచారమే కాదు జంతువులు కూడా ఎక్కువగా కనిపించవు. కనిపించేవన్నీ దట్టమైన ఎత్తైన చెట్టు మాత్రమే! బొమ్మల్లో ఆత్మఉండడం వలనే రక్తం కారిందని కొందరు గట్టిగా విశ్వసిస్తున్నారు. ఇక బోట్ల మీద ప్రయాణించి వచ్చే యాత్రికులకు అస్పష్టంగా మాటలు, గొణుగుళ్ళూ వినిపిస్తుంటాయట! ఆ దీవిలో జన సంచారమే ఉండదు. అయినా ఆ మాటలు ఎక్కడి నుంచి వస్తాయో అర్థం కాక బిత్తరపోయి బొమ్మలను చూసేవారికి ఆ బొమ్మల పెదవులు అస్పష్టంగా కదలడం, కళ్ళు ఆర్పడం, తల, కాళ్ళూ, చేతులూ అటూ ఇటూ కదిలించడం కన్పిస్తుంది. దాంతో ఆ మాటలు ఎక్కడి నుంచి వచ్చాయో వారికి ఇట్టే అర్థమవుతుంది. అర్ధరాత్రి సమయంలో బొమ్మల్లో నుంచి కాంతి వెలువడుతూ ఉంటుంది. వాటిల్లో ఎవరో దీపాలు పెట్టినట్టు దేదీప్యమానంగా వెలుగుతుంటాయి. ఇది కొద్దిసేపు మాత్రమే అంటారు కొందరు.



**ప్రమాదాలు, అపాయాలు**

బొమ్మల్లో ఆత్మ ఉందో లేదో తెలియదు కానీ, ఇక్కడకు వచ్చేవారు ప్రమాదాల్లో పడడం కానీ, అపాయాలను ఎదుర్కొన్న సంఘటనలు జరిగినట్టు, పెద్దగా ఎవరి దృష్టికీ రాలేదట! ఎంతసేపూ ఆ బొమ్మలను చూసి భయపడిన వారే తప్ప ఆ బొమ్మలవల్ల ఇంతవరకూ ఎవరికీ ఎలాంటి ప్రమాదం జరగలేదు. ఒంటరిగా వెళ్ళిన వారికి మాత్రం కొన్ని భయానక పరిస్థితులు ఎదురయ్యాయని అంటారు. అది ఎంతవరకూ నిజమో ఎవరూ ఇంతవరకూ నిర్ధారించలేదు.

**డాన్ జూలియన్ ఏమయ్యాడు?**

ఆత్మలు వచ్చి బొమ్మల్లో చేరుతాయని గుడ్డిగా నమ్మిన డాన్ జూలియన్ సంటానా శవం కూడా ప్రవాహం దగ్గర కనిపించడం అతని కుటుంబ సభ్యులను తీవ్రంగా కలిచివేసింది. పాప చనిపోయిన యాభై సంవత్సరాలకు సంటానా చనిపోయాడు. పాప ఎక్కడైతే చనిపోయిందో అదే ప్రదేశంలో అతని శవాన్ని కుటుంబ సభ్యులు కనుగొన్నారు.

పాప ఆత్మతో పాటు సంటానా ఆత్మ కూడా ఆ బొమ్మల్లో ఏదో ఒకదానిలో ఉండే ఉంటుందని సంటానా కుమారుడి నమ్మకం. ఎవరేమనుకున్నా తను చేసిన తప్పుకి నిర్విరామంగా యాభై సంవత్సరాల పాటు దొరికిన ప్రతి బొమ్మనూ చెట్టుకి వేలాడదీసిన సంటానా చర్యను కొందరు సమర్థిస్తుంటే మరికొందరు తప్పుపడుతున్నారు. ఓ విధంగా ఈ దీవిలో ఆత్మలు సంచరించడానికి సంటానాయే కారకుడని కొందరి వాదన. అతను మొదటిరోజే తనకు దొరికిన బొమ్మను వదిలేసి ఉంటే బాగుండేదని అంటూంటారు.

**ఆకర్షిస్తున్న దీవి**

ఈ దీవి చాలామందిని ఆకర్షిస్తోంది. ప్రతి సంవత్సరం ఈ దీవికి వచ్చే పర్యాటకుల సంఖ్య పెరుగుతూనే ఉందట! దీవిలోని చెట్లకు వేలాడుతున్న బొమ్మల్లో ఆత్మలు తిరుగాడుతున్న విషయం సంటానా మరణం తరువాత చాలామందికి తెలిసి వచ్చింది. సంటానా మరణం తరువాతే దీవికి వచ్చే వారి సంఖ్య పెరిగింది. మెక్సికోకు వచ్చేవారిలో చాలామంది ఈ దీవికి వచ్చి చెట్టుకు ఓ బొమ్మ వేలాడదీస్తుంటారు. దీని మీద ఇప్పటికే చాలా కథనాలు వెలువడ్డాయి. ఇంకా వెలువడుతూనే ఉన్నాయి కూడా!

-దేవి

# నోబెల్ కథలు

# అలాన్ సెడార్ - విర్గావే

-సింక్లెయిర్ లూయిస్



సింక్లెయిర్ లూయిస్ 7 ఫిబ్రవరి 1885న అమెరికాలో జన్మించారు. 1930లో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 65 ఏళ్ళ వయసులో 10 జనవరి 1951న ఇటలీలో మరణించారు.

**ఆర్లోవే ఓ కళ్ళజోళ్ళషాపు యజమాని. ఊళ్ళో పెద్దమనిషిగా చలామణి అవుతుంటాడు. అందరికీ తన అవసరం ఉండాలని తపనపడేవాడు. మతబోధకులు, కళాకారుల తరహాలో తన వృత్తిలో సహ నానికి, నైపుణ్యానికి అవకాశం లేకపోయిందే అని ఎప్పుడూ బాధపడుతూ ఉండేవాడు. అందరికీ తలలో నాలుకలా ఉండాలని ఎన్నో కార్యకలాపాలు నిర్వహించేవాడు. సభల్లో మాట్లాడేవాడు. యుద్ధ శరణార్థుల కోసం, చర్చి తరపున, చందాలు వసూలు చేసేవాడు. స్థానిక బేస్‌బాల్, హాకీ క్లబ్బుల్లో కూడా అతనికి సభ్యత్వం ఉంది. నున్నటి బట్టతల, గుండ్రటి మొహం, ముక్కుమీదకు జారే బైఫోకల్ కళ్ళద్దాలతో నలభై ఐదేళ్ళ వయసున్న ఆర్లోవే, ఎంతమందిలో ఉన్నా ప్రధాన ఆకర్షణగా నిలిచేవాడు. ఆ ఊళ్ళో ఆర్లోవే అంటే తెలియని వాళ్ళుండరంటే అతిశయోక్తి కాదు.**

అతడి భార్య విర్గా కొద్దిగా భయస్థురాలు. ఎప్పుడూ కలలు కంటూ ఊహల్లో తేలిపోతూ ఉండేది. ఆమెకు సంగీతమంటే ప్రాణం. ప్రేమ గీతాలను ఇష్టంగా వింటూ ఉండేది. అయితే ఆర్లోవే మాత్రం తన కార్యక్రమాల్లో విర్గా కూడా పాలు పంచుకోవాలని కోరుకునేవాడు. బయటికి ఎక్కడికీ వెళ్ళకుండా, ఆమె ఇలా పగటికలలు కంటూ కాలం గడిపేయడం చూసి ఆర్లోవే మొత్తుకునేవాడు. అయినాసరే ఆమె అతన్ని అస్సలు పట్టించుకునేది కాదు. తన ధోరణిలో తనుండేది. రంగురంగుల ప్రేమలోకంలో విహరిస్తూ ఉండేది.

ఆర్లోవే ఎక్కువగా బయటే గడుపుతుండటంతో, దంతవైద్యుడు అలాన్ సెడార్ ఆకర్షణలో పడింది విర్గా. అతడంటే విర్గాకు అమితమైన ప్రేమ. నిజానికి సెడార్, విర్గాలది చూడముచ్చటైన జంట. అయితే వాళ్ళు ఎప్పుడూ కలిసి ఏకాంతంగా, సంతోషంగా గడిపింది లేదు. భర్తని చూసి భయపడేది విర్గా. గయ్యాళి భార్యని చూసి భయపడేవాడు అలాన్. కూల్‌డ్రింక్‌షాపులో ఎప్పుడన్నా కలుసుకునేవారు. కాఫీయో, శీతలపానీయమో తాగేవారు. ఒక్కొక్కసారి అలాన్ సెడార్ సొంత కారులోనో, పార్కులోని పచ్చిక మైదానాల్లోనో కూర్చుని మాట్లాడుకునేవారు. కారులైట్ల వెలుగులో రాబర్ట్‌ఫ్రాస్ట్, టి.ఎస్.ఇలియట్, శాండ్‌బర్గ్‌లాంటి కవుల కవిత్వం చదువుకుని ఆనందించేవారు.

అలాన్‌కు నగరంలో మంచి నటుడని పేరు. అతని నాటకాల్లో నటీనటుల దుస్తుల ఎంపికను విర్గా పర్యవేక్షించేది. నాటకం రిహార్సల్స్‌కు కూడా హాజరయ్యేది. అలా వాళ్ళు తరచు కలుసుకునేవారు. ఈ వ్యవహారమంతా అలాన్ సెడార్ భార్య బెర్తాకు తెలిసింది. లావుపాటి బెర్తా గయ్యాళి మాత్రమేకాదు, ఆమెలో ఒకలాంటి వంకరబుద్ధి, క్రూరత్వం కనిపించేవి. నిజానికి ఆమె భర్తను ద్వేషించేది. పైకి భర్తను తిట్టేది కాదుగానీ, నాటకాలపైనా, కవిత్వంపైనా భర్తకున్న ప్రేమను ఎగతాళి చేసేది. క్రాస్‌వర్డ్ పజిల్స్ పూర్తిచేయడం, స్టాంపుల సేకరణ లాంటి అతడి ఇష్టాలను విమర్శించేది. అతని మీసకట్టును, ఒక దంత వైద్యుడిగా అతడికున్న నైపుణ్యాన్ని కూడా చులకనచేసి మాట్లాడేది. బెర్తావాళ్ళు ఏడుగురు అక్కాచెల్లెళ్ళు. వాళ్ళతో, వాళ్ళ భర్తలతో కబుర్ల కాలక్షేపం చేస్తూ అలాన్ గురించి చులకనగా మాట్లాడేది.

"అలాన్ పేరుకే డాక్టరు. అతనికి డబ్బున్న పేషెంటు ఒక్కడు కూడా లేడు" అంటుండేది తల్లితో.

"అలాన్ నా సహాయం లేకుండా టై కూడా వెతుక్కోలేడు" అని ఇంటికొచ్చిన అతిథులతో చెప్పేది. "తెలివితక్కువగా మాట్లాడకు" అంటూ భర్త మాటల్ని కొట్టిపడేసేది. అలా తనకు తెలిసిన ఆడవాళ్ళందరి దగ్గరా సానుభూతి సంపాదించేది. భర్తకు ఇష్టమైన గోల్ఫ్ ఆటగానీ, చదరంగం గానీ నేర్చుకోవడానికి బెర్తా నిరాకరించేది. ప్రేమించడమంటే ఏమిటో అలాన్‌కి తెలియదని అంటూ ఉండేది.

ఇలా బెర్తా చేస్తున్న పనులన్నింటితో అలాన్ సెడార్ విసిగిపోయాడు. అతను బెర్తాపై కోపగించుకున్న ప్రతిసారీ, "నీకు ఈ మధ్య చిరాకు బాగా ఎక్కువైపోయింది" అనేది నిర్లక్ష్యంగా. చివరికి అతను "నన్ను ఒంటరిగా వదిలేయ్" అని గట్టిగా అరిచేవాడు. "నీకేమైంది? ప్రతి చిన్న విషయం పట్టించుకుంటూ అన్నిటికీ విసుక్కుంటున్నావు? ఎవరన్నా మానసిక వైద్యుడి దగ్గరకు వెళ్ళి పరీక్ష చేయించుకో" అని ఎత్తి పొడిచేది.

బెర్తాకు అనుకోకుండా ఆమె మేనత్త నుంచి వారసత్వ ఆస్తి లభించింది. కాలిఫోర్నియాలోని శాన్‌జోస్‌లో ఉన్న ఆ ఇంటికి వెళ్ళిపోయి సంక్రమించిన ఏడువేల డాలర్ల నగదుతో అక్కడే ప్రాక్టీసు పెట్టుకుందామని భర్తని పోరుతూ ఉండేది. భార్యని హత్య చేయడానికైనా సిద్ధమే గానీ, కాలిఫోర్నియా వెళ్ళేందుకు మాత్రం అలాన్ సిద్ధంగా లేడు. అమెరికాలోవున్న చాలామంది భర్తలు, తమ భార్యలకీ, గస్తీ పోలీసులకీ మధ్య తేడా తెలియక తికమకపడుతూ ఉంటారు! అలాన్ కూడా అలాంటివాడే.

విర్గాను వదిలిపెట్టి కాలిఫోర్నియా వెళ్ళిపోవడం అంటే ఆత్మహత్యాసదృశమేనని అలాన్‌కి బాగా తెలుసు. ఇలా సతమతమవుతున్న స్థితిలో అలాన్ ఒకరోజు విర్గాకి సంకేత భాషలో సందేశం పంపాడు. మధ్యాహ్నం మూడింటికల్లా విర్గా అతని దగ్గరికి వచ్చింది.

"మనిద్దరం కలిసి ఎక్కడికన్నా వెళ్ళడానికి కుదరదా? ఏదన్నా ఫామ్‌హౌస్‌కో, ఎక్కడికైనా సరే" అడిగింది విర్గా.

"బెర్తా కనిపెట్టేస్తుంది. ఆమె బంధువుల్లో ఒకడు ప్రయివేటు డిటెక్టివ్ కూడా" అన్నాడు అలాన్.

"అవును. ఆవిడ అలా కూడా చేయగలదు. మరి మనం ఎప్పటికీ కలిసి ఉండే అవకాశమే లేదా?"

"నువ్వు భయపడనంటే ఒకేఒక మార్గం ఉంది" అంటూ దానిగురించి వివరంగా చెప్పాడు అలాన్.

"నేను భయపడడం లేదు. నువ్వు పక్కన ఉన్నంత వరకూ నేను దేనికైనా సిద్ధమే" అంది విర్గా.

డాక్టర్ అలాన్ సెడార్‌కు యంత్రాలకు సంబంధించి కూడా మంచి నైపుణ్యం ఉంది. ఒక ఆదివారం మధ్యాహ్నం బెర్తా ఆమె తల్లి దగ్గరకు వెళ్ళినప్పుడు అతను కారు వెనుకభాగంలో బైటకు కనపడకుండా ఒక రంధ్రం చేశాడు. తర్వాత వ్యాక్యూమ్ క్లీనర్‌కు ఉండే రబ్బరుగొట్టాన్ని తీసి కారు గ్యారేజీలో దాచి ఉంచాడు. నీలంరంగులో ఉన్న కొత్త సూట్ కొన్నాడు. అది ఎలాంటి మార్పులు అవసరం లేకుండా అతనికి చక్కగా సరిపోయింది. వాళ్ళు సూట్‌ని మధ్యాహ్నం ఇస్తామని చెప్పగా మర్నాడు ఉదయం తనే వచ్చి తీసుకుంటానని చెప్పాడు.

"మీ భార్య దీన్ని ఇష్టపడుతుంది డాక్టర్" అన్నాడు షాపు యజమాని.

"ఆమెచూస్తే ఇష్టపడుతుందనే అనుకుంటు న్నాను" అంటూ సమాధానమిచ్చాడు అలాన్.

అతను తర్వాత మూడు తెల్ల లైనెన్ షర్టులు, ఎరుపురంగు టై కొని డబ్బులు చెల్లించాడు. వాళ్ళ క్రెడిట్‌కార్డు ఉందన్నా వినిపించుకోలేదు. తర్వాత అతను మందులషాపుకీ, పాల దుకాణానికీ వెళ్ళి వాళ్ళకి ఇవ్వాల్సిన డబ్బులు ఇచ్చేశాడు. తిరిగి వస్తుండగా అతనికి జడ్జి టింబర్‌లేన్, అతని భార్య ఎదురయ్యారు. అతను ఎప్పుడూ వాళ్ళతో గట్టిగా పదిమాటలు కూడా మాట్లాడి ఎరుగడు. వాళ్ళని చూసి "ప్రేమ విలువ తెలిసిన చక్కటి తెలివైన భార్యాభర్తలు" అని మనసులో మెచ్చుకున్నాడు.

ఆరోజు సాయంత్రం అతను భార్యతో "ఇవాళ ఒక విచిత్రం జరిగింది తెలుసా! దంతవైద్య విశ్వ విద్యాలయం నుంచి ఒక ఫోను వచ్చింది" అని చెప్పాడు.

"సరే సరే" ఆమె గొంతులో అపనమ్మకం కన్నా విసుగే ఎక్కువ ధ్వనించింది.

"వాళ్ళు దంతవైద్యులతో ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేశారు. రేపు ఉదయమే మిన్నెపోలిస్‌కు వెళ్ళిపోవాలి. సదస్సు మూడు రోజులు ఉంటుంది. దంతాల అమరికమీద నేను ఉపన్యసించాల్సి ఉంటుంది. నువ్వు కూడా నాతో రావచ్చు. అయితే దరిద్రం ఏంటంటే ఉదయం తొమ్మిది నుంచీ అర్థ రాత్రివరకూ నాకు ఆ పనే సరిపోతుంది. ప్రత్యేక శిక్షణా తరగతులు కూడా ఉన్నాయి. అక్కడ నీకేమీ తోచదు. కాకపోతే అక్కడ నువ్వు నిక్షేపంగా సిని మాలకు వెళ్ళొచ్చు లేదా హోటల్లోనే సరదాగా కాలక్షేపం చేయొచ్చు" చెప్పాడు అలాన్.

"నేను రాను. అంతకన్నా ఇక్కడ ఇంట్లో ఉండ డమే నయం. నువ్వు ఏదన్నా మామూలు డాక్టర్లై గాల్‌బ్లాడర్ల ఆపరేషన్లు చేస్తూ డబ్బులు సంపా



**అభిప్రాయాలు, అభిరుచులు పొసగని జంటలు ఆ రెండూ. కానీ కొద్దిగా అటూ ఇటూ మారితే, అతని భార్యా, ఆమె భర్తా ఇద్దరూ చక్కని జంట అవుతారు. కానీ ఈ చక్కని జంట ఏకాంతంగా, సంతోషంగా ఎప్పుడూ గడపలేదు. కారణం ఏమిటంటే ఆమెకు భర్తంటే భయం, అతడికి భార్యంటే భయం. వాళ్ళెప్పుడైనా ఏకాంతంగా గడిపారా? మరి వాళ్ళ భాగస్వాములు సహించి ఊరుకున్నారా?**

దిస్తే ఎంత బాగుండేది? సరే. ఆదివారం ఉద యానికల్లా ఇంటికి తిరిగి వస్తే సంతోషిస్తా. ఆ రోజు అమ్మతో కలిసి భోజనం చేయాలి. గుర్తుంది కదూ" అంది.

"అంతకన్నా ముందే వచ్చేయగలననుకుం టున్నా" అన్నాడతను.

మిన్నెపోలిస్‌లో, ఫ్లోరా హోటల్లో దిగుతున్నట్టు బెర్తాకి చెప్పాడు అలాన్. అయితే బుధవారం ఉదయం అతను కొత్తసూట్ వేసుకుని సెయింట్ పాల్ వరకూ తనే కారు నడుపుతూ వెళ్ళాడు. తోవలో కవిత్వం అల్లడానికి చిన్నప్రయత్నం కూడా చేశాడు. సెయింట్ పాల్‌లో హోటల్ ఆర్కనెస్‌లో మిస్టర్ ఎ.ఎం. రోమియో, అతని భార్య పేరుతో డబుల్ బెడ్‌రూమ్ తీసుకున్నాడు. "నా భార్య వెనుక రైల్లో వస్తోంది. ఇంకో పదిహేడు నిమి షాల్లో ఇక్కడికి చేరుకుంటుంది" అని హోటల్ గుమాస్తాతో చెప్పాడు. లిఫ్టులో పైకివెళ్ళి గదిని పరీక్షగా చూసి శుభ్రంగా ఉందని సంతోషించాడు. పందొమ్మిది నిమిషాల తర్వాత ఆ గదిలోకి అడుగు పెట్టింది విర్గా. అటెండరు ఆమె సామాన్లు తీసుకువచ్చాడు. "నువ్వు వచ్చేశావన్నమాట! గది బాగానే ఉందిలే" అంత పట్టించుకోనట్టుగా అంది విర్గా. వాళ్ళిద్దరినీ చూసిన అటెండరు వాళ్ళు భార్య భర్తలు కాదనీ, ప్రేమికులనీ గ్రహించేశాడు. అతని అనుభవంలో ఇలాంటి వాళ్ళని ఎందరినో చూసే శాడు మరి! అతను ఇంకా గది విడిచిపెట్టి నాలుగు అడుగులు వేశాడో లేదో అలాన్, విర్గా తన్మయ త్వంగా ముద్దు పెట్టుకోవడంలో మునిగిపోయారు. తర్వాత ఆమె అలాన్‌ను పరిశీలనగా చూసి, "ఓ.. కొత్త సూట్ తీసుకున్నావా? చాలాబాగుంది. ఎరుపురంగు టై కూడా చాలా బాగుంది. ఈ సూట్‌లో నువ్వు చాలా అందంగా, చిన్నవాడిలా కనిపిస్తున్నావు. ఇవన్నీ నాకోసమే కొన్నావా?" అని అడిగింది.

"అవును. ఆ! అన్నట్టూ నీకో విషయం చెప్పాలి. హోటల్‌వాళ్ళు మనల్ని చూసినప్పుడు మనం తేడాగా కనిపించకూడదు, అర్థమయిందా!"

"అవును. నిజమే"

"నువ్వింకా ఇంతకుముందు మనం అనుకున్న అభిప్రాయంతోనే ఉన్నావా?"

"నీతో కలిసి ఉండేటట్టయితే దేనికైనా సిద్ధం" ఆమె చెప్పింది.

అతను సంతోషంగా కొత్త సూటు తీసేశాడు. ఆమె తన బ్యాగ్‌లోంచి కొత్త నైట్ గౌను తీసి వేసుకుంది. భోజనం కూడా గదిలోకే తెప్పించు కుని తిన్నారు వాళ్ళు. మర్నాడు మధ్యాహ్నం వరకూ గది విడిచిపెట్టి బైటకు కూడా వెళ్ళలేదు. గది అంతా సెంటువాసన, సిగరెట్ల వాసనతో నిండిపోయింది. ఇద్దరూ కలిసి ఒకేసారి స్నానం చేశారు. తర్వాత సామానంతా సర్దేశారు. అతడు హోటల్ బిల్లు చెల్లించాడు. తర్వాత సర్దిన సామా నంతా గదిలోనే, మంచం పక్కన వదిలేశారు. విస్కీ సీసా ఉన్న పేపరు బ్యాగ్, కవితల పుస్తకం



తప్ప గదిలోంచి ఇంకేమీ తీసుకోకుండా బైటకు నడిచారు. గుమ్మం దగ్గర ఆగిన ఆమె, ఒకసారి వెనుదిరిగి చూసి "ఈ ప్రియమైన గదిని నేను బతికి ఉన్నంతవరకూ గుర్తుంచుకుంటాను" అంది అతనితో.

"అవును. మనం బతికి ఉన్నంతవరకూ" అలాన్ అన్నాడు.

హోటల్ గ్యారేజీలో నుంచి అతడు తన కారు బైటకు తీసి ఇండియన్ మౌంట్స్ పార్కుకి పోనిచ్చాడు. అప్పటికి సాయంత్రం అయింది.

"ఈ పార్కుకి ఇండియన్స్ జంటలు జంటలుగా వస్తారు" అలాన్ అన్నాడు.

"వాళ్ళు చాలా ధైర్యవంతులు" విర్గా నవ్వింది.

"అవునవును. ధైర్యవంతులు" ఇద్దరూ నవ్వుకున్నారు. నిజానికి హోటల్ నుంచి బైటపడిన దగ్గర్నుంచీ ఇద్దరూ ప్రతిదానికీ నవ్వుతూనే ఉన్నారు. ఆమె ముక్కు చీదినా, అతను పైపు పీల్చినా ఇద్దరూ నవ్వుతూనే ఉన్నారు.

'అమ్మయ్య! న్యుమోనియా వస్తుందేమోనని ఇక భయపడ నక్కరలేదు" అంటూ అతను కారుని ఒక చిన్నవీధిలోకి పోనిచ్చి అక్కడ ఆపాడు. ఇళ్ళన్నీ అక్కడికి దూరంగా ఉన్నాయి. కనిపించీ కనిపించని చీకటిలో అతను ఇంజన్‌ని అలాగే ఉంచి వ్యాక్యూమ్ క్లీనర్ గొట్టాన్ని కారు రంధ్రం గుండా లోపలికి పంపి దాన్ని ఎగ్జాస్ట్ పైపుకి వైరుతో కలిపాడు. తిరిగి కారులోకి ఎక్కి కిటికీలు మూసివేశాడు. కారులోని గాలి అంతా అప్పటికే కార్బన్ మోనాక్సైడ్ వాసనతో నిండిపోయింది. అతడు విస్కీసీసా బైటకు తీసి కొంచెం విస్కీ తాగాడు. విర్గాకు కూడా సీసా అందించి "కొంచెం తాగు, ధైర్యంగా ఉంటుంది" అన్నాడు.

"నాకు అలాంటి అవసరం లేదు" ఆమె చెప్పింది.

"నీకున్నంత ధైర్యం నాకు లేదు, విర్గా" అలాన్ అన్నాడు.

వాళ్ళిద్దరూ నవ్వుకుంటూ విస్కీ తాగారు. గాఢంగా ముద్దుపెట్టుకున్నారు.

"నేను సిగరెట్టు తాగవచ్చో లేదో తెలీడంలేదు. కార్బన్ మోనాక్సైడ్‌కి కాలిపోయే గుణం ఉంటుందనుకోను" అలాన్ అన్నాడు.

"అలాన్ జాగ్రత్త, కాలిపోతుందేమో" విర్గా అంది.

"అయితే అవనీ! వినండి...వినండి. ఇప్పుడు మేం ఇలా కాలిపోయినా మాకేం లెక్కలేదు" అంటూ అలాన్ గట్టిగా అరిచాడు.

"అలాన్, నా తర్వాత నువ్వు ఎంతసేపు ఉంటావో తెలీదు కదూ" విర్గా అంది.

"మనం బతికి ఉన్నంతవరకూ ప్రియా! అంతవరకూ కలిసే ఉంటాం".

"అవును బతికి ఉన్నంతవరకూ కలిసే ఉంటాం".

అలాన్‌కి తలనొప్పి మొదలయింది. గొంతు కూడా నొప్పిగా ఉంది. అతను సిగరెట్ వెలిగించడం మర్చిపోయాడు. కారులో లైటు వేసి కవితల పుస్తకం తీసుకుని కాన్‌రాడ్ ఐకెన్ కవిత చదవడానికి ప్రయత్నించాడు. నాలుగు పంక్తులు చదివాడో లేదో అతనికి మగతగా అనిపించింది. పుస్తకం సీటు మీద పడిపోయింది. అతని తల వాలిపోయింది. అతని చేయి ఆమె భుజాల మీదకు వెళ్ళింది. విర్గా అప్పటికే తన తలని అతని భుజానికి ఆనించి కలల లోకంలో విహరిస్తోంది.

గట్టిగట్టి అరుపులు, కేకలు వాళ్ళను మళ్ళీ స్వర్గం నుంచి భూమి మీద పడేశాయి. అప్పటికే కారు అద్దాలు పగలగొట్టేశారు. వాళ్ళిద్దర్నీ ఎవరో బైటకు లాగుతున్నారు. విర్గా ముఖంమీద గట్టిగా కొడుతోంది బెర్తా. ఆమె వెంట వచ్చిన డిటెక్టివ్ బంధువు ఏకంగా అలాన్ భుజాలు పట్టి కుదుపుతూ అతన్ని ఎడాపెడా కొడుతున్నాడు. ఎలాగైనా స్పృహలోకి తీసుకురావాలనే ప్రయత్నంలో ఆ డిటెక్టివ్ బంధువు అలాన్ దవడని పగలకొట్టాడు కూడా.

అలాన్‌ని గ్రాండ్ రిపబ్లిక్ హాస్పిటల్‌లో చేర్పించింది బెర్తా. అతని చుట్టూ బంధువులు మూగి ఉన్నారు. వారి సమక్షంలోనే భర్తకు సపర్యలు చేసింది బెర్తా.

'అలాన్ ఏం చేశాడో తెలుసా? ఒక అమ్మాయితో కలిసి.. అతడికి నిజంగా సిగ్గులేదు. చివరికి ఆత్మహత్య చేసుకోబోయాడు' అంటూ కథలు కథలుగా చెబుతూనే ఉంది.

"నీకు పుణ్యం ఉంటుంది. ఇక్కడనుంచీ వెళ్ళు. నన్ను హింసపెట్టకు" అలాన్ గొణుగుతూ అన్నాడు. ఆమె నవ్వింది. ఆ తర్వాత కూడా వాళ్ళిద్దర్నీ బెర్తా వదిలిపెట్టలేదు. భర్త నుంచి విడాకులు తీసుకుంది విర్గా. ఒక షాపులో పనికి కుదిరింది. ఇక అప్పటినుంచీ అలాన్‌కి విర్గా రాసిపంపే ఉత్తరాలనన్నింటినీ బెర్తా తెరచి చదువుతూనే ఉండేది.

అంతటితో ఆగలేదు బెర్తా. "ప్రేమ! అలాన్ కొత్తగా ప్రేమించడం నేర్చుకుంటున్నాడు" అంటూ తన స్నేహితులకు ఎగతాళిగా చెబుతూనే ఉంది! నవ్య

## ఇలా అయ్యిందేమిటి అమలా?

అనుకున్నదొకటి... అయ్యిందొకటి అన్న చందంగా తయారైంది అమల వ్యవహారం. ఓ సినిమా అమల కాపురంలో చిచ్చు పెట్టింది. అదే సినిమా నుంచి ఇపుడు ఆమెను తప్పించబోతున్నారట! అసలు సంగతేమిటంటే ధనుష్‌తో సినిమా చేయడం అమల కుటుంబ సభ్యులకు ఇష్టం లేదు. దాంతో ఆ సినిమా చెయ్యొద్దంటూ ఆంక్షలు విధించారు. అత్తింటి వారి ప్రవర్తన నచ్చని అమల విడాకుల దాకా వెళ్ళింది. సినిమా కోసం కాపురాన్ని కూడా పణంగా పెట్టిన అమలకు అనుకోని రీతిలో ఎదురు దెబ్బ తగిలింది. ఏ సినిమా కోసమైతే భర్తనూ, కాపురాన్నీ కాలదన్నుకుందో ఆ సినిమా నుంచి అమలను తప్పించారన్న వార్త బాగా హల్‌చల్ చేస్తోంది. అమల విషయంలో జరుగుతున్న గొడవలు చూసిన యూనిట్ ఆమె స్థానంలో మరొకరిని తీసుకోవాలని నిర్ణయించుకుందట! ఈ సినిమాలో అమలను కొనసాగిస్తే దాని ఫలితం సినిమా సక్సెస్ మీద పడుతుందేమోనన్న భయంతో చిత్రం యూనిట్ ఈ నిర్ణయానికి వచ్చిందంటున్నారు. యూనిట్ నిర్ణయం తెలుసుకున్న అమలకు దిమ్మతిరిగి పోయిందట!

అనువాదం: జి.లక్ష్మి e-mail: guttalakshmi62@gmail.com

# వంటలు

## నువ్వుల పులగం



కావలసిన పదార్థాలు: కొత్త బియ్యం - పావుకిలో, వేయించిన నువ్వుల పొడి - 50 గ్రా, వేయించిన పెసరపప్పు - 50 గ్రా, ఉప్పు - తగినంత.

తయారీ విధానం: బియ్యం, నువ్వుల పొడి, పెసరపప్పు కలిపి ఒక గిన్నెలో ఉంచుకోవాలి. మరో పాత్రలో నీళ్ళు(ఒక గ్లాసుకి మూడు గ్లాసుల చొప్పున) తీసుకుని స్టవ్‌పై ఉంచి, నీళ్ళు మరిగాక కలిపి ఉంచుకున్న బియ్యం, నువ్వులపొడి, పెసరపప్పు, ఉప్పు వేసి ఉడికించాలి. అంతే, నువ్వుల పులగం రెడీ.

## కొబ్బరి బొబ్బట్లు

కావలసిన పదార్థాలు: కొబ్బరికాయలు - 2, మైదా - అర కేజి, బెల్లం లేదా పంచదార - పావుకేజి, యాలకులు - 3, నూనె లేదా నెయ్యి - 100 గ్రా, గసగసాలు - 100 గ్రా.

తయారీ విధానం: ముందుగా మైదాపిండిలో నీళ్ళు పోసి చపాతీ పిండిలా కలిపి రెండు గంటలు నాననివ్వాలి. తరువాత కొబ్బరి, బెల్లం తురుముకొని, రెండింటినీ ఒక గిన్నెలో వేసి ఉడికించాలి. కొబ్బరి, బెల్లం ఉడికి ముద్దలా అయి తీగపాకం వచ్చాక దించాలి. తర్వాత బాగా మెదిపి యాలకుల పొడి, దోరగా వేయించిన గసగసాలు వేయాలి. ఇప్పుడు ఈ కొబ్బరి ముద్దను నిమ్మ కాయ సైజులో ముద్దలుగా చేసుకోవాలి. నానబెట్టిన మైదాపిండిని చిన్న చిన్న ఉండలుగా చేసుకుని, ఒక్కోదాన్ని చిన్న పూరీలా ఒత్తి, అందులో కొబ్బరి ముద్ద పెట్టి పూరీతో చుట్టేసి చేత్తో లేదా అప్పడాల కర్రతో సున్నితంగా వత్తాలి. వీటిని బొబ్బట్ల మాదిరిగానే పెనం మీద నెయ్యి లేదా నూనె వేసి రెండు వైపులా దోరగా కాల్చాలి. అంతే కొబ్బరి బొబ్బట్లు రెడీ.



## మిల్క్ కేక్

కావలసిన పదార్థాలు: పంచదార- 4 కప్పులు, పాలు - 5 కప్పులు, బొంబాయి రవ్వ - ఒక కప్పు, నెయ్యి - 1 1/2 కప్పు.

తయారీ విధానం: ముందుగా ఒక పాత్రలో పాలు పోసుకుని, అందులో బొంబాయి రవ్వ, పంచదార, నెయ్యి అన్నీ కలపాలి. పాత్రను స్టవ్‌పై ఉంచి, సన్నని సెగపై రవ్వ ఉడికి దగ్గరగా అయ్యేంతవరకూ గరిటతో తిప్పుతూ ఉండాలి. అలా నెయ్యి పైకి తేలేంతవరకూ ఉడికించుకోవాలి. తరువాత నెయ్యి రాసిన ట్రేలో పోసి పైన జీడిపప్పు, కిస్‌మిస్ వేసి చల్లార్చాలి. ఆపైన కావాల్సిన సైజులో కట్ చేసుకోవాలి. అంతే మిల్క్ కేక్ స్వీట్ రెడీ టూ ఈట్ అంటూ నోరూరిస్తుంది మీకు.



## శనగపప్పు పాయసం

కావలసిన పదార్థాలు: శనగపప్పు - ఒక కప్పు, సగ్గుబియ్యం - అరకప్పు, బెల్లం - రెండు కప్పులు, పాలు - ఒకటిన్నర కప్పు, నేతిలో వేయించిన జీడిపప్పు, బాదం, కిస్‌మిస్‌లు, యాలకులు - తగినన్ని.



తయారీ విధానం: ముందుగా శనగపప్పు, సగ్గుబియ్యం కలిపి ఉడికించుకోవాలి. తరువాత పాలల్లో కాసిని నీళ్ళు చేర్చి పొయ్యి మీద పెట్టాలి. అవి మరుగుతున్నప్పుడు ముందుగా ఉడికించి పెట్టుకున్న శనగపప్పు, సగ్గుబియ్యాన్ని వేసేయాలి. రెండు నిమిషాల తరువాత బెల్లం తురుము కూడా చేర్చాలి. పాయసం దగ్గరగా అవుతున్నప్పుడు వేయించి పెట్టుకున్న జీడిపప్పు, బాదం, కిస్‌మిస్‌లను చేర్చితే సరిపోతుంది. మరింత చిక్కగా కావాలనుకుంటే రెండు చెంచాల గోధుమపిండిలో కాసిని నీళ్ళు చేర్చి పాయసంలో వేసుకోవచ్చు.

## సేమ్యా కట్‌లెట్

కావలసిన పదార్థాలు: సేమ్యా - 200 గ్రా, బియ్యప్పిండి - అరకప్పు, బంగాళదుంప - 200 గ్రా, క్యారెట్ తురుము - 50 గ్రా, ఉల్లి తరుగు - 50 గ్రా, గరం మసాలా - టీ స్పూను, కొత్తిమీర - కట్ట, కారం - టీ స్పూను, ఉప్పు - తగినంత, నూనె - తగినంత

తయారీ విధానం: ముందుగా బంగాళదుంపను ఉడికించి తొక్కతీసి మెత్తగా గుజ్జు చేసి ఉంచుకోవాలి. బాణలిలో తగినంత నీరు పోసి అందులో సేమ్యా, క్యారెట్ తురుము వేసి ఉడికించి ఉంచాలి. ఒక గిన్నెలోకి ఉడికించుకున్న ఈ పదార్థాలను, ఉప్పు, కారం, ఉల్లితరుగు, బియ్యప్పిండి, గరంమసాలా, కొత్తిమీర కలిపి ముద్దగా చేయాలి. ఈ ముద్దను చిన్న ఉండలుగా తీసుకుని నచ్చిన ఆకారంలో కట్‌లెట్లను తయారు చేసుకోవాలి. పెనం మీద కొద్దిగా నూనె వేసుకుంటూ కట్‌లెట్లను రెండు వైపులా బాగా కాల్చుకోవాలి. సేమ్యా కట్‌లెట్ టొమాటో సాస్‌తో సర్వ్ చేస్తే బావుంటుంది.






# స్మోక్ డిటెక్టర్

**ఒక్కరాత్రిలోనే ఏటీఎం సెంటర్లనుంచి నలభైఅయిదు లక్షల రూపాయలు అక్రమంగా విత్‌డ్రా అయ్యాయి. ఏటీఎం కార్డుల అవసరం లేకుండానే ఈ లావాదేవీలు జరిగాయి. కస్టమర్లకు విత్‌డ్రా మెసేజ్‌లు రావడంతో వాళ్ళంతా గగ్గోలు పెట్టారు. ఈ మిస్టరీ ఛేదించేందుకు డిటెక్టివ్ శరత్ రంగంలోకి దిగాడు. అసలు ఎవరు ఆ దొంగలు? వాళ్ళకి అదెలా సాధ్యపడింది? డిటెక్టివ్ చేసిందేమిటి?**

**అర్ధరాత్రి మెలకువ వచ్చింది ఆనంద్‌కి. టాయి లెట్‌కి వెళ్ళొచ్చి టైమ్ ఎంతైందో అనుకుంటూ సెల్‌ఫోన్ చూశాడు. ఏదో మెసేజ్ వచ్చిన సూచన కనిపించింది. తనకళ్లను తానే నమ్మ లేకపోయాడు. మరోసారి జాగ్రత్తగా చూసే సరికి గుండె ఆగినంత పనైంది. అతడికి మెలకువ రావటానికి సరిగ్గా అరగంట ముందు ఎవరో అతడి ఎకౌంట్‌లోంచి డబ్బులు తీశారు.**

గబగబా వెళ్లి పర్సుతీసి చూశాడు. 'బ్యాంకు ఏటీఎం కార్డు తన దగ్గరే ఉంది. మరి డబ్బులు ఎవరు, ఎలా తీయగలుగుతారు?'

అతడి ఒళ్లంతా వణుకుతోంది. గబగబా బ్యాంకు 24 గంటల హెల్ప్‌లైన్ నెంబరుకు ఫోన్ చేయడం ఆరంభించాడు.

•••

'ఒక్కరాత్రిలో దాదాపు నలభై అయిదు లక్షలు దోపిడీ! చేసిందెవరో తెలుసుకోవాలి. వారిని పట్టి బంధించి ఆ డబ్బు వసూలుచేయాలి' ప్రాధేయ పడుతున్నట్టు అడిగాడు బ్యాంకు అధికారి.

తల పంకించాడు డిటెక్టివ్ శరత్. 'అసలు ఈ విషయాన్ని మీరు సైబర్‌క్రైమ్ సెల్‌కి తెలియ జేశారా?'

'చెప్పాను. బ్యాంకు ఉద్యోగుల సహాయం లేకుండా 'పిన్' నెంబరు ఎలా తెలుస్తుందంటు న్నారు. మీరు కూడా పరిశోధిస్తే కేసు త్వరగా పరిష్కారమవుతుంది'.

'ఈ డబ్బంతా ఒక్కరాత్రిలో ముంబాయిలోని ఏటీఎంల నుంచే విత్‌డ్రా చేశారు'.

'సరే, అక్రమ విత్‌డ్రాలకు గురైన ఏటీఎం కార్డుల వివరాలతోపాటు, రెండు మూడు నెల లుగా ఆ కార్డులతో ఎక్కడెక్కడ ట్రాన్సాక్షన్స్ చేశారో ఆ సమాచారమంతా ఇవ్వండి' అడిగాడు శరత్.

•••

"ఏటీఎం అంటే ఆటోమేటెడ్ టెల్లర్ మెషీన్ (Automated Teller Machine). ఈ యంత్రా లలో డబ్బులు ఉంచేందుకు స్థలం ఉంటుంది. ప్రతి కస్టమర్‌కు ప్రత్యేకమైన ప్లాస్టిక్‌కార్డు ఇస్తారు. ఆ కార్డులో కస్టమర్‌ను గుర్తించే మాగ్నెటిక్ స్ట్రిప్ (Magnetic Stripe) ఉంటుంది. దీనికి తోడు కస్టమర్‌కు ప్రత్యేకమైన PIN నెంబరు ఉంటుంది. పిన్ నెంబరు, కార్డు సమాచారం సరిపోలినప్పుడే డబ్బులు బయటకు వస్తాయి." ఏటీఎం పని తీరును శరత్‌కు వివరించాడు బ్యాంకు అధికారి.

'మీ ఏటీఎంలలో రహస్య కెమేరాల ద్వారా పిన్ నెంబరు తెలుసుకునే వీలుంటుందా?'

'ఇంపాజిబుల్. మా ఏటీఎంలలో సిసిటీవీలు న్నాయి. ప్రతి రోజూ వాటిని పరిశీలించి కాపీ చేసి భద్రపరుస్తాం. ఏటీఎంలలోకి వచ్చినవాళ్ళు రహస్యంగా అక్కడ కెమెరా ఉంచి వెళ్లే అవకాశం లేదు'.

'కాసేపు ఆలోచించాడు శరత్.

'ఏటీఎంలలో రికార్డైన వీడియోలు కావా లంటే నాకు లభిస్తాయా?'

'తప్పకుండా'.

'ముంబాయిలో ఏటీఎంలలో డబ్బులు తీసిన సమయాన్ని బట్టి ఆయా ఏటీఎంల వీడియోలు సంపాదిస్తే దొంగలు దొరుకుతారు కదా?'

'దొంగలు తెలివైనవాళ్ళు. గార్డులు లేని ఏటీ ఎంలనే వాళ్ళు ఎంచుకున్నారు. ఏటీఎంలలోకి ముసుగులు ధరించి వచ్చారు. కెమేరాపై ఆ ముసుగులు కప్పేశారు'.

తల పంకించాడు శరత్.

•••

'బాస్... నీ ఊహ కరెక్టే' ఉత్కంఠ ఆపుకోలేక అరిచాడు అసిస్టెంట్ రాము.

రామూవైపు ప్రశ్నార్థకంగా చూశాడు శరత్.

'బాస్. చోరీకి గురైన ఏటీఎం కార్డులన్నీ హైదరాబాదులోని ఒక ఏటీఎంలో గత రెండు నెలల్లో కనీసం ఒక్కసారైనా ఉపయోగించినవే'.

ఒక్క అంగలో రాముని చేరుకున్నాడు శరత్.

చోరీకి గురయిన ఏటీఎం కార్డులు ఏయే ఏటీఎం సెంటర్లలో వాడారో జాబితా తయారు చేశాడు రాము. ఆ తరువాత కామన్‌గా వాడిన ఏటీఎం సెంటర్ల జాబితా తయారు చేశాడు. ఆ కార్డులన్నీ హైదరాబాదులోని ఆ ఏటీఎంలో ఒక్క సారైనా వాడినవే అని పరిశీలనలో తేలింది.

'ఒక ఆధారం దొరికింది' అన్నాడు శరత్.

•••

తనకు అందిన ఏటీఎం వీడియోల్ని పరిశీల నగా చూస్తున్నాడు శరత్.

'దొంగలు అత్యంత ఆధునిక పరిజ్ఞానాన్ని ఉపయోగించారని నా అనుమానం. ఏటీఎంలో స్కిమ్మింగ్ యంత్రాన్ని ఉంచారేమో!'

'స్కిమ్మింగ్ యంత్రమా?'

'ఇది కార్డ్ రీడర్‌లాంటిది. ఇది సరిగ్గా ఏటీ ఎంలో కార్డును దూర్చే స్థానంలో పైన అమరు స్తారు. కార్డు మీద ఉన్న మాగ్నెటిక్ స్ట్రిప్‌లోని సమాచారాన్ని ఏటిఎం యంత్రం ఎలా తెలుసు కుంటుందో, ఈ స్కిమ్మర్ కూడా ఆ సమా చారాన్ని అదే పద్ధతిలో తెలుసుకుని దొంగలకు చేరవేస్తుంది. అంటే ఏటీఎం యంత్రంలో మనం కార్డు పెడుతున్నామంటే, దొంగచేతికి 'ఇంటి తాళం' ఇస్తున్నట్టే అన్నమాట'.

'కానీ పిన్ నెంబరు కావాలి కదా?'

'దానికి రహస్య కెమేరా లేదా ఫేక్ కీ ప్యాడ్ ఏర్పాటుచేసి ఉండాలి. అసలైన కీ ప్యాడ్‌పైన దాన్ని అమరుస్తారు. దానిపై టైప్‌చేసిన ప్రతీదీ దొంగలకు చేరుతుంది' అని ఆగి ఆలోచించి అన్నాడు శరత్. 'వీడియోలు చూసే సంగతి పక్కనపెట్టు. ఆ ఏటీఎంను ఓసారి ఓపెన్‌చేసి చూద్దాం' అంటూ బయల్దేరాడు శరత్.

•••

ఏటీఎంను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు శరత్. బ్యాంకు అధికారి శరత్‌వైపు ఉద్విగ్నంగా చూస్తు న్నాడు.

ముందుగా కీ బోర్డును పరిశీలించాడు. ఫేక్ కీ బోర్డులేదు. అంటే, పిన్ నెంబరు తెలుసుకోవా లంటే రహస్య కెమేరాను వాడటం తప్ప మరో మార్గం లేదు.

'ఏటీఎం కార్డు పెట్టే చోట స్కిమ్మింగ్ యంత్రాన్ని సైబర్ నిపుణులు కనుగొన్నారు' చెప్పాడు బ్యాంకు అధికారి.

అతడి మాటలు విననట్టే తన పని తాను చేసుకుంటూ పోసాగాడు శరత్. ఏటీఎం యంత్రం పైన చూశాడు. కప్పును జాగ్రత్తగా పరిశీలించాడు. కెమేరా తొలగించి చూశాడు.

'ఒకవేళ దొంగలు తీసుకెళ్లిపోయారేమో?' అన్నాడు రాము.

'స్కిమ్మింగ్ యంత్రాన్ని వదలినవాళ్లు రహస్య కెమేరాను ఎందుకు తీసుకువెళ్తారు?'

అదీగాక మళ్లీ వస్తే పోలీసు బందోబస్తు అధి కంగా ఉంటుంది. ముసుగులు వేసుకునే వీలుం డదు. పట్టుబడతారు'

వెతుకుతున్న శరత్ కళ్లు మెరిశాయి.

'ఈ ఏటీఎంలో స్మోక్ డిటెక్టర్లు రెండున్నాయి'



అన్నాడు శరత్.

అయోమయంగా చూశాడు బ్యాంకు అధికారి.

వాటిని చూపిస్తూ, 'వీటిల్లో ఒకటి అసలు, రెండోది నకిలీ' చెప్పాడు శరత్.

గ్లవ్స్ వేసుకున్న చేతులతో వాటిని తీసి చూశాడు.

'నిజమే! వాటిల్లో ఒకటి స్మోక్ డిటెక్టర్‌లా కనిపించే కెమేరా!

శరత్ జాగ్రత్తగా దాన్ని తీసి ప్లాస్టిక్ కవర్‌లో వేశాడు.

'దీన్లో దుమ్ము చేరే అవకాశం తక్కువ. ఒక వేళ వాళ్లు గ్లవ్స్ లేకుండా దాన్ని అమర్చి ఉంటే వేలిముద్రలు దొరికే వీలుంది' అన్నాడు శరత్.

•••

'ఇప్పుడు వేలిముద్రల పరిశీలన ఓ ప్రత్యేక శాస్త్రం. వేలిముద్రల ఆధారంగా ఆ వేలిముద్ర ఏ జాతికి చెందిన వ్యక్తిదో తెలుసుకునే వీలుంది వేలిముద్రల పరిశీలన నిపుణుడు నవీన్ అన్నాడు.

'అంటే ఇప్పుడీ వేలిముద్రలు చూసి ఇతడు ఏ జాతివాడో చెప్పగలరా?' అడిగాడు శరత్.

'తప్పకుండా... వేళ్లపై ఉండే గీతలు ఉల్నార్ లూప్, వోర్ల్, రేడియల్ లూప్, ఆర్ట్ అని విభజిస్తారు. ఉల్నార్‌లూప్ చిటికెన వేలివైపు ఒరిగి ఉంటుంది. మనకు జాతులను గుర్తించటంలో వర్తులాకార గుచ్ఛాలు (Whorls) ఆర్చ్‌కు పనికి వస్తాయి. చూడండి ఈ వోర్ల్స్, ఆర్చ్‌లు ఈ వేలి ముద్రలో ఎక్కువగా ఉన్నాయి. ఆసియన్ల వేళ్లపై ఇవి తక్కువగా ఉంటాయి. కాబట్టి ఈ వేలిముద్ర ఆసియాకు చెందిన వాళ్లది కాదు. ఈ ఆర్చ్‌లు యూరోపియన్ల వేళ్లపై 25 శాతం అధికంగా ఉన్నాయి. వోర్ల్స్ 50 శాతం అధికంగా ఉన్నాయి. కాబట్టి ఇది ఆఫ్రికావాళ్ళ వేలి ముద్ర. అంత వరకూ కచ్చితంగా చెప్పగలను. మరో వేలిముద్ర ఇచ్చి పోల్చమంటే పోల్చగలను' అన్నాడు నవీన్.

'థాంక్యూ' చెప్పాడు శరత్ సంతోషంగా. బయటకు నడుస్తూ ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోను చేశాడు.

•••

'వేలిముద్ర ప్రకారం ఇతడు ఆఫ్రికా దేశ వాసి అని తెలుస్తోంది. ముంబాయి హోటల్స్ అన్నిటికీ కబురుపెడితే, ఆఫ్రికన్స్ ఏ హోటల్‌లో గది తీసుకున్నారో తెలుస్తుంది. అప్పుడు వాళ్ల వేలిముద్రలు సేకరించటం కష్టం కాదు' అన్నాడు శరత్. తల ఊపాడు విజయ్. 'ముంబాయి ప్రయాణానికి సిద్ధమేనా?' అడిగాడు నవ్వుతూ.

•••

ముంబాయిలో ఆఫ్రికా జాతీయులు గదులు తీసుకున్న హోటళ్ల జాబితా తీసుకున్నారు శరత్, విజయ్. వారి పాస్‌పోర్టుల కాపీలు, వేలి ముద్రలు సేకరించారు. వాటన్నింటినీ తమ వద్ద ఉన్న వేలిముద్రతో మ్యాచ్ చేసేందుకు ల్యాబ్‌కు పంపారు. ఈలోగా ఆ జాబితాలోని వాళ్ళని కలవటం ఆరంభించారు'.

'ఇది చూడు శరత్' చూపించాడు విజయ్.

'ఈ నలుగురూ నైజీరియన్లు. నిన్నటివరకూ మామూలు హోటల్లో ఉండేవారు. ఇప్పుడు ఫైవ్ స్టార్ హోటల్‌కు షిఫ్ట్ అయ్యారు. అంత డబ్బు వారికెలా వచ్చిందో?'

'వాళ్లనే అడుగుదాం పద' అన్నాడు లేస్తూ.

•••

'ఉయ్ ఆర్ గోయింగ్ హోమ్ మేన్. ఉయ్ డోన్ట్ నీడ్ టు సేవ్ మనీ. ఉయ్ ఆర్ ఎంజాయింగ్ ది లగ్జరీ. వాటీజ్ యువర్ ప్రాబ్లమ్.' శరత్ గుండెపై వేలుపెట్టి వెనక్కి తోస్తూ అడిగాడు నైజీరియన్.

అతడి వెనకగదిలో సంబరాలు జరుగుతున్న గోల తెలుస్తోంది. ఆడమగ కేరింతలు, పెద్ద వాల్యూమ్‌లో కేకల్లాంటి పాటలు వినిపిస్తున్నాయి.

తన గుండెను తడుతున్న ఆ వేలు పట్టుకుని పరిశీలనగా చూశాడు శరత్. విజయ్‌వైపు తిరిగి, 'కెమేరాను ఏటీఎంలో పెట్టింది ఈ వేలే అయిఉంటుందంటావా?' అన్నాడు ఆంగ్లంలో.

జేబులోంచి ఓ కాగితం తీశాడు విజయ్. 'ఏదీ నీ వేలిముద్ర ఇయ్యి' అడిగాడు.

'వాటీజ్‌దిస్? ఆర్ యూ బ్రఫూన్స్ మేన్.' కోపంగా అడిగాడు నైజీరియన్ జేబులో చేయి పెడుతూ.

ఇంతలో మరో ఇద్దరు నైజీరియన్లు బయటకు వచ్చారు.

జేబులో చేయి పెట్టగానే శరత్ అలర్టయ్యాడు. అతడి చేయిని మెలితిప్పి వంచాడు.

బాధతో మూలిగాడు నైజీరియన్.

మిగతా ఇద్దరు తుపాకులు తీశారు.

వెంటనే విజయ్ తుపాకీ తీసి వారికి గురి పెట్టాడు.

'వాట్స్ హేపెనింగ్?' అని అడుగుతూ వచ్చిన ఓ అమ్మాయి తుపాకులను చూసి 'కెవ్వు'మని కేకవేసింది.

'మీలో మార్టిన్ ఎవరు?' అడిగాడు శరత్.

'నేనే' బాధతో శరత్‌చేయి వదల్చుకోవాలని ప్రయత్నిస్తున్న నైజీరియన్ అన్నాడు.

'మీ ముగ్గురినీ ఏటీఎం ఫ్రాడ్ కేసులో అరెస్టు చేస్తున్నాం' అన్నాడు శరత్. అప్పటికే అతడికి వాట్సప్‌లో నవీన్ నుంచి వేలిముద్ర కన్ఫర్మేషన్ మెసేజ్ అందింది.

కాస్త దూరంలో తుపాకులు పట్టుకుని సిద్ధంగా ఉన్న పోలీసులను చూసి 'శరత్, విజయ్‌లపైకి లంఘించాలన్న ఆలోచన విరమించారు ఆ నైజీరియన్లు.

**-కస్తూరి మురళీకృష్ణ**

**సెల్: 98496 17392**

10

# హావేలీ

-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474



**గోవర్ధన్ అలా వెళ్ళగానే రమణమూర్తి సెల్‌తీసి ఏదో నంబర్‌కి డయల్ చేశాడు.**

**"సర్, నేను రమణమూర్తిని మాట్లాడుతున్నాను. రత్నగిరి హవేలీ కేసు గురించి వేరే ఎవరినైనా అపాయింట్ చేశారా?"**

**క్షణం ఆలస్యం లేకుండా "లేదే" అన్న సమాధానం వచ్చింది. ఆ మాట్లాడేది అసిస్టెంట్ కమీషనర్ దేవరాజ్.**

**"సర్, ఎవరో గోవర్ధన్ అట. ఇప్పుడే వచ్చి హవేలీ గురించి ఫైల్ అడిగి తీసుకెళ్ళాడు".**

విస్తుపోయాడు దేవరాజ్. 'ఎవరికీ ఇన్ఫర్మేషన్ ఇవ్వొద్దని తనకు చెప్పి ఇతను చేసిందేమిటి? మన డిపార్ట్‌మెంట్ రహస్యాలు మనం కాక మరెవరు కాపాడుతారంటూ ఏవేవో మాట్లాడి ఇప్పుడు తాను మాత్రం కుండబద్దలు కొట్టినట్టు చెప్పేశాడు. ఇదే కాబోలు సీఐడీ మార్కు అపరాధ పరిశోధన' అనుకుంటూ తల పట్టుకున్నాడు.

"అతను అక్కడ ఉండగానే నాకు ఫోన్ చెయ్యక పోయావా?"

"అతనున్నంతసేపూ కాళ్ళూ చేతులూ ఆడలేదంటే నమ్మండి".

"సరేసరే. ఇంకేం, అంతా తెలిసిపోయిందిగా. ఈ కేసును తొందరగా తెమిల్చేందుకే అతన్ని నియమించారు. కాస్త జాగ్రత్తగా మసలుకోండి.

## జరిగిన కథ

రత్నగిరి సంస్థాన రాచమహలు హవేలీ ప్యాలెస్. అందులో నివసించిన మహారాజా కుటుంబంలోని వారంతా ఒక్కొక్కరూ అదృశ్యమైపోవడం మిస్టరీగా మారుతుంది. అదొక పాడుబడ్డ దయ్యాలమేడగా పేరుపడుతుంది. ప్యాలెస్‌లో అక్రమ కార్యకలాపాలు జరుగుతున్నాయని తెలిసి పోలీసులు జోక్యం చేసుకుంటారు. కానీ పలుకుబడిగల 'అక్రమార్కులు' వారిని అడ్డుకుంటారు. ఆ ఊరికి అతిథిగా వచ్చిన విష్ణు ఆ రహస్యం కనిపెట్టేందుకు ప్యాలెస్‌లోకి ప్రవేశించి హత్యా దృశ్యం చూస్తాడు. ఆ శవం క్షణాల్లో మాయం కావడం చూసి దిగ్భ్రాంతికి గురవుతాడు. అదృశ్యమైపోయిన తన కొడుకు జాడకోసం ప్యాలెస్‌కెళ్ళి వెతుకుతాడు కాంట్రాక్టర్ దివాకర్. ఆ ప్యాలెస్‌ను అడ్డాగా చేసుకుని అక్రమ వ్యాపారాలు జరుగుతున్నట్టూ, బడా బిల్డర్లు, ఎమ్మెల్యే కొడుకులు ఈ వ్యవహారంలో ఉన్నట్టూ, వాళ్ళే తన కొడుకును చంపేసినట్టూ గ్రహిస్తాడు. మరోవైపు సీఐడీ స్పెషల్ ఆఫీసర్ గోవర్ధన్ ఈ కేసు దర్యాప్తు కోసం రంగంలోకి దిగుతాడు. **ఆ తర్వాత.....**

ఆవులిస్తే పేగులు లెక్కబెట్టే రకం".

దేవరాజ్ ఫోన్ కట్ చేయగానే మళ్ళీ మోగిందతని ఫోన్. చూస్తే గోవర్ధన్!

"హలో సర్! థాంక్యూ వెరీమచ్" గోవర్ధన్ నవ్వు వినిపించింది.

"ఎందుకు థాంక్స్? నన్ను ఏమీ చెప్పొద్దని చెప్పి మీరేమో అన్నీ చెప్పేశారే!"

"మిమ్మల్ని చెప్పొద్దన్నాను గానీ నేను చెప్పనని అనలేదే! నాకు నేనుగా పరిచయం చేసుకోవాలనుకున్నాను. చేసుకున్నాను. దట్సాల్. అయినా నేను ఎవరో చెప్పకపోతే వివరాలెలా దొరుకుతాయండీ? ముందుగా ఇన్ఫర్మేషన్ వెళ్ళిపోతే ఫైళ్ళు మారిపోయే అవకాశం ఉంది కదా! ఏమంటారు?" అతని నవ్వు చిన్నగా వినిపించింది దేవరాజ్‌కు.

జుత్తు పీక్కుందామనిపించిందతనికి. "యు ఆర్ రైట్. ఓకే సర్. విష్ యూ ఆల్ సక్సెస్" అనేసి ఫోన్ కట్ చేశాడు దేవరాజ్.

నవ్వుతూ ఫోన్ జేబులో పెట్టుకుని రత్నగిరి వైపు బయలుదేరాడు గోవర్ధన్.

అక్కణ్ణుంచి కొండమలుపు వరకూ వెళ్ళేందుకు టాక్సీ ఎక్కాడు. సరిగ్గా కొండ మలుపులో పాక దగ్గర దిగి టాక్సీని పంపేశాడు. అప్పుడు సమయం నాలుగ్గంటలు.

మెల్లగా పాక పక్కనే కొండ అంచుకు వచ్చి నిలబడి దూరంగా ఉన్న గ్రామాన్ని, పక్కనే ఉన్న హవేలీని చూశాడు. కొండ దిగువన కాస్త దూరంలో కాలిబాట కనిపించింది. కాస్త దూరంగా జీపులు, బస్సులు వెళ్ళేందుకు అనువుగా మంచిరోడ్డు కూడా కనిపించింది.

అక్కణ్ణుంచి హవేలీ దూరాన్ని రమారమీగా అంచనా వేసుకుని కాలిబాటన కొండ దిగడం ప్రారంభించాడు గోవర్ధన్.

కొండదిగి చదును ప్రాంతానికి వచ్చి హవేలీ వైపు ముందుకు సాగుతుండగా దూరంగా ఎవరో ఇటువైపే వస్తున్నట్టనిపించింది. తన నడక ఆపలేదు గోవర్ధన్.

ఆ వచ్చే వ్యక్తి, గోవర్ధన్ ఇద్దరూ ఒకే సమయానికి హవేలీకి దగ్గరున్న జంక్షన్ చేరుకున్నారు. ఆ వ్యక్తి గోవర్ధన్ వంక ఎగాదిగా చూశాడు.

"ఎవరు కావాలి?" కరకుగా ఉన్నాయతని మాటలు.

జవాబివ్వలేదు గోవర్ధన్. గుచ్చిగుచ్చి అతన్నే చూశాడు.

"నిన్నే అడుగుతున్నది ఎవరు నువ్వు? ఎందుకొచ్చావిక్కడికి? ఏం కావాలి?"

ఒక విషయం అర్థమైంది గోవర్ధన్‌కు. ఎవరో కొందరు గ్రామ ప్రజలు హవేలీని కాపాడుతు



న్నారు. అందులో ఏదో విషయం లేకుంటే అలా చెయ్యాల్సిన పనిలేదు.

"నేను టూరిస్ట్‌ని. దక్షిణ భారతదేశ యాత్ర చేస్తున్నాను. దూరం నుంచి చూడ్డానికి హవేలీ చాలా బాగా కనిపిస్తే దగ్గరగా చూద్దామని వచ్చాను".

"ఇది కేవలం దూరం నుంచి చూడ్డానికే! దగ్గరికి ఎవరూ వెళ్ళకూడదు. చూశావుగా, ఇక వెళ్ళు" అతని గొంతులో అదే కాఠిన్యం.

కాసేపు అతని కళ్ళలోకి నిశితంగా చూశాడు. 'ఎలాగైనా లోపలికి వెళ్ళాలి. అడ్డుపడే వాళ్ళ కళ్ళు గప్పి వెళ్ళాలి. హవేలీలోని ప్రతి అణువూ శోధించాలి. అప్పుడే కేసు విడివడుతుంది. అందుకు రాత్రి సమయమే సరైంది. అయితే చీకట్లో సాధ్యమా?' ఆలోచిస్తూ వెనుదిరిగాడు గోవర్ధన్.

అతను కాస్త దూరం వచ్చాక "తొందరగా వెళ్ళు. చీకటిపడ్డాక పాములెక్కువగా ఉంటాయి ఇక్కడ. నిండా విషం. కాటేస్తే బతకడం కల్ల" అన్నాడు ఆ వ్యక్తి కాస్త గట్టిగా.

బెదిరిస్తున్నట్టనిపించి నవ్వుకున్నాడు. వెనుదిరిగి దాదాపు అర కిలోమీటరు వచ్చాక తిరిగి చూస్తే వాడింకా అక్కడే నిలబడి ఉన్నాడు.

అనుక్షణం ఎవరో ఒకరు ఆ హవేలీ చుట్టు పక్కల పహారా ఉన్నట్టు అనిపించింది. గోవర్ధన్ తిరిగి చూడ్డంతో అతను కూడా వెనక్కి తిరిగి గ్రామంలోకి వెళ్ళసాగాడు.

రెండడుగులు ముందుకు వేసిన గోవర్ధన్‌కు కొంతదూరంలో ఒక కుక్క ఎముక ముక్కను నోట కరచుకుని వస్తూండడం కనిపించింది. అది అక్కడి పొలాల్లోనుంచే వస్తున్నట్టు అనిపించింది. గోవర్ధన్‌ను చూడగానే కాస్తంత నక్కి నక్కి రాసాగింది.

దగ్గరికి రాగానే కాలితో దాన్ని అదిలించాడు గోవర్ధన్. ఆ అదిలింపుకు చిన్నగా అరిచి, నోట్లో ఎముకను జారవిడిచి గ్రామంలోకి పరుగు తీసిందా కుక్క.

కిందపడ్డ ఎముకను చూసిన గోవర్ధన్ కించిత్ ఆశ్చర్యపోయాడు. అవి మనిషి అరచేతి ఎముకల్లా అనిపించాయి. మెల్లగా ఎముకను చేతిలోకి తీసుకుని పరీక్షగా చూస్తే అతని అనుమానం నిజమేననిపించింది. చుట్టుపక్కల చూశాడు. కొద్ది దూరంలో తిని పడేసిన ప్లాస్టిక్ కవరొకటి దొరికింది. దాన్ని తీసుకుని అవన్నీ దాన్లో వేశాడు.

ఆ కుక్క ఎక్కణ్ణుంచి వస్తోందోనని అంచనా వేశాడు. 'పొలాల్లో నుంచి వస్తున్న కారణంగా సాధారణంగా దాని దారి సరళరేఖే అయి ఉండాలి' అనుకుని అది వచ్చిన దారి వైపే వెళ్ళాడు గోవర్ధన్. కొంతదూరం వెళ్ళాక మరికొన్ని ఎముకలు కనిపించాయి. అవి కాలి పాదం ఎముకల్లా ఉన్నాయి. వాటిని కూడా సేకరించి కవర్లో వేసుకున్నాడు.

అప్పటికే చీకటి పడసాగింది. అక్కడికి తన పరిశోధన ఆపి వెనుదిరిగాడు గోవర్ధన్.

టైం చూసుకుంటే దాదాపు ఆరు కావస్తోంది. కాలిబాట వెంబడి కొండమీదికి చేరుకుని పాకలో టీ తాగి అరకు వెళ్ళే బస్సెక్కిన గోవర్ధన్ మరో అరగంటకు అరకు చేరుకున్నాడు. వెంటనే ఆ రాత్రికి బస చెయ్యడానికి అనువైన ప్రదేశం కోసం వెదికి, బస్టాండుకు దగ్గరగా ఒక హోటల్లో దిగాడు.

సమయం రాత్రి సుమారు ఏడున్నర గంటలు కావస్తోంది. బయటికి వెళ్ళి కాస్త టిఫిన్ చేసొచ్చి నడుం వాల్చాడు. అప్పుడు మధ్యాహ్నం తాను రమణమూర్తిని అడిగి తీసుకున్న ఫైల్ తీసి మళ్ళీ మరోసారి తిరగేశాడు.

మరుసటిరోజు ఉదయం పది గంటలకు మళ్ళీ రత్నగిరి బయలుదేరాడు. నేరుగా క్రితం రోజు ఎముకలు దొరికిన ప్రదేశానికి వెళ్ళి ఆ ప్రదేశాన్నంతా విహంగ వీక్షణం చేశాడు. అతనికి కొద్దిగా





## గొడవలే కారణమట!

'జనతాగ్యారేజీ' ఆడియో ఫంక్షన్‌కి సమంత డుమ్మా కొట్టడానికి కారణం షూటింగ్ సమయంలో తలెత్తిన గొడవలే కారణం అంటున్నారు. ఆ కారణంగానే అనారోగ్యం వంకతో ఫంక్షన్‌కి డుమ్మా కొట్టిందనీ, ఆ మరుసటి రోజు బెంగుళూరులో ఓ రెస్టారెంట్ ఓపెనింగ్‌కి వెళ్ళిందనీ, ఆరోగ్యం బాగాలేకపోతే బెంగుళూరు ఎలా వెళ్ళింది? అని టాలీవుడ్ జనాలు ప్రశ్నిస్తున్నారు. ఆరోగ్యం బాగా లేకపోతే రెస్టారెంట్ ఓపెనింగ్‌కి వెళ్ళి లొట్టలేసుకుంటూ అక్కడ బిర్యానీ ఎలా తినగలుగుతుందని వారు అంటున్నారు. మొత్తానికి సమంత కావాలనే డుమ్మా కొట్టింది అన్నది సినీ జనాల మాట.

ఆశ్చర్యం కలిగింది. క్రితం రోజుకూ ఇప్పటికీ అక్కడేదో తేడా కొట్టొచ్చినట్టుగా కనిపించింది.

క్షుణ్ణంగా పరిశీలిస్తే ఆశ్చర్యకరమైన విషయం బయటపడింది. క్రితం రోజున ఆ ప్రాంతంలో గడ్డి కాస్త ఏపుగా పెరిగి ఉంది. ఇప్పుడా ప్రాంతమంతా చదును చేయబడి చీపురుతో శుభ్రంగా చిమ్మేసినట్టుంది. అది కూడా అక్కడ కొంతమేరకే! ఇంకాస్త శ్రద్ధగా పరిశీలిస్తే అక్కడక్కడ కొద్దిగా బూడిద కూడా కనిపించింది.

అంతకంతకూ అతని ఆశ్చర్యం ఎక్కువకాసాగింది. అంటే క్రితం రోజు తను వచ్చి వెళ్ళాక ఇక్కడేదో జరిగింది. ఎవరో ఈ ప్రదేశాన్నంతా శుభ్రం చేశారు. బహుశా ఇక్కడ మిగతా ఏవైనా ఎముకలుంటే వాటన్నింటినీ తీసేసి ఏ విధమైన ఆధారాలు లేకుండా చేసేందుకు ప్రయత్నించినట్టున్నారు. రమణమూర్తి ఇచ్చిన ఫైల్లో హవేలీ గురించి కొంత సమాచారం ఉంది. చూడబోతే హవేలీ మాత్రమే కాక గ్రామం మొత్తం ఏదో మిస్టరీగా అనిపించింది. ఏదేమైనా హవేలీలోనికి ప్రవేశించటం అనివార్యం. అందుకు అనువైన సమయం కోసం వేచి ఉండక తప్పదనిపించింది.

జేబులో నుంచి చిన్న ప్లాస్టిక్ కవరు తీసి అందులో అక్కడున్న బూడిద వేసుకుని మళ్ళీ అరకు బయలుదేరాడు.

హోటల్‌కు వెళ్ళి దాన్ని కూడా క్రితం రోజు తెచ్చిన కవర్‌తో బాటు భద్రపరిచాడు. సమయం సుమారు ఒంటిగంట కావచ్చింది.

భోజనం చేద్దామనుకుంటూనే అక్కణ్ణుంచి చిన్నగా నడుచుకుంటూ పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు. సమయం ఒకటింబావయింది. మళ్ళీ రమణమూర్తి లేని సమయంలోనే అతను రావడంతో యాదయ్య మళ్ళీ ఇబ్బందికి గురయ్యాడు.

సెల్యూట్ కొట్టి, బుర్ర గోక్కుంటూ "మూర్తి సారు ఈరోజు లేడయ్యా. హైదరాబాద్ నుంచి వీఐపీ ఎవరో వస్తున్నారంటే సెక్యూరిటీకి వెళ్ళాడు" అన్నాడు.

"మీ అయ్యగారితో మాట్లాడ్డానికి రాలేదు. నీతో మాట్లాడ్డానికే వచ్చాను".

దాంతో అతను మరింతగా భయపడి పోయినట్టనిపించింది గోవర్ధన్‌కు.

"ఏం భయపడకు. నాకు ఇక్కడ పనిచేసే వాళ్ళ గురించిన సమాచారం కావాలి. అంటే ఎవరెవరు ఎలాంటి వాళ్ళూ, వాళ్ళ అలవాట్లేంటీ... ఇలాంటి సమాచారమన్నమాట".

అయినా అతను సంశయాత్మకంగానే నిలబడిపోయాడు.

"చెబుతున్నానుగా, నువ్వేం భయపడకు. ఎవరెవరు ఎలాంటి వాళ్ళో తెలుసుకుంటే, వాళ్ళకు తగినట్టు ఏం మాట్లాడాలో డిసైడ్ చేసుకోవచ్చు. అందుకే అడుగుతున్నాను".

యాదయ్య మెల్లగా పెదవి విప్పాడు. "నెల క్రితం కూడా ఇలాగే ఒకాయన వచ్చి వివరాలన్నీ అడిగి వెళ్ళాడండీ. తరువాత మళ్ళీ ఎవరూ రాలేదు".

మౌనంగా తలూపాడు గోవర్ధన్ మనసులోనే నవ్వుకుంటూ.

**హవేలీ రహస్యం కనిపెట్టేందుకు సీఐడీ స్పెషల్ ఆఫీసర్ గోవర్ధన్ తన దర్యాప్తు ముమ్మరం చేశాడు. అనుమానితులందరిపైనా నిఘా వేశాడు. ఆ గ్రామస్థుల్లో కూడా కొందరు వ్యక్తులు హవేలీ రహస్యాన్ని కాపాడుతున్నారన్న సందేహం కలిగిందతనికి. దీనికి తోడుగా అతనికి కొన్ని సాక్ష్యాధారాలు కూడా లభించాయి. ఏమిటా సాక్ష్యాధారాలు? వాటిని తీసుకెళ్ళి అతడెవరికి ఇచ్చాడు?**

కాసేపాగి "ఆ పక్క గదిలో ఇంకో ఎస్సై కూడా ఉన్నారు. ఆయన్ని కూడా కలవండి. మీకేదైనా సమాచారం దొరకొచ్చు".

మెల్లగా లేచి ఆ గదిలోకి తొంగి చూశాడు.

అక్కడొక వ్యక్తి భోజనం చేస్తూ కనిపించాడు.

"అతని పేరేంటి?" యాదయ్యను అడిగాడు గోవర్ధన్.

"గోపాలరావు. ముందుగా ఆ రత్నగిరి హవేలీ కేసు ఈయనే చూసేవాడు. కొన్నాళ్ళయ్యాక ఈయన్ని తీసేసి మూర్తిసారుకిచ్చారు" చెప్పాడు యాదయ్య.

హవేలీ కేసులో ముందుగా నియమించింది అతన్నేనన్న రమణమూర్తి మాటలు గుర్తుకొచ్చాయి. చిన్నగా తలపంకించి అక్కడే కుర్చీలో కూర్చున్నాడు. లోపలికెళ్ళలేదు.

"ఈ సారు ఎలాంటాయన? బాగా మాట్లాడతాడా? లేకుంటే కోప్పడతాడా?"

చెప్పడానికి కాస్త తటపటాయించాడు.

"అన్నట్టు నీ భోజనమైందా?"

లేదన్నట్టుగా తలూపాడు. "అయ్యగారు భోంచేసి ముగించాక ఆయన ఇక్కడొచ్చి కూర్చుంటే నేను భోజనానికెళ్తాను".

"అంటే రోజూ ఈ టైంలో నువ్వొక్కడివే ఇక్కడ ఉంటావా? ఎవ్వరూ ఉండరా?"

అందుకు యాదయ్య ఉండరన్నట్టు తలూపాడు.

కొద్దిసేపాలోచించి లేచి "నేను కూడా ఇంకా భోజనం చెయ్యలేదు. ఇక్కడెక్కడైనా మంచి హోటలుంటే చూపిస్తావా? నాతోబాటు నువ్వు కూడా భోంచేద్దువు గానీ".

పెద్ద అధికారి పిలుస్తుండటంతో బుర్ర గోక్కుంటూ నిలబడ్డాడు.

"ఫర్వాలేదులే. భోజనం దగ్గర పెద్దా చిన్నా అంతా ఒకటే. నేను అసలే ఈ ఊరికి కొత్త. అయినా ఒక్కరోజు నాతోబాటు భోంచేస్తే ఏమీ అవదులే. మీ అయ్యగారికి చెప్పేసి రా" అన్నాడు అతని శరీరభాష అర్థం చేసుకున్న గోవర్ధన్. అనేసి బయటికి వెళ్ళి నిలబడ్డాడు.

సరిగ్గా ఐదు నిమిషాల తరువాత బయటికి వచ్చాడు యాదయ్య.

"ఇక్కణ్ణుంచి యాభై అడుగులేస్తే మంచి ఉడిపి హోటలుంది. భోజనం చాలా బాగుంటుంది సార్. వారానికోసారి ఇక్కడే భోంచేస్తాను. ఇంట్లోనుంచి తెచ్చుకోను".

యాదయ్య జిహ్వ చాపల్యం న్యాయమైనదిగా తోచింది.

"అంటే ఆ వారంలో ఒకరోజు ఈరోజేనన్న మాట. నాకు మంచి తోడు దొరికింది".

యాదయ్య ముఖం భోషాణమంతైంది.

"ఈ గోపాలరావు ఎలాంటాయన?"

"మంచాయనే. కొద్దిగా మెతక. డ్యూటీలో స్ట్రిక్ట్‌గానే ఉంటారు. అయినా ఈ ఉద్యోగం ఈయనకు సరిపడదు".

"ఎందుకలా?"

"పోలీసంటే టెర్రర్‌గా ఉండాలి. ఈయన అలా ఉండరు. స్ట్రిక్ట్ వేరు, టెర్రర్ వేరు. స్ట్రిక్ట్‌తో బాటు టెర్రర్‌గా కూడా ఉండాలి".

అంతలో హోటల్ వచ్చింది.

"అయినా ఈ మధ్యన ఒక ఆరు నెలలుగా కాస్త మార్పొచ్చింది. అస్తమానం డ్యూటీ అంటూ ఇక్కడే ఉండిపోతారు. వాళ్ళూరుక్కూడా సరిగ్గా

వెళ్ళడం లేదు".

"వాళ్ళూరంటే".

"విశాఖపట్నం. జీతం రాగానే కచ్చితంగా ఊరికెళ్తారు. రెండ్రోజులుండి వస్తారు".

"ఎందుకెళ్ళడం లేదు?"

"తెలీదు. ఈ మధ్యన కొన్నిరోజులు ఎవరితోనూ మాట్లాడకుండా తన పనేదో తాను చేసుకుంటూ ఉండేవారు. ఇప్పుడిప్పుడే అందరితోనూ కాస్త కలుపుగోలుగా ఉంటున్నారు".

"ఈ మధ్యన అంటే".

"అదే. దాదాపుగా ఆర్నెల్ల క్రితం. అప్పట్నుంచే మార్పు".

అంతలో వెయిటర్ రావడంతో రెండు మీల్స్‌కు ఆర్డరిచ్చాడు గోవర్ధన్.

గోవర్ధన్ ఆ టైమింగ్‌ను క్రోడీకరించేందుకు ప్రయత్నించాడు. ఆర్నెల్ల క్రితం అంటే అప్పుడే హవేలీ కేసులో అతనికి బదులుగా రమణమూర్తిని నియమించారు. బహుశా ఆ కారణంగానే ముభావంగా ఉండిపోయాడా? అయితే అతని మీద దాడి జరగడంతో అతను భయపడ్డట్టుగా రమణమూర్తి చెప్పాడు. అందులో నిజం పాలు ఎంత?

దానికీ, అతను ఇంటికి వెళ్ళకుండా ఉండటానికీ సంబంధం ఏమిటి? ఉద్యోగానికీ వ్యక్తిగత జీవితానికీ మరీ ఇంతగా లంకె పెట్టగూడదు గదా?

ఐదు నిమిషాలు మౌనంగా ఉండటంతో యాదయ్య తానేదైనా చెప్పకూడనిది చెప్పానేమోనన్నట్టుగా కాస్త భయంగా గోవర్ధన్ వైపు చూశాడు.

అది గమనించిన గోవర్ధన్ చిన్నగా నవ్వేశాడు. అత్యుత్సాహంతో ఒకేసారి అన్ని వివరాలూ అడగడం కూడా శ్రేయస్కరం కాదనిపించింది.

అంతలో భోజనం వచ్చింది. మాట మార్చాలన్న ఉద్దేశంతో "ఇక్కడ వేరే ఏవైనా హోటళ్ళు ఉన్నాయా? ఇదే మంచిదా?" అనడిగాడు.

"ఇది పూర్తిగా శాకాహారం. నాన్‌వెజ్ కావాలంటే ఇక్కడే కొద్ది దూరంలో మిలిటరీ హోటలుంది. ఫాస్ట్ ఫుడ్స్, చైనీస్‌కు ఆ పక్కనే మరో హోటలుంది. టూరిస్ట్ స్పాట్ కదా. అన్నిరకాలూ ఉండాలి".

"మీ ఇల్లెక్కడ?"

"ఆ మిలిటరీ హోటలు వెనుక".

రెండు గంటలకల్లా తిరిగి స్టేషన్‌కు వచ్చారు ఇద్దరూ. యాదయ్యను అక్కడ వదిలేసి గోవర్ధన్ తన హోటల్ రూముకు వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో స్టేషన్లో గోపాలరావు చేతిలో ఒక ఫోటో ఉంచుకుని దాన్నే తదేకంగా చూస్తున్నాడు. అతని మనసుని ఒకటే విషయం తొలిచేస్తూ ఉంది.

'విష్ణు ఎవరు? అతని పూర్వాపరాలు ఏమిటి? అక్క కొడుకని వచ్చి దిగాడు. అయితే అస్తమానం హవేలీ గురించి ఆరా తీస్తున్నాడు. ఇప్పటికే ఆలస్యం చేశాను. ఇకముందు చెయ్యకూడదు. కావాలంటే రమణమూర్తి సహాయం తీసుకోవాలి' అనుకుంటూ ఉండగానే రమణమూర్తి స్టేషన్లో అడుగుపెట్టాడు.

"వీఐపీలు ఒకచోట ఉండకుండా మన ప్రాణాలు ఎందుకు తీస్తారో అర్థం కాదు" అంటూ టోపీ తీసి టేబిల్ మీద పెట్టి ఉస్సూరుమన్నాడు.

అతని మాటలు పట్టించుకునే స్థితిలో లేడు గోపాలరావు. అతని లోకంలో అతనున్నాడు. అది గమనించిన రమణమూర్తి పక్కగా వచ్చి అతని చేతిలోని ఫోటోవంక చూశాడు.

"ఎవరిదా ఫోటో? అమ్మాయికేమన్నా పెళ్ళి సంబంధాలు చూస్తూ ఉన్నావా?"

లేదన్నట్టుగా తలూపి "ఈ ముఖాన్ని మన డిపార్ట్‌మెంట్లో ఎక్కడైనా చూశావా? ఇప్పుడే కాదు. ఇంతకు మునుపెప్పుడైనా కూడా" అనడిగాడు.

దీక్షగా కాసేపు చూసి లేదన్నట్టు తలూపాడు.

"ఫోటోలా లేదే. చేత్తో గీచిన స్కెచ్‌లా ఉంది. ఇంత బాగా ఎవరేశారు?"

"మా అమ్మాయి?"

"ఓహో" అన్నాడు ముసిముసి నవ్వులు నవ్వుతూ. అయితే ఆ ముఖాన్ని మన డిపార్ట్‌మెంట్లో చూశావా అని ఎందుకడిగాడో అర్థం కాలేదు. బహుశా అమ్మాయికి పోలీస్ అధికారినే ఎవర్నైనా కట్టబెట్టాలన్న ప్లాన్లో ఉన్నాడేమో అని సర్దుకున్నాడు.

"ఊరెళ్ళడం పూర్తిగా మర్చిపోయినట్టున్నావు. ఈ మధ్య ఆ ధ్యాసే నీకు ఉన్నట్టు కనబడలేదే" అనడిగాడు యధాలాపంగా.

"వెళ్ళాలి, వెళ్తాను" అంటూ క్లుప్తంగా సమా

## మనమీదేనర్రోయ్!

సరసి








## నీలాటిరేవు

వేప పుల్లతో పళ్ళతోమి
పచ్చ మన్ను తలకు పులిమే
పిల్లల కేరింతలు, నీళ్ళ తుళ్లింతలు
చేపలతో పోటీపడి మునుగీతలు
పగటిపూట సకల జీవులకు సురగంగ.

బిందె మీద బిందె-గడసాని హొయళ్ళు
నిత్యవాన నీసులు-తడిబట్టల ఒళ్ళు.
ఒరకంటి చూపులు-చెరకువింటి తూపులు
కుర్రాళ్ళ తలపుల్లో గజ్జెల గుర్రాలు
సహజ సౌందర్యరాశులు

పెద్దకానీ అంత కుంకుమ బొట్లు
పసుపు పూత ముఖ చిత్రాలు
చంటి పిల్లల ఏడుపు చంకలు
ఇండుబు గంధం కరిగిన కడవలు
చీరచెంగు సుమ్మలు-నోట అడ్డపొగ చుట్టలు
బిందెలతో ముష్టి యుద్ధాలు
తిట్ల ఈటెలతో సంకుల సమరాలు
సూర్యకాంతం, ఛాయాదేవి-కొట్లాటకు నాంది యిక్కడే
చీకటి గుట్టలు ఎన్నో-రట్టయ్యేదప్పుడే

వదినా మరదళ్ళ దెప్పుళ్ళు
జంకులేని శృంగారపు సామెతలు
పొడుపు కథల బుగ్గ పోట్లు
ఆప్యాయతల ఆలింగనాలు
కులమతాలు మరచిపోయి-వరసలతో పిలుపులు
నాడది ఆడవాళ్ళ రచ్చబండ

నేడది
తల మునకల పందుల ఊరగుమ్మి
దోమసంతతి రాగాల రోగాల లోగిలి



వ్యర్థాల, ప్లాస్టిక్ ముద్దల సంగమస్థలి
కుష్ఠు వ్యాధి సోకి కృశిస్తున్న ముసల్ది.
ఆధునికత ముసుగులో
ప్రపంచీకరణ వెకిలి నవ్వు.
కంటిలోని తడి, రెప్పల అంచుకి జారింది.
లోలోపల జాలి కరిగి, మూగదిగా మూలిగింది.

***-గార రంగనాథం, సెల్: 98857 58123***

ధానమిచ్చాడు.

"ఇలాంటి వ్యక్తి ఒక వేళ మన డిపార్ట్‌మెంట్లో ఉంటే కనుక్కోగలమా?" అనడిగాడు కాసేపయ్యాక.

ఫోటోలోని వ్యక్తినే ప్రత్యేకించి ఎందుకు చూస్తున్నాడో చూచాయగా అర్థం చేసుకుని బహుశా ఏదైనా ప్రేమ వ్యవహారమేమో అన్న నిర్ధారణకు వచ్చాడు. అయితే అతని ప్రశ్నలో ఏదో ఆదుర్దా కనబడింది. అంతకుమించి ఏదో కాస్త నెర్వస్‌నెస్ కూడా కనిపించింది.

"కష్టమే. కనీసం పేరు, ఊరు తెలుసా?"

"పేరు విష్ణు, పూర్తి పేరు విష్ణువర్ధన్. విశాఖపట్నం వాస్తవ్యుడు. తండ్రి పేరు మల్లికార్జునరావు. ప్రస్తుతం ఇంతకన్నా వివరాలు తెలియవు".

పేరెక్కడో విన్నట్టనిపించి అంతలోనే అది గోవర్ధన్ అని సర్ది చెప్పుకున్నాడు. మరోసారి ఫోటోను పరీక్షగా చూసి తనకు తానే జవాబిచ్చుకుంటున్నట్టు అడ్డంగా తలాడించాడు. అతనికీ ఇతనికీ సామ్యమే లేదనిపించింది. దాంతో గోవర్ధన్ అసలిక్కడికి వచ్చాడన్న విషయం కూడా గోపాలరావు ముందు చెప్పలేదు రమణమూర్తి.

తరువాత తల అడ్డం ఊపేసి "కనిపెట్టడం సాధ్యం కాదు" అన్నాడు.

రెండు నిమిషాల మౌనం అనంతరం "అబ్బాయి మంచివాడైతే ఆ మూడు ముళ్ళు పడనీయ్" అన్నాడు.

గోపాలరావు అన్యమనస్కంగానే తలూపాడు. తన మనసులోని ఆలోచనలు వేరనే విషయం రమణమూర్తికి తెలియదు. ఆ ఆలోచనలు ప్రస్తుతానికే కాదు, ఎప్పటికీ తెలియకపోవడమే మంచిదనుకున్నాడు.

•••

'హవేలీ వద్ద దొరికిన ఎముకలు ఎవరి తాలూకాన్నది నిర్ధారణ కావలసి ఉంది. ఒకవేళ అవి వీరయ్య తాలూకైతే రవీంద్రవర్మ విషయం తేలాలి. లేదా అవి రవీంద్రవర్మ తాలూకైతే వీరయ్య ఎక్కడున్నాడన్న విషయం ఇంకా చిక్కుముడిగానే ఉంటుంది. అప్పుడు ఈ వీఐపీల పిల్లల విషయంలో కాస్త జాగ్రత్త వహించాల్సి ఉంటుంది. వాళ్ళ అదృశ్యం వెనక ఉన్న రహస్యం తెలుసుకోవాలి. వాళ్ళనే ఎందుకు టార్గెట్ చేస్తున్నారు, ఎవరు చేస్తున్నారన్న కోణాల్లో ఆలోచించాలి. బలగాలతో వచ్చి హవేలీలోకి ప్రవేశించడం చాలా సులభం. అయితే పల్లె ప్రజలు అప్రమత్తమైతే ఆనవాళ్ళన్నీ చెరిగిపోతాయి. అందువల్ల ఎలా చూసినా హవేలీలో ప్రవేశించి, అక్కడి మర్మాలు కనిపెట్టాలి'.

మనసులో అనేక ఆలోచనలతో సతమతమౌతూ సాయంత్రం ఆరు గంటల బస్సెక్కి విశాఖపట్నం బయలుదేరాడు గోవర్ధన్.

•••

మరుసటిరోజు ఉదయాన్నే విశాఖపట్నంలో ఫోరెన్సిక్ ల్యాబ్‌కు వెళ్ళాడు గోవర్ధన్. అతని చేతిలో తాను సంగ్రహించిన ఎముకల ప్యాకెట్ ఉంది.

"హలో సర్. చాలా రోజులైంది మిమ్మల్ని చూసి. ఏమిటిలా దయచేశారు?" అంటూ ఎదురు పడ్డాడు అక్కడి ల్యాబ్ అసిస్టెంట్ సునీల్.

"మీలాంటి వాళ్ళ అవసరం ఎప్పుడొస్తుందో కచ్చితంగా చెప్పలేం కదా"

"ఎవరిదో చరిత్ర చేతిలో ఉన్నట్టుందే" అన్నాడు అనుమానాస్పదంగా అతని చేతిలోని ప్లాస్టిక్ సంచి వంక చూస్తూ.

"చరిత్ర గుట్టు విప్పగలవేమో చూడాలి. దీన్నిక్కడ ఉంచేసి వెళ్తాను. రెండు మూడ్రోజుల తరువాత వస్తాను".

"ఏమిటో అవి?"

"మామూలేగా. బోన్స్" అంటూ తీసి చూపాడు.

"నీకు తెలియందేముంది? చనిపోయింది ఆడా మగా? వయస్సెంత? చనిపోయి ఎంత కాలమైంది? ఎలా చనిపోయింది? ఇత్యాది వివరాలు రాబట్టగలవేమో చూడాలి".

"మా పనదేగా! బాస్‌కు ఓ మాట చెప్పి వెళ్ళండి".

"దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వాలిగా. అందుకే ముందుగా పూజారి దర్శనమైంది".

"మరీ మునగ చెట్టెక్కించేస్తున్నారు."

నవ్వేసి డైరెక్టర్ గదిలోనికి వెళ్ళాడు గోవర్ధన్. అతనితో కాసేపు పిచ్చాపాటి మాట్లాడి విషయం వివరించి బయట పడ్డాడు గోవర్ధన్.

అక్కణ్నుంచి నేరుగా కమీషనర్ కార్యాలయానికి వెళ్ళాడు.

స్టాఫ్‌ని అడిగి అరకులో పనిచేసే ఇద్దరు ఎస్సైల వివరాలు తీసుకున్నాడు. ఒకరు రమణమూర్తి, మరో వ్యక్తి గోపాలరావు.

గోపాలరావు అడ్రస్ చూశాడు. అతని ఇల్లు పూర్ణా మార్కెట్ బస్టాండు దగ్గరని తేలింది. కాగితం ముక్క మీద అడ్రసు రాసుకుని వెంటనే అక్కడికి బయలుదేరాడు.

ఇల్లు కనిపెట్టడం కష్టం కాలేదు. తలుపు తట్టగానే ఒకావిడ వచ్చి తలుపు తీసింది.

"గోపాలరావుగారున్నారా?"

"ఆయన ఇక్కడుండరండీ. అరకులో పని చేసేది"

"ఎప్పుడొస్తారు?"

ఆ ప్రశ్నకు ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"ఏమైందమ్మా? నేనేమైనా తప్పుగా అడిగానా?"

"ఎప్పుడొస్తారో చెప్పలేనండీ"

"అదేం?"

"ఇంతక్రితం నెలకోసారి కచ్చితంగా వచ్చి రెండు రోజులుండి వెళ్తూ ఉండేవారు. గత ఆరు నెలలుగా ఇప్పటికి మూడుసార్లు వచ్చి వెళ్ళారంతే. అది కూడా ఇల్లు మారడానికి వచ్చారు. పగలు వచ్చి సాయంత్రానికల్లా వెళ్ళిపోయేవారు. ఇల్లెందుకు మార్చారని అడిగితే ఏమీ అడగొద్దని గట్టిగా అన్నారు. ఏం జరిగిందో, ఎందుకలా ఉన్నారో అర్థం కావడం లేదు" అన్నది కళ్ళు తుడుచుకుంటూ.

ఏదో విషయం అర్థమైనట్లు తల పంకించాడు గోవర్ధన్.

"దిగులు పడకండి. త్వరలోనే అన్నీ సర్దుకుంటాయి. బహుశా పని ఒత్తిడి వల్ల అలా చేస్తున్నారేమో" అనేసి వెనుదిరిగాడు గోవర్ధన్.

అక్కణ్నుంచి మళ్ళీ కమీషనర్ కార్యాలయానికి వెళ్ళి దేవరాజ్‌ను కలిసి తానేం చెయ్యదల్చుకున్నాడో, ఆ విషయం చెప్పాడు.

***(ఇంకావుంది)***




# ఇంద్రజిత్తు వీరవిహారం: రామలక్ష్మణుల దైన్యం

**రామబాణాలకు కుంభకర్ణుడు తుత్తునియలు అయ్యాడు. మరణించాడు. అది చూసి దేవతలు హర్షధ్వానాలు చేశారు. ఆ శబ్దాలకి ఆకాశం మారుమోగింది. కింద భూమి కూడా జలదరించింది. రాముని విక్రమాన్ని సమస్తవానరులూ, దేవ యక్ష పన్నగులూ అనేక విధాల శ్లాఘించారు. రాముణ్ణి చుట్టుముట్టి జయజయధ్వానాలు చేశారు. వారి ఆనందాన్ని చూసి రాక్షసులు తట్టుకోలేకపోయారు. భోరున విలపించారు. యుద్ధరంగం నుంచి పరుగుదీశారు. రావణుణ్ణి సమీపించారు. అతనికి కుంభకర్ణుని మరణ వార్త తెలియజేశారు. మహాబలశాలి, ధైర్యానికి పెట్టింది పేరైన కుంభకర్ణుని మరణాన్ని జీర్ణించుకోలేకపోయాడు రావణుడు. నిట్టనిలువునా కూలిపోయాడు. ఏడుస్తూ చిన్నపిల్లాడిలా నేల మీద పొర్లసాగాడు.**

తండ్రిని సమీపించాడు త్రిశిరుడు. పట్టుకున్నాడతన్ని.

"ఊరుకో నాన్నా! ఊరుకో! వీరస్వర్గాన్ని అలంకరించడం వీరుల ధర్మం. చిన్నాన్న వీరస్వర్గాన్ని అలంకరించాడు. స్వర్గాన్ని అలంకరించిన వారి కోసం శోకించకూడదు. ఊరుకో! ముల్లోకాలనూ జయించిన వీరాధివీరుడివి. నువ్వు ఇలా విలపించడం బాగాలేదు. విధాత ప్రసాదించిన శరాసన శక్తి కవచాలు, వేయిగుర్రాలరథం గల నువ్వు రాముణ్ణి ఇట్టే ఓడించగలవు నాన్నా! నీ వెనుక సమస్త ఆయుధాలుసహా మేమంతా ఉన్నాం, ఊరుకో." అన్నాడు.

ఆసరికి తేరుకున్నాడు రావణుడు. త్రిశిరుణ్ణి దగ్గరగా తీసుకున్నాడు. అతని నుదుటన ముద్దు పెట్టాడు.

"నాన్నా! నా మాట విని నువ్వు వెళ్ళి విశ్రాంతి తీసుకో! తమ్ముడు అతికాయుడుసహా మేమంతా యుద్ధానికి వెళ్తాం. రాముణ్ణి కూల్చి వస్తాం. మమ్మల్ని ఆశీర్వదించు." అన్నాడు త్రిశిరుడు. తండ్రిని లేవనెత్తాడు. సింహాసనం దగ్గరగా నడిపించుకుని వెళ్ళాడు. అతన్ని అందులో కూర్చోబెట్టాడు. సింహాసనంలో కూర్చోగానే పునర్జన్మ ఎత్తినట్టు అనిపించింది రావణునికి. గుండెల్లో బాధంతటినీ ఎవరో తోడేసినట్టయి, తేలికపడ్డాడతను. ఆసరికి దేవాంతక, నరాంతక, అతికాయులు కూడా తేరుకున్నారు. త్రిశిరునిసహా యుద్ధానికి సిద్ధమయ్యారు. ఆయుధవాహనాలూ, చతుర్విధ సైన్యాలూ వెంటబెట్టుకుని తండ్రిని సమీపించారు. ఆశీస్సులు కోరారు.

చేతులు జోడించి నమస్కరిస్తూ నిల్చున్న మహావీరులైన కొడుకుల్ని కళ్ళ నిండుగా చూసుకున్నాడు రావణుడు. ఒకొక్కరినీ దగ్గరగా తీసుకున్నాడు. గట్టిగా కౌగిలించుకున్నాడు. స్వయంగా వారిని అలంకరించాడు. దీవించాడు.

"వెళ్ళి రండి" అన్నాడు. కొడుకులకు సాయంగా మత్త, మహోదరులను పంపాడు.

వస్తూనే త్రిశిరాదులు వానరసైన్యాన్ని ఎదుర్కొన్నారు. రకరకాల అస్త్రాలను ప్రయోగించి, ముచ్చెమటలు పట్టించారు. చెట్లూ, గుండ్రాళ్ళతో వానరులు కూడా దీటుగానే స్పందించారు.

శక్తి శూలాలు ధరించి, గుర్రాన్ని అధిరోహించాడు నరాంతకుడు. సమరాంగణంలోకి ప్రవేశించాడు. సముద్రంలో సొరచేపలా వానరసైన్యాన్ని అతలాకుతలం చేశాడు. ఏడువందలమంది వానరుల్ని మట్టుబెట్టి, రణభూమిని రక్తపంకం చేశాడు.

అంత దూరం నుండి అది గమనించి, ముందుకు దూసుకు వచ్చాడు అంగదుడు. నరాంతకుణ్ణి ఎదిరించాడు. అంగదుణ్ణి చూస్తూనే ఆగ్రహావేశాలతో ఊగిపోయాడు నరాంతకుడు. పెదవులు కొరికాడు. చేతిలోని శూలాన్ని గురి చూసి అతనిపైకి విసిరాడు. వజ్రసన్నిభమైన అంగదుని వక్షాన్ని ఆ శూలం గాయం చేయలేదు సరికదా, అతని వక్షానికి తగిలి అది రెండు ముక్కలైంది. అంగదుడు పెద్దగా అరుస్తూ నరాంతకుణ్ణి సమీపించాడు. పిడికిలితో అతని గుర్రం తలపై గట్టిగా గుద్దాడు. ఆ దెబ్బకి తల పగిలి, గుర్రం నేల కూలింది. నరాంతకుడు కిందపడ్డాడు.

కిందపడ్డాడో లేదో అంతలోనే లేచి నిల్చున్నాడు నరాంతకుడు. చేతులురెంటినీ పిడికిళ్ళు చేసి, వాటితో అంగదుని శిరసుపై గట్టిగా మోదాడు. ఆ మోదుడికి అంగదుడు మూర్ఛపోయాడు. కాసేపటికి కష్టం మీద తేరుకున్నాడతను. లేచి నిలబడ్డాడు. రారమ్మంటూ ఎదురుగా నిల్చున్న నరాంతకుని గుండెల్లో పిడికిలితో గట్టిగా పొడిచాడు. ఆ పొడుపుకి నరాంతకుని కండలూ, కొవ్వూ బయటికి వచ్చాయి. నెత్తురు కక్కుకున్నాడతను. కిందపడి మరణించాడు. సోదరుని మరణాన్ని కళ్ళారా చూసిన దేవాంతక త్రిశిరులు రథాలపై వచ్చి అంగదుణ్ణి చుట్టుముట్టారు. మహోదరుడు ఏనుగుపై వచ్చి అంగదుని ముందు నిలిచాడు. తన ముందు నిలిచిన మహోదరుణ్ణి ఎదుర్కొనేందుకు ఒక్క ఉదుటన ఎగిరి, అతని ఏనుగుపైకి చేరాడు అంగదుడు. పిడికిలి పట్టి ఏనుగు కుంభస్థలంపై రెండు మూడు పోట్లు పొడిచాడు. ఆ పోట్లకి నేల కూలి ఏనుగు మరణించింది. మరణించిన ఏనుగు కోరను పెరికాడు అంగదుడు. దానితో దేవాంతకుణ్ణి గట్టిగా పొడిచాడు. కత్తిలా కడుపులో దూసుకొచ్చిన కోరకి గిలగిల్లాడాడు దేవాంతకుడు. బాధగా నేల కూలాడు. కాసేపటికి తేరుకున్నాడు. తేరుకుని, పక్కనున్న గదను అందుకున్నాడు. దానిని గురి చూసి అంగదునిపైకి విసిరాడు. ఆ గదాఘాతానికి స్పృహకోల్పోయాడు అంగదుడు. అంతలోనే తేరుకున్నాడు. మోకాళ్ళపై నిలిచాడు. అతను పూర్తిగా తేరుకుంటే ప్రమాదం అని తలచి, త్రిశిరుడు బాణాలు ప్రయోగించాడు. ఆ బాణాలు ఒకొక్కటీ అంగదుని నుదుటన నాటుకుని అతన్ని తీవ్రగాయాలపాలు చేశాయి.

చూశారది నీల హనుమలు. పరుగున వచ్చి అంగదునికి సాయంగా నిలిచారు. నీలుడు దగ్గరగా ఉన్న గుండ్రాతిని తీసుకున్నాడు. దాన్నెత్తి, గురి చూసి, త్రిశిరునిపైకి విసిరాడు. మీదికి వచ్చి పడుతున్న గుండ్రాతిపైకి బాణాలు ప్రయోగించాడు త్రిశిరుడు. దానిని ముక్కలు ముక్కలు చేశాడు. పరిఘతో హనుమపైకి దాడి చేశాడు దేవాంతకుడు. రెండు మూడు దెబ్బలు తిన్నాడు హనుమ. తర్వాత నేర్పుగా దెబ్బల్ని తప్పించుకున్నాడు. తప్పించుకుని పిడికిలి బిగించి, దాంతో దేవాంతకుని తలపై మోదాడు. ఆ దెబ్బకి అతను నెత్తురు కక్కుకుంటూ నేలకూలాడు. మరణించాడు. నీలునికి ఇరువైపులా నిలబడి త్రిశిర, మహోదరులు అతన్ని బాణాలతో బాగా నొప్పించారు. గాయాలపాలై నీలుడు సొమ్మసిల్లిపోయాడు. కాసేపటికి తేరుకున్నాడు. తేరుకుని కొద్దిదూరంలో ఉన్న గుండ్రాతిని ఆయుధంగా తీసుకుని, దానిని మహోదరునిపై ప్రయోగించాడు. తప్పించుకునే వీలులేకపోయింది. గుండ్రాయి మీదపడడంతో మహోదరుడు మరణించాడు.

త్రిశిర, హనుమలు హోరాహోరీగా పోరాడసాగారు. త్రిశిర రథాశ్వాలపై దూకి, గోళ్ళతో కన్నూ కాళ్ళూ పీకి వాటిని నేల కూల్చాడు హనుమ. శక్తిని ప్రయోగించాడు త్రిశిరుడు. దగ్గరగా వచ్చిన శక్తిని అందుకుని దానిని రెండు ముక్కలు చేశాడు హనుమ. అతని వీరత్వాన్ని వేనోళ్ళ పొగిడారు వానరులు. వానరులు అలా పొగుడుతూ ఉంటే

త్రిశిరుణ్ణి సమీపించాడు హనుమ. చేతులు పట్టుకుని, అతన్ని మూటలా ఎత్తి గిరగిరా తిప్పాడు. తిప్పుతూనే గాలిలోకి వదలి వేశాడు. కింద పడ్డాడు త్రిశిరుడు. స్పృహ కోల్పోయాడు. కాసేపటికి తేరుకున్నాడు. తేరుకున్న త్రిశిరుణ్ణి తేరిపార చూశాడు హనుమ. అతని దగ్గర ఉన్న కరవాలాన్ని అందుకున్నాడు. దాంతో అతని మూడు శిరస్సులనూ ఖండించాడు. త్రిశిరునిసహా రాకుమారులు ముగ్గురూ హతులయ్యారని తెలుసుకుని, మత్తుడు వానరులపై విరుచుకుపడ్డాడు. గదాయుధంతో చాలా మంది వానరుల్ని మట్టుబెట్టాడు. ఋషభుడు ఎదుర్కొన్నాడతన్ని. మత్తుడు తీవ్రంగా గాయపరిచినా నిలదొక్కుకున్నాడు. ఒడుపుగా అతని చేతిలోని గదను అందుకుని దానితోనే మత్తుణ్ణి మోది మోది చంపాడు. మత్తమహోదరులూ, రాకుమారులు ముగ్గురూ మరణించడంతో రాక్షసులకు భయం వేసింది. యుద్ధరంగం నుంచి పరుగందుకున్నారు.

సోదరులు, సహాయుల మృతికి కళవళపడ్డాడు అతికాయుడు. మహారథాన్ని అధిరోహించి, సింహనాదం చేస్తూ సమరాంగణంలో నిలిచాడు. అతన్ని చూసి వానరులు బెంబేలెత్తిపోయారు. ఎవరితను? త్రివిక్రముడు కాదుకదా? లేదంటే మరణించిన కుంభకర్ణుడు మరో రూపంలో రాలేదు కదా? అనుకున్నారు. భయపడ్డారు. పరుగుదీశారు. రాముణ్ణి శరణువేడారు. అభయాన్నిచ్చాడు రాముడు. అప్పుడు చూశాడతను అతికాయుణ్ణి. ఆశ్చర్యపోయాడు.




విభీషణుణ్ణి చేరపిలిచాడు. వచ్చాడతను. అడిగాడిలా రాముడు.

"ఈ మహావీరుడు ఎవరు?"

"రామా! వేయిగుర్రాలూ, నలుగురు సారథులూ కలిగి, ఆ మహారథంపై ఉన్నవాడు రావణ ధాన్యమాలినుల కుమారుడు అతికాయుడు. ఇతడు కూడా బ్రహ్మవరాలు పొందిన వాడే! ఆ దివ్యరథం, ఆ అభేద్యకవచం, ఆ దివ్యాస్త్రాలూ బ్రహ్మవర ప్రసాదాలే! తండ్రి రావణునితో సమానమైన విలుకాడు. రాజవిద్యల్లో మహానిపుణుడు. మహోత్సాహి, బుద్ధిమంతుడు. అంతేకాదు, వరుణుని పాశాన్నీ, ఇంద్రుని వజ్రాయుధాన్నీ స్తంభింపచేసిన మహావీరుడు." చెప్పాడు విభీషణుడు.

విస్తుపోయి విన్నాడు రాముడు.

"రామా! ఆ అతికాయుడు వానరసైన్యాన్ని చిందరవందర చేయకముందే అతన్ని నువ్వు కడతేర్చాలి." చెప్పాడు విభీషణుడు. అతను చెప్పడం ముగించనే లేదు, అతికాయుని వీరవిహారం ప్రారంభమయింది. భూమి అదిరేటట్టుగా ధనుష్టంకారం చేస్తూ, బాణాలు ప్రయోగించసాగాడతను. నీల, కుముద, శరభ, మైందద్వివిదులు ఎదుర్కొన్నారతన్ని. గుండ్రాళ్ళనూ, చెట్లనూ లెక్కకు మిక్కిలిగా అతికాయునిపై విసిరారు. అయితే అందులో ఏ ఒక్కటీ అతన్ని గాయపరచలేకపోయింది. తన మీదకు వస్తున్న ప్రతి చెట్టునీ, గుండ్రాతినీ తుత్తునియలు చేశాడతను. అంతటితో ఊరుకోలేదు. వాడి బాణాలను ప్రయోగించి, వానరవీరులందరినీ నొప్పించాడు. యుద్ధరంగం నుంచి వారిని పరిగెత్తేట్టుగా చేశాడు. ఎదురుగా ఎవరూ లేరు. అతికాయునికి భయపడి అంతా పారిపోయారు. నవ్వుకున్నాడతను. రాముణ్ణి సమీపించాడు. నఖశిఖపర్యంతం అతన్ని చూసి అన్నాడిలా.

"నేను వీరులతోనే పోరాడతాను. సాధారణులను జాలిపడి వదిలేస్తాను. ఇక్కడ వీరులుంటే నాతో యుద్ధానికి రావచ్చు."

ఆ మాటకి అన్న చాటున ఉన్న లక్ష్మణుడు ముందుకు వచ్చాడు. చేతిలోని మహాధనుస్సును శత్రువుకి చూపిస్తున్నట్టుగా ఎత్తిపట్టుకున్నాడు. నారి సారించాడు. గట్టిగా లాగి వదిలాడు. ఆ శబ్దానికి భూమ్యాకాశాలు దద్దరిల్లాయి. రాక్షసులు భయపడ్డారు. వెనకడుగు వేశారు. వారిని వారించాడు అతికాయుడు. లక్ష్మణునితో అన్నాడిలా.

"లక్ష్మణా! మిన్నూ, మన్నూ, మేరు, మందర పర్వతాలే తట్టుకోలేని నా బాణాగ్నిని నువ్వు తట్టుకోలేవు. తప్పుకో!"

తప్పుకోలేదు లక్ష్మణుడు. నవ్వుతూ నిల్చున్నాడు.

"అయితే యమమందిరానికి బయల్దేరు." అన్నాడు అతికాయుడు. శరాన్ని సంధించాడు.

"యమమందిరానికి నేను బయల్దేరాలో, నువ్వు బయల్దేరతావో తేల్చుకుందాం రా! ఎవరు ఎవరి బాణాగ్నిని తట్టుకోలేరో తేలిపోనీ." అన్నాడు లక్ష్మణుడు. యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఇద్దరూ చాలాసేపు పోరాడారు. లక్ష్మణుడు ఎన్ని బాణాలు ప్రయోగించినా ఫలితం లేకపోయింది. ఏ ఒక్కటీ అతికాయుణ్ణి నొప్పించలేదు. అది గమనించి ఆశ్చర్యపోయాడు లక్ష్మణుడు. ఏం చెయ్యాలో పాలుపోక ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. అప్పుడు వాయుదేవుడు అతని చెవిలో చెప్పాడిలా.

"లక్ష్మణా! ఈ వీరుడు బ్రహ్మదేవుడు ప్రసాదించిన అభేద్యకవచంతో అలరారుతున్నాడు. అది అంటిపెట్టుకుని ఉన్నంత కాలం ఏ అస్త్రమూ అతన్ని ఏమీ చెయ్యలేదు. అతడు హతుడు కావాలంటే ఒక్కటే మార్గం. నువ్వు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాలి."

వాయుదేవుని మాట పూర్తికానేలేదు, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్ర ప్రయోగానికి భూమీ, పర్వతాలూ, సముద్రాలూ సంచలించిపోయాయి. అగ్నిజ్వాలలతో వస్తోన్న ఆ అస్త్రాన్ని అడ్డుకునేందుకు అతికాయుడు అనేక అస్త్రాలను ప్రయోగించాడు. అయితే ఏ ఒక్కటీ బ్రహ్మాస్త్రాన్ని అడ్డుకోలేకపోయింది. పైగా బ్రహ్మాస్త్ర జ్వాలల్లో మాడి బూడిదయ్యాయవి. దగ్గరగా అతి దగ్గరగా వస్తోంది బ్రహ్మాస్త్రం. తప్పించుకునే ప్రయత్నాల్లో పడ్డాడు అతికాయుడు. తప్పించుకోవడం అతనికి వీలుకాలేదు. మణికిరీట కుండలాలతో ఉన్న అతికాయుని శిరస్సును బ్రహ్మాస్త్రం ఖండించింది. ఖండించి ఆ శిరస్సును పాతాళలోకాలకు పట్టుకు పోయింది.

అతికాయుణ్ణి అంతమొందించినందుకు లక్ష్మణుణ్ణి వానరవీరులుసహా రాముడు అభినందించాడు.

యుద్ధభూమి నుండి పరిగెత్తుకు వచ్చిన సైనికులు, ఎవరెవరు ఎలా చనిపోయారన్నది, రావణునికి వివరించారు. కొడుకులూ, సోదరులూ చనిపోయారని తెలుసుకుని తల కొట్టుకున్నాడు రావణుడు. కంటికీ మంటికీ ఏకధారగా రోదించాడు.

ఏమిటిది? ఎందుకు ఇన్ని ఘోరాలు జరుగుతున్నాయి? అసాధ్యాలు సుసాధ్యాలు అవుతున్నాయేమిటి? దేవతల్నే జయించిన రాక్షసులు, మానవులైన రామలక్ష్మణులు, వానరుల చేతుల్లో మరణించడం ఏమిటి? దేవతలుసైతం విడిపించుకోలేని నాగపాశాలను మామూలు మానవులు ఆ రామలక్ష్మణులు విడిపించుకోవడం ఏమిటి? యుద్ధానికి వెళ్ళిన ఏ మహావీరుడూ తిరిగి రావడం లేదు. రాముడి చేతిలో హతులవుతున్నారెందుకు? అంతటి వీరుడా రాముడు? అతని శస్త్రాస్త్రాలు అంత గొప్పవా?

పరిపరివిధాల ఆలోచనలు చేశాడు రావణుడు. ఆఖరికి ఇలా అనుమానించాడు.

రాముడు మానవమాత్రుడు కాడా? కాని పక్షంలో మరెవరు? సాక్షాత్తు నారాయణుడా? నారాయణుడే అయి ఉండాలి. అనుమానం లేదు. రాముడు నారాయణుడే! సర్వదుష్టసంహారకుడు నారాయణుణ్ణి ఎదిరించి నిలవడం అసాధ్యం.

తలపట్టుకున్నాడు రావణుడు. కుప్పకూలిపోయాడు. అనుకున్నాడిలా.

ఇప్పుడు ఈ సంగతి తెలిసి లాభం ఏమిటి?

**వేయి గుర్రాలు పూన్చిన రథంపై తనఎదుట నిలిచిన మహావీరుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు రాముడు. విభీషణుణ్ణి పిలిచి ఎవరీ మహావీరుడని ప్రశ్నించాడు. రావణ కుమారుడైన అతికాయుని శౌర్యపరాక్రమాలను ఆలకించి అతడితో యుద్ధం ఆరంభించాడు లక్ష్మణుడు. ఆ భీకరపోరులో తన శరాలన్నీ విఫలం కావడంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు లక్ష్మణుడు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. మరి లక్ష్మణుడతన్ని ఏ రీతిన సంహరించాడు?**

మూడొంతుల సైన్యాన్నీ, ధైర్యాన్నీ పోగొట్టుకుని ఇప్పుడిలా ఆలోచించడం కూడా అవివేకమే! కాను న్నది కాక మానదు. కానీ! ఇది తెరువెరుగని దీర్ఘ రాత్రి. ఈ రాత్రి ఇలా కొనసాగనీ!

సాలెగూడులో చిక్కుకున్నట్టుగా విలవిల్లాడాడు రావణుడు. చీకటిసముద్రంలో మునకే సుఖం అనుకునే స్థితికి చేరుకున్నాడు. అప్పుడు విన వచ్చిందో గొంతు.

"తండ్రీ"

ఆ గొంతు యువరాజు ఇంద్రజిత్తుది.

చీకటిసముద్రంలో చిరుదీపంలా కనిపించా డతను. రావణుడు అతన్ని ఆశగా చూశాడు.

"ఇంద్రుని ఓడించిన ఈ ఇంద్రజిత్తు బతికి ఉండగా ఎందుకు తండ్రీ నీకు ఇంత అధైర్యం? ఎందుకు ఈ శోకం? ధైర్యంగా ఉండు! ఈ మేఘ నాథుని శపథం విను!

సూర్యచంద్రులూ, అగ్నులూ, యమధర్మరాజూ ఆశ్చర్యపోయేట్టుగా యుద్ధరంగంలో నేను విజృం భిస్తాను. నా అమోఘశరాలతో ఆ రామలక్ష్మణు లను ఓడిస్తాను. మాట తప్పను తండ్రీ! ఆ ఇద్ద రినీ యుద్ధరంగానికి బలి ఇచ్చిగాని తిరిగి రాను. అనుజ్ఞ ప్రసాదించు." అన్నాడు ఇంద్రజిత్తు. అతనికి రావణుడు అనుజ్ఞ ప్రసాదించాడో లేదో తెలియదు. ఎత్తిన తల దించి, సన్నగా దానిని ఆడించాడంతే! అదే అనుజ్ఞగా, ఆశీస్సుగా భావించి ఇంద్రజిత్తు యుద్ధానికి బయల్దేరాడు. వెలుగులీనుతున్న రథాన్ని ఎక్కాడతను. ప్రకాశిస్తున్న ఛత్రం కింద నిల్చున్నాడు. ధనుర్ధారి అయ్యాడు. ఇరువైపులా వింజామరలు వీస్తుంటే, చతురంగబలాలతో ముందుకు ఉరికాడు. మహాసైన్యంతో తరలి వస్తున్న ఇంద్రజిత్తుకి దారిపొడవునా పౌరులు బారులు తీరి నిల్చుని జయజయధ్వానాలు చేశారు. అతన్ని ఆశీర్వదించారు.



యుద్ధభూమికి చేరుకున్నాడు ఇంద్రజిత్తు. సైన్యాన్ని ప్రాకారంలా నిలబెట్టి, మధ్యలో హోమ గుండం ఏర్పరిచాడు. అగ్నిని పూజించాడు. పొగ లేని మంటల్లోంచి అగ్నిదేవుడు ప్రత్యక్షమయ్యాడు. హవిస్సులు స్వీకరించాడు. అది శుభసూచికంగా భావించాడు ఇంద్రజిత్తు. మరింతగా రెచ్చిపోయాడు. తన ధనుస్సూ, బాణాలూ, బ్రహ్మాస్త్రంసహా సర్వ శస్త్రాలూ, రథాన్ని సైతం అగ్నికి ఆహుతి చేశాడు. మంటల్లో ఆ మహాస్త్రాలూ దగ్ధం అవుతోంటే అది చూసి గ్రహాలు వణికాయి. కాస్సేపటికి అగ్ని దేవుడు మళ్ళీ ప్రత్యక్షమై, తనందుకున్న వాటన్ని టినీ మరింత తేజోవంతం చేసి, తిరిగి ఇంద్ర జిత్తుకు అందించాడు. వాటితో రెండవ అగ్నిగా ప్రకాశించాడతను. రెట్టింపు బలాన్ని పొందాడు. రథంసహా ఆకాశానికి ఎగిశాడు. కింద నుండి చూస్తున్న సైన్యానికి ఉత్సాహాన్ని కలిగించాడు.

యుద్ధం ప్రారంభమైంది. రాక్షసులూ, వాన రులూ తలపడ్డారు.

ఎవరికీ కనిపించకుండా ఆకాశంలో తిరుగుతూ అక్కణ్ణుంచే యుద్ధం చేయసాగాడు ఇంద్రజిత్తు. బాణవర్షం కురిపించసాగాడు. ఆ బాణాలకు సుగ్రీవ, అంగదాది వీరులు తీవ్రగాయాలపాలై స్పృహకోల్పోయారు. కళ్ళెత్తి చూసేందుకు వీలు లేదు. చూస్తే కళ్ళల్లో బాణాలు, తలెత్తి చూస్తే తల మీద బాణాలు. గుండు అందుకునేందుకు చేయి జాస్తే, ఆ చేతిని బాణాలతో ఖండిస్తున్నాడు. చెట్టు అందుకుందామన్నా అదే పరిస్థితి. అడుగు వేస్తే బాణం. అడుగు తీస్తే బాణం. అరిస్తే బాణం, బాధను అణచుకునేందుకు నోట చేయి పెట్టుకుని కరచుకున్నా బాణమే! వానరుల్ని అచేతనుల్ని చేశాడు ఇంద్రజిత్తు. నిశ్చేష్టుల్ని చేశాడు. రామ లక్ష్మణులను కూడా వదల్లేదు. వారిద్దరిని కూడా సూర్యకిరణాల్లాంటి బాణాలతో బాధించాడు. వర్షంలా వచ్చి పడుతున్న బాణాలను ఎదుర్కొంటూ, లక్ష్మ ణునికి ధైర్యం చెప్పేందుకు రాముడు ఇలా అన్నాడు.

"లక్ష్మణా! బ్రహ్మవరశక్తితో ఈ దానవుడు ఆకా శంలో విహరిస్తూ మనల్ని వేధిస్తున్నాడు. అని వార్యమైన ఆ శక్తిని మనం భరించక తప్పదు. విజయం ఇంద్రజిత్తుదే."

అవును! విజయం ఇంద్రజిత్తుదే అనుకున్నాడు లక్ష్మణుడు. రామలక్ష్మణులు పెద్దగా స్పందించక పోవడంతో ఇంద్రజిత్తు మరిన్ని బాణాలను ఏక కాలంలో ప్రయోగించి, వారిని మరింతగా బాధిం చాడు. ఆ బాణాలకు స్పృహకోల్పోయారు రామ లక్ష్మణులు. నేలకొరిగారు. ఎప్పుడైతే రామలక్ష్మ ణులు స్పృహకోల్పోయి నేలకు ఒరిగారో అప్పుడు వానరులు వణికిపోతూ చెట్లచాటుకూ, రాళ్ళ చాటుకూ పరుగులుదీశారు. అయినా ఇంద్రజిత్తు బాణపరంపర ఆగలేదు. అంతలో సూర్యుడు అస్తమించాడు. చీకట్లు అలముకున్నాయి. అప్పుడు యుద్ధాన్ని విరమించాడు ఇంద్రజిత్తు. స్పృహ కోల్పోయి యుద్ధరంగంలో పడి ఉన్న రామలక్ష్మ ణులనూ, యుద్ధరంగంలో నిలువలేక పరిగెత్తి ఆ మూలా ఈ మూలా దాగిన వానరులనీ చూసి నవ్వుకున్నాడతను. తాను తండ్రికి ఇచ్చిన మాట నెరవేరింది. చాలనుకున్నాడు. రాక్షసులంతా జయ జయధ్వానాలు చేస్తోంటే అటునుంచి అటే లంకా నగరానికి చేరుకున్నాడు ఇంద్రజిత్తు.

-అరణి

# వసంతం వనాల సంతసం

నేను పుట్టిన కార్యం నెరవేర్చానో లేదో తెలియదు
పుట్టినప్పుడు నా మనసు వటబీజం
పచ్చని ఆకులూ లేవు, నునులేత చిగురులూ లేవు
గాలి కెరటాల నేపథ్యగానానికి
నాట్యం చేసే ఒడుపులూ ఎరగదు
ఎవడూ ఏ కార్యం కోసమూ పుట్టడు
రాముడైనా, కృష్ణుడైనా, సిద్ధార్థుడైనా సరే
పుట్టిపెరిగి నడకలు నేర్చుకుంటూ
నాలుగు మూలలూ వెతికే చూపులు సారిస్తూ
కారణాలు కర్తవ్యాలూ గ్రహిస్తారు
తన జీవితాన్ని ఒడ్డి లోకాన్ని అనుగ్రహిస్తాడు.
మెదడు పళ్ళెం నిండా నీళ్ళు పోసి,
ఒకటో రెండో పూలు పడేసి,
వాటినే ధ్యానంగా చూస్తున్న బాల్యంలో
ఆ పూలకెలా కదలిక కలిగిందోనని అబ్బురంతో
ఆలోచిస్తూ, చింతిస్తూ, ఎటూ తోచక నిట్టూరుస్తూ-
నిశ్చలన దృశ్యంలో అంతశ్చలనానికి కారణమేమిటా అని-
ఎవడైనా అంతే, నేనైనా అంతే!
కొన్ని కారణాలనయినా పరిష్కరించాక,
అనుకుంటాం గానీ-
కారణజన్ముడంటూ ఎవడూ ఉండడు

రక్త పంకిలాచ్ఛాదంలో కన్నులైనా విడువవు.
వాడి భవిష్యత్తెలా సాగుతుందో
తొమ్మిది నెలలు మోసి, మౌన సంభాషణలు
జరుపుతున్నా వాడెలా మారతాడో తల్లికైనా తెలీదు.
గుడ్డిలెక్కల జ్యోతిష్కులు కేవల కుక్షింభరులు
పరమ శుంఠలంతా దైవజ్ఞులే అయితే
ఈ పాటికి దైవం ఠక్కున చచ్చేవాడే;
ప్రతి మనిషీ ఎవడి రోడ్డు వాడే వేసుకుని,
రోలర్ బండ లాగుతూ చదును చేసుకుని,
సమతలం చేసుకోవాలి. నడుస్తూ సాగిపోవాలి.
ఆ రోడ్డు ఎక్కడకి వెడుతుందో తెలియదు.
గమ్యాలను తెలిపే పోస్టరులెవడూ నిలబెట్టలేదు.

కార్యంలోంచే కర్తవ్యాలు పుడతాయి.
కర్మలోంచే మర్మాలు విశదమవుతాయి.
తొలి అడుగే మలి అడుగుకి ఊపిరి;
ప్రేరణ దారిచూపు.
ఎంతటి ఆజానుబాహుడికైనా
మెదడు మోకాల్లో ఉండదు.
కాని, నడిచే పాదాలకు తెలుసు-
రాయవలసిన కవితా పాదాల రూపురేఖలు
నడవగా నడవగా రోడ్డు మిగలదు.
గమ్యం అందిందో లేదో తెలియదు
కాని, తెలిసిందల్లా గమ్యం మాత్రం అనుభవపూర్వం కాదని,
ఇతః పూర్వపరిచయ సౌందర్యం కాదని
నడక మాత్రం కన్నులకు తెలుస్తుంది లీలగా
అనాయాసంగా మరణించిన మహనీయుడు
రాస్తూ రాస్తూన్న వాక్యం ఆగిపోయినట్లు
ఒక్కటి మాత్రం రూఢి...
జడితిగా నిబ్బరంగా చెప్పగల యదార్థం.

నడచినంత మేరా పువ్వులే పువ్వులు!
కలలే కలలు - సుందర కవితా చరణాలై
ఎడారుల్లో నిలచిన దీపస్తంభాలై
దాహార్తులను పిలచే చలివేంద్రాలై
అది ఒక్కటే జ్ఞాపకం. నడుస్తూ నడుస్తూ అలసటతో,
నిటలార్ద్ర స్వేద బిందువుల క్షుత్ భారాలను
వ్రేళ్ళతో రాలుస్తున్నప్పుడు
ఒక ఫలితార్థం గొంతెత్తి పలికింది.
ఒక సార్థక్యం తృప్తిగా చిరునవ్వింది.
గుండెల్లో ఒయ్యారంగా మెరుపుతీగె సొబగు తేలింది.
ఆరంభ యౌవన పథికునిగా
సాగుతున్న తొలినాళ్ళ అంతశ్చింతనలో
ఆశించిన కృతార్థత అదేనా?
కావచ్చు, కాకపోనూ వచ్చు.
తృప్తి ప్రక్కనే నిలచిన అతృప్తి.
పాదాలు ముందుకే తోసింది.
ప్రక్కనుంచి వెనక్కి తప్పుకుంటున్న
కారు నల్లని నీడలు.



కారెను బోతుల్లా నన్ను ముట్టేద్దామని ప్రయత్నించి
చేతకాక తాహతులేక,
కళ్ళల్లో నీళ్ళు నింపుకుంటూ
గుండెల్లో కుతకుతలు మరిగిస్తూ
వెనక్కి వెనక్కి వెళ్ళిపోయాయి
మళ్ళీ పికరులేదు.
ఏకాగ్రకర్మణ్య నిష్ఠలోనే నైరూప్య భూతాల ఓటమి
అరవై రెండేళ్ళ పక్కా కవితాయాత్రలో
ఎన్నడూ ఫలితార్థాల కోసం వెతక్కపోయినా
సినీమాల పాటలు రాసి, తళతళలాడుతున్న వాళ్ళని చూసి,
భార్యాపిల్లలూ మనమలూ చులకనగా, హేళనగా,
ఏం సాధించారని ఎద్దేవా చేసినా,
అవార్డులూ రివార్డులూ బిరుదులూ సంచులూ

# నివాళి



## ఆవంత్స సోమసుందర్
## 1924-2016

అందరూ ఆర్జించుకుంటున్నారు కదా - అవేమీ లేకుండా
మీరెందుకిలా కష్టపడుతున్నట్లు
అంటూ అవమానాల ఎత్తిపోతలు పోస్తున్నా
నా గమనం సాగక తప్పలేదు; అవిచ్ఛిన్నంగా
అకుంఠితంగా సాగిందని చెప్పడం సహజోక్తి
నేను త్రిశుద్ధిగా ప్రేమించేది కవితాధారను
నేను ఆరాధించేది గౌతమీ పావనోదార వాగ్ధారను
దూషణ, భూషణ తిరస్కారాదులతో నిమిత్తం లేదు.
గోదావరికి దాని నడకల సొగసుల మీదే నిలుస్తుంది చూపు
దాని పురోగమనం ఆగదు. విజయపరంపర వీగదు.
అయినా వెదికే  కన్నుల చెరలాటలో
దరికిరాని సొగసులెన్నో అద్దరినే
నిలిచాయి పిలిచినా వినిపించుకోవు
హృదయాన్ని ఉర్రూతలూగించిన నారికేళాలెన్నో
చేతులూపుతూ పిలుస్తూనే ఉన్నాయి.
కన్నులు మెరిపిస్తూనే ఉన్నాయి.
నారికేళ పత్రాల చీలికల వెన్నెల నీడలేవో
ఇంకా గుండెల్లో పిల్లాటలాడుతున్నాయి.
మనసులో మెదులుతున్నాయి రచించని కవితలు
ఏనాటి షోకులో గోదావరికని అడుగుతున్నాయి.
తొంభయ్యో యేట ప్రవేశించావు  కదా-
రాద్దామనుకుంటున్న కవితలెప్పుడు రాస్తావురా!
అంటూ చనువుగా అడుగుతుంది మా అమ్మలా గోదావరి.
ఇసుక తెల్లని మిసిమి తివాసీ.
శారదాంబర సరసి సింగారాల మురిసి
పసిడి గుమ్మడి పళ్ళు లంకలెత్తిన మురిపాల బిడ్డలు
ఏనాటి సొగసులో గోదావరికి
అలిఖిత కవిత్వంలా
అలరిస్తూనే ఎంత వయస్సో గోదావరికి?
ఇంత నిండు జవ్వనిలా కవిత్వమై కదులుతూ
"కవీ, నీ గుండెల కదిలే కవితా పుంజాలు అజరామరాలు"
నీ కలం నుంచి రాకపోయినా, నీ కలల నుంచి జాలు వారి,
నీ అనుజన్ముల కలలలోకి కలవరాలై ప్రవహిస్తాయి.
భూతలంపై పారే సమస్త నదులూ అంతశ్శలనాల
మౌన భాషణంలో ముచ్చట్లాడుకుంటున్నట్లు
ఏ గుండెలలో దాగిన కవితలనైనా,
ఏ తీర భూములలో దాచిన ప్రేమలనైనా,
అంజనాద్రుల లోయలన్నిటినీ చీల్చి
వెదికి వెదికి వెలుతురు కలల చాళ్ళలో తేల్చి
పురానవీన తరంగాలను  శ్రుతి చేస్తూ,
కాలానికీ, జననాంతరాలకీ అతీతంగా,
ఒక కావ్య స్వప్న రసమయి వధూళికలో
పులకించిపోతూ మృత్యుంజయమై
పలవించిపోతూ మృత్యుంజయమై

ప్రతి పతనమూ ప్రాణాంతకం కాదు
శత్రువుని ప్రస్తుతించడమే మహా పతనం
ఆశావహ వాగ్దానం వంటి కవిత్వం - వృష్టి పరిమళం
అనంతానుభవప్రదమై మనోంతరాళాల పరవశింపజేసే వాసన
నా మహాప్రజకి ఇదే నా 92వ పుట్టినరోజు కానుక.
కానుకలన్నీ పాదార్థికాలేకావు.
పదానికొకే అర్థం ఉంటుందనుకోవడం
ఎలిమెంటరీ బోధనా పరాయణత్వం
ఏకాక్షర పదాలెన్నో సాంద్ర భావనాగర్భితాలు
అసలు అక్షరానికే క్షయం లేదు. క్షరం లేదు.
రోచిష్ణువు భాతి ఎల్లలను లెక్కచేయదు.
అందుకే వెలుగు రెక్కలు తొడుక్కుని ఎల్లలోకాలూ
సంచరిస్తాను. అహరహ యాత్రా సంరంభంతో
పురోగమిస్తాను నేస్తులారా
మీ అందరికీ ఆలింగనాలూ... కరచాలనాలూ...
నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది.
మా నాన్నగారు డబ్బయ్యో జన్మదినం జరుపుకుని
దివంగతులయ్యారు మా అన్నలూ అంతే
సంకల్పాలకూ, సంప్రదాయాలకూ సంబంధం లేదు.
వారసత్వాలకూ వాసనా సంస్కారాలకూ పొత్తు కుదరదు.
ఈషన్మాత్ర సంబంధాల కోసం పరిశోధించే శాస్త్రజ్ఞులకు
మానవ శరీరశాస్త్రం తిరగరాస్తున్న సమయంలో
ఈ పాయింటు ఉటంకించక తప్పదు

నా జీవితం పదహారేళ్ళ ప్రాయం నుంచీ
క్రిక్కిరిసిన కర్మణ్యత్వంతోనే సాగింది
నేను చేయవలసిన సత్కార్యాలింకా మిగిలే ఉన్నాయి.
అవన్నీ పూర్తిచేసే వరకూ ఈ బంగరు
భూమిని విడిచి పెట్టేది లేదు.
హాయిగా ఆశావహంగా, కర్తవ్యోన్ముఖంగా
కరతల వేణువుగా జీవమే శరదశ్శతం
నందామ శరదశ్శతం అన్నదే నా సత్యంకల్పం
నా సోదర జనానీకాన్ని ప్రతిదినం పలకరిస్తూనే ఉంటాను.
నాతో కలిసి మీరూ మానవ విజయగీతం ఆలపిస్తే
అతులానందమనుభవిస్తాను
మీకు శుభకామనలందిస్తాను.
నా జాతి తప్పక తరిస్తుంది.
సామ్యవాద సుమనో వ్యవస్థలోనికి జాగరిస్తుంది.
తప్పకుండా అనండి తథాస్తు
గొంతెత్తి కోరండి అందరూ శుభమస్తు

**-డా. సోమసుందర్**




ఆగస్టు 24 నుంచి
ఆగస్టు 30 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

విందువినోదాలు, విద్యా విషయాలు, వృత్తి వ్యాపారాలు, భాగస్వామి వ్యవహారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం లభిస్తుంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 25,26 తేదీల్లో ఇంటర్వ్యూలలో పరాజయం ఎదురయ్యే అవకాశం ఉంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 27,28,29 తేదీల్లో కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. కుటుంబసభ్యుల ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపాలి. 30న సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వేడుకలు, పొదుపు పథకాలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం సృజనాత్మక రంగాల వారికి శుభప్రదం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. 25,26 తేదీల్లో ఆర్థిక పరిస్థితి నిరుత్సాహకరంగా ఉంటుంది. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 27, 28,29 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రేమానుబంధాలు బలపడతాయి. మెయిల్స్, కీలక పత్రాలు అందుకుంటారు. బోధన, రవాణా రంగాల వారు నిదానం పాటించాలి. 30న రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యావిషయాలు, బదిలీలు, నిర్మాణాలు, ఇంట్లో వేడుకల అంశాలకు అ వారం ప్రాధాన్యమిస్తారు. బుధవారం సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 25,26 తేదీల్లో బదిలీలు, మార్పులు, చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్ రంగానికి చెందిన వారు నిదానం పాటించాలి. కుటుంబ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు 27, 28, 29 తేదీల్లో ఆర్థిక విషయాలకు సంబంధించి స్పష్టమైన నిర్ణయాలు తీసుకుంటారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 30న కీలకమైన పత్రాలు అందుకుంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, సోదరీసోదరుల వ్యవహారాలు, బదిలీలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. విద్యాసంస్థలతో పనులు పూర్తవుతాయి. సమావేశాలు ఫలిస్తాయి. 25,26 తేదీల్లో విద్యార్థులకు నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది. ప్రయాణాలు, చర్చల్లో జాగ్రత్తలు పాటించాలి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. 27, 28,29 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలపై దృష్టి పెడతారు. 30న పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల నుంచి ఒత్తిడి రావచ్చు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, పొదుపు పథకాలు, షాపింగ్, కీలక నిర్ణయాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 25,26 తేదీల్లో పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. ఖర్చులు అంచనాలు మించుతాయి. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 27,28,29 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సమకూర్చుకుంటారు. విరాళాలకు ఖర్చు చేస్తారు. 30న పెట్టుబడులు, రుణాలు, పొదుపు పథకాలకు సంబంధించి ఆరా తీస్తారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, దూరప్రయాణాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం సమావేశాలు, చర్చలు ఫలిస్తాయి. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 25,26 తేదీల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వ్యాపారంలో ప్రోత్సాహకరం. 27, 28,29 తేదీల్లో బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఒక సమాచారం అవేదన కలిగిస్తుంది. 30న దూరప్రయాణాలు, ఉన్నత విద్యా విషయాల్లో అనుకోని ఆటంకాలు ఎదురవుతాయి. ఆత్మపరిశీలన చేసుకుంటారు. యోగధ్యానాలకు అనుకూలం.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ప్రముఖుల కలయిక, ప్రయాణాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం కష్టానికి తగిన ప్రతిఫలం లభిస్తుంది. ఆరోగ్యం మెరుగవుతుంది. 25,26 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. రాజకీయ, సినీ రంగాల వారు శుభవార్త అందుకుంటారు. 27, 28,29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. పెద్దల ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. 30న బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. యూనియన్‌లు, సహకార సంఘాల కార్యకలాపాల్లో పాల్గొంటారు.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, బంధుమిత్రుల కలయిక, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వివాహాది శుభ కార్యాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 25,26 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పెట్టుబడుల్లో నిదానం అవసరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 27, 28, 29 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. ఖర్చులు అంచనాలు మించుతాయి. 30న బృందకార్యక్రమాల్లో కీలక పాత్ర పోషిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

ఆర్థికపరమైన సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, పెద్దలు, బంధుమిత్రుల కలయికపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. 25,26 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. జనసంబంధాలు విస్తరిస్తాయి. 27, 28,29 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం లభిస్తుంది. బీమా, గ్రాట్యుటీ పనులకు అనుకూలం. సంస్మరణల్లో పాల్గొంటారు. 30న సమావేశాల్లో పెద్దల వైఖరి అనుకూలంగా ఉంటుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

భాగస్వామ్యాలు, ఆర్థిక వ్యవహారాలు, ప్రయాణాలు, వేడుకలు, వృత్తి, వ్యాపార విషయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 25,26 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపుతారు. 27, 28,29 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. శ్రీమతి, శ్రీవారి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. సమావేశాలకు ఏర్పాట్లలో అసౌకర్యం కలుగుతుంది. 30న ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి. విద్య, సమావేశాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, బీమా, రుణప్రయత్నాలు, ఫీజులు, బిల్లుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 25,26 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. విలువైన వస్తువులు సేకరిస్తారు. 27,28,29 తేదీల్లో ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపిస్తారు. సహోద్యోగుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. వైద్యం, హోటల్, పరిశ్రమల రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. 30న స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లు, భాగస్వామికి సంబంధించిన అంశాలు, క్రయవిక్రయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లాభిస్తాయి. 25,26 తేదీల్లో కుటుంబసభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 27,28,29 తేదీల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ఖర్చులు అధికం. 30న భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు.




## అక్షయ్‌కుమార్ పిచ్చోడా?



అక్షయ్ కుమార్‌కి పిచ్చె క్కడం ఏమిటి? అని కంగారు పడకండి. 'రుస్తుం' ఇచ్చిన సక్సెస్ అతగాడిని పిచ్చివాడిని చేస్తోందన్న అపోహ కూడా అక్కర్లేదు. అక్షయ్ కుమార్ కొత్త సినిమాలో క్యారెక్టర్ అది. 'క్రాక్' పేరుతో వస్తున్న ఈ సినిమాలో అక్షయ్ ఓ పిచ్చివాడిలా కనిపించబోతున్నాడట! ఈ మేరకు సరిగ్గా అదే లుక్‌తో ఓ పోస్టర్ విడుదల చేశారు. ఇప్పటి వరకూ ఎన్నో మంచి సినిమాలు తన ఖాతాలో వేసుకున్న అక్షయ్‌కు ఇది కూడా ఓ మంచి సినిమా అవుతుందని బాలీవుడ్ జనాలు అప్పుడే జోస్యం చెప్పేస్తున్నారు. ఒక్క పోస్టర్‌తోనే సినిమా మీద ఇంత ఆసక్తి కలిగించాడంటే సినిమా మొత్తం కచ్చితంగా ఆసక్తికరంగానే ఉంటుందని అంటున్నారు. సినిమా ఎలా ఉంటుంది అనేది తెలుసుకోవాలంటే వచ్చే స్వాతంత్ర్య దినోత్సవం వరకూ ఆగాల్సిందే!

## ఆ మూడే ముంచాయట!

ఒకప్పుడు ఎ.ఎం.రత్నం భారీ చిత్రాలకు కేరాఫ్ అడ్రస్‌గా ఉండేవాడు. అలాంటి వ్యక్తి క్రమేపీ తెర మరుగైపోయాడు. మధ్యలో కొన్ని సంవత్సరాలు సినిమాలకు పూర్తిగా దూరమయ్యాడు కూడా! తిరిగి కొద్దిగా కోలుకుని ఇటీవలే తమిళ సినిమాలు నిర్మించడం ప్రారంభించాడు. తను సినిమాలకు దూరం కావడానికి కారణాలేంటో ఎ.ఎం. రత్నం ఇటీవల వివరించాడు.



ఓ మూడు సినిమాలు తనని నిట్టనిలువునా ముంచాయి అంటూ చెప్పుకొచ్చాడు. ఆ సినిమాల వలన దాదాపు 60 కోట్ల రూపాయల నష్టం వచ్చిందట! ఆ దెబ్బతోనే కొన్ని సంవత్సరాలు సినిమాలకు దూరంగా ఉండవలసి వచ్చిందని వివరించాడు. 'బాయ్స్', 'ప్రేమికులరోజు' 'ఎవడు' సినిమాలే తనని కోలుకోలేని దెబ్బతీశాయన్నది ఈ నిర్మాత ఆవేదన.

## డబ్బుల్లేక కాదు వాస్తు లేకనే!

మాటల మాంత్రికుడు త్రివిక్రమ్ అధునాతనమైన హంగులతో ఫైవ్‌స్టార్ హోటల్‌ను తలదన్నేలా ఓ కొత్త ఇంటిని కట్టుకుంటున్నాడన్న సంగతి తెలిసిందే! ఇటీవలి కాలంలో ఆ ఇంటి నిర్మాణం జోరు కొద్దిగా తగ్గింది. దాంతో చాలా మందికి పలు అనుమానాలు కలిగాయి. త్రివిక్రమ్ దగ్గర డబ్బులు లేవేమో అందుకే పనులు మందకొడిగా సాగుతున్నాయని అనుకున్నారు. కానీ జరిగింది అది కాదు. ఇంటి నిర్మాణంలో వాస్తు లేదని ఎవరో అన్నారట! దాంతో పనులు ఆపకుండా నెమ్మదిగా చేయిస్తూ వాస్తు పండితుల సలహా మేరకు మార్పులు చేర్పులు చేయిస్తున్నాడట త్రివిక్రమ్!

ఈ పనుల మధ్యలో సినిమా షూటింగ్ ఒకటి మొదలు కావలసి ఉండడంతో ఇంటి పనులు నెమ్మదిగా సాగుతున్నాయట! అదీ సంగతి... అంతే తప్ప త్రివిక్రమ్ దగ్గర డబ్బుల్లేక కాదు అంటున్నారు.



## ఆ భగవంతుడికే తెలియాలట!

అప్పుడెప్పుడో ఓ తెలుగు సినిమాలో హీరోగారి తల్లి 'నీవెప్పుడు ప్రయోజకుడివి అవుతావో ఆ భగవంతుడికే తెలియాలిరా' అంటుంది. సరిగ్గా ఈ డైలాగు కొద్దిగా అటూ ఇటూగా సల్మాన్ తండ్రి కూడా ఉపయోగిస్తున్నాడు. కాకపోతే కొడుకు ప్రయోజకుడన్న విషయం ఆ తండ్రికి తెలుసు. కొడుకు పెళ్ళే ఆ తండ్రికి అర్థం కాని పజిల్‌గా ఉందట!



ఐదు పదుల వయస్సున్న తన కొడుకు పెళ్ళి ఎప్పుడు చేసుకుంటాడో తనకు కాదు కదా, అతడిని పుట్టించిన భగవంతుడికి కూడా తెలియదంటున్నాడు సల్మాన్ తండ్రి! ఆ తండ్రి బాధతో అన్నాడో, లేక నిరాశతో అన్నాడో తెలియదు కానీ, ఇప్పుడా విషయం సోషల్ మీడియాలో బాగా చక్కర్లు కొడుతోంది. ఈ వృద్ధ బ్రహ్మచారి పెళ్ళి చేసుకోకపోతే వచ్చే నష్టం ఏమీ లేదని కూడా కొందరు అంటున్నారు.

## పుష్కరాలనూ వదలని వర్మ



రాంగోపాల వర్మ అప్పుడెప్పుడో వంగవీటి మోహనరంగ జీవిత కథను తెరకెక్కిస్తున్నట్టు ప్రకటించి అంతే అర్జంటుగా ఫస్ట్‌లుక్ కూడా విడుదల చేసేశాడు. ఆ తరువాత ఆ సినిమా గురించి ఒక్కటంటే ఒక్క వార్త కూడా బయట పెట్టలేదు. దాంతో వర్మ ఆ సినిమాని అటక ఎక్కించేశాడని అందరూ అనుకున్నారు కానీ, వర్మ మాత్రం ఆ సినిమాను మరిచిపోలేదన్న విషయం తాజా సంఘటన బట్టి అర్థమవుతోంది. ఆ సంఘటన ఏమిటంటే...కృష్ణా పుష్కరాలను వర్మ తన టీంతో షూట్ చేయిస్తున్నాడట! రంగాది విజయవాడ అన్న సంగతి తెలిసిందే. పుష్కరాలకు, అతని జీవితానికి ఎంతో కొంత సంబంధం ఉండే ఉంటుందని, దానికి సంబంధించిన సీన్లనే వర్మ షూట్ చేయిస్తున్నాడని అందరూ అనుకుంటున్నారు. సినిమా కోసమా? లేక మరొక కొత్త సినిమా ఆలోచనతో ఈ షూటింగ్ చేయిస్తున్నాడా? అన్న అనుమానం కూడా కొంత మందికి వస్తోంది. వీటి మీద వర్మ ట్వీట్ చేస్తే తప్ప అసలు విషయం తెలియదంటున్నారు సినీ జనాలు.

# కొన్ని సార్లు అదే బెస్ట్

**- రకూల్‌ప్రీత్ సింగ్**

**బ్యూటీ విత్ బ్రెయిన్ అన్న మాటకు నిలువెత్తు నిదర్శనం రకూల్ ప్రీత్‌సింగ్. 'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్'లా టాలీవుడ్‌లోకి దూసుకు వచ్చిన రకూల్ సినీ ప్రయాణం బ్రేకుల్లేని బండిలా దూసుకుపోతూనే ఉంది. కుర్ర హీరోలకూ, స్టార్ హీరోలకూ మంచి ఆప్షన్‌గా మారిన రకూల్ ప్రస్తుతం 'కల నెరవేరెగా.... కోరిక తీరెగా' అని పాడుకుంటోంది. ఆ కల ఏమిటో... ఆ కోరిక ఏమిటో...ఆమె మాటల్లోనే...**

**మహేష్‌బాబుతో నటించాలన్న కోరిక తీరి నట్టేగా?**

తీరింది. అది ఇంత త్వరగా తీరుతుందని అనుకోలేదు.

**కథ కూడా వినకుండా ఓకే చెప్పారట నిజమేనా?**

కొన్నిసార్లు కొన్ని విషయాలు ఆలోచించడం అనవసరం. వాటి వల్ల బుర్ర చెడిపోవడం తప్ప ఇంకేం ప్రయోజనం ఉండదు. ఓ స్టార్ హీరో, ఓ అగ్ర దర్శకుడితో కలిసి పనిచేస్తున్నాడంటే అది కచ్చితంగా మంచి ప్రాజెక్టే అయి ఉంటుంది. కథ నచ్చకపోతే ఆ హీరో ఎందుకు ఒప్పుకుంటారు? ఆ దర్శకుడు ఎందుకు చేస్తారు? అన్నీ బాగుంటేనే కదా ఇద్దరూ కలిసి చేసేది. అందుకే కథ కూడా వినకుండా ఓకే చెప్పేశాను. కొన్ని సార్లు అదే బెస్ట్ మెథడ్. అసలు మనకంటే కూడా వాళ్ళే బాగా ఆలోచిస్తారు కూడా!

**సినిమా ఫ్లాపు అవుతుందేమో? అవకాశాలు రావేమో అన్న కంగారు ఉండదా?**

ఏ సినిమా ఫలితం ఎలా ఉంటుందో ముందే ఎవరూ చెప్పలేరు. కొన్ని సార్లు మంచి విజయం సాధిస్తాయనుకున్న సినిమాలు కూడా అట్టర్ ఫ్లాప్ కావచ్చు. మరికొన్ని యావరేజ్‌గా ఆడొచ్చు అనుకుంటాం. అవి బ్లాక్ బస్టర్ అవుతూ ఉంటాయి. అసలు సినిమా ఫ్లాప్ అయినా, సక్సెస్ అయినా బాధ్యత నా ఒక్కదాని మీదే ఉండదు కదా? అది సమిష్టి బాధ్యత. నా టాలెంట్, నటన చూసి అవకాశాలు వస్తున్నాయి తప్ప రకూల్‌కి ఫ్లాపులున్నాయా? సక్సెస్‌లున్నాయా? అని చూడడం లేదు. అందుకే నాకు అవకాశాల గురించి బెంగలేదు. కొన్ని సినిమాలకు డేట్లు అడ్జస్ట్ చేయలేక వదులుకుంటున్నాను కూడా!

**మెగాహీరో సినిమా ఒప్పుకుని వదిలేయ డానికి కారణం?**

మహేష్‌బాబు గారి సినిమాకి ఆ సినిమాకి డేట్లు అడ్జస్ట్ కావడం లేదు. ఈ రంగంలోకి వచ్చినప్పటి నుంచీ మహేష్ బాబుగారితో సినిమా చేయాలన్నది నా కోరిక. అందుకే తప్పనిసరి పరిస్థితిలో ఆ సినిమా వదులుకోవలసి వచ్చింది. ఇదే విషయాన్ని వివరంగా దర్శక నిర్మాతలతో పాటు హీరోకి వివరించి చెప్పాను. వారు నన్ను అర్థం చేసుకున్నారు.

**నెంబర్ వన్ హీరోయిన్ అయ్యాననే అనుకుంటున్నారా?**

ఈ నెంబర్ల గేమ్ మీద నాకు నమ్మకం లేదు. కొన్ని సినిమాలు విజయం సాధించినంత మాత్రాన నెంబర్ వన్ హీరోయిన్ అనడం, ఫ్లాప్‌లు వస్తే ఐరన్‌లెగ్ అనడం మంచిది కాదు. ప్రతి హీరోయిన్‌కీ సక్సెస్‌లూ, ఫ్లాపులూ ఉంటాయి. సక్సెస్‌లు వస్తే అన్నీ తెలిసినట్టూ, ఫ్లాప్‌లు వస్తే తెలియనట్టు కాదు. నటన అనేది సముద్రం లాంటిది. నేర్చుకుంటున్న కొద్దీ కొత్త కొత్త విషయాలు ఉంటూనే

ఉంటాయి. నటన పరంగా నేను ఇంకా విద్యార్థి దశలోనే ఉన్నాను. నేను నిత్య విద్యార్థిని. ప్రతి రోజూ ఏదో ఒక కొత్త విషయం నేర్చుకుంటూనే ఉన్నాను. ఈ రంగంలో నేను నేర్చుకోవలసినవి, సాధించాల్సినవి ఎన్నో ఉన్నాయి.

**మీ విజయం వెనుక ఎవరున్నారని భావిస్తున్నారు?**

మా కుటుంబమే నా విజయానికి కారణం. వారు నాకు ఇస్తున్న సపోర్ట్ గురించి ఎంత చెప్పినా తక్కువే! ఆ తరువాత తెలుగు ప్రేక్షకులు. వారే లేకపోతే ఈ రోజు రకుల్ అనే హీరోయిన్ ఉండేదే కాదు. ఎక్కడో గోల్ఫ్ ఆడుకుంటూ ఉండేదాన్ని. తెలుగు ఇండస్ట్రీ ఇస్తున్న సపోర్ట్ నా జీవితంలో ఎప్పటికీ మరిచిపోలేను.

**గోల్ఫ్‌ను పూర్తిగా మానేసినట్టేనా?**

చిన్నతనం నుంచీ నాకు ఎంతో ఇష్టమైన ఆట గోల్ఫ్. గోల్ఫ్‌లో అంతర్జాతీయ స్థాయిలో పేరు తెచ్చుకోవాలని చిన్నతనంలో కలలు కనే దాన్ని. కానీ నటిగా మీ ముందుకు వచ్చే అదృష్టం ఉంది కాబట్టి నా కిష్టమైన గోల్ఫ్‌ను పక్కన పెట్టేయాల్సి వచ్చింది. ఎప్పుడన్నా తీరిక దొరికితే ఆడుతుంటాను.

**స్టార్ హీరోలందరితో నటించేసినట్టున్నారు?**

లేదు. ఇంకా కొందరు మిగిలి ఉన్నారు. వారి నుంచి పిలుపు ఎప్పుడొస్తుందా? అని ఎదురు చూస్తున్నాను.

**తెలుగు బాగా వచ్చినట్టు ఉంది?**

తెలుగు సినిమాలు చేస్తూ తెలుగు నేర్చుకోకపోతే ఎలా? తొంభై శాతం వచ్చేసింది. మాట్లాడేటప్పుడు చిన్న చిన్న తప్పులు దొర్లుతున్నాయి అంతే! భాష బాగా అలవాటు కావాలని ఇంట్లో కూడా ఎక్కువగా తెలుగులోనే మాట్లాడుతుంటాను. అది అర్థం కాక మావాళ్ళు భలే తికమకపడుతుంటారు. అప్పుడు భలే ఫన్నీగా అనిపిస్తుంది.



**లిప్‌లాక్‌లు, శృంగార సన్నివేశాల్లో నటించేటప్పుడు ఇబ్బందిగా అనిపించదా?**

అవి సినిమాలో ఓ భాగమవుతాయే తప్ప వాటిని విడిగా చూడ కూడదు. సినిమాలో అన్నీ ఉంటాయి. కథానుగుణంగా కొన్నిసార్లు శృంగార సన్నివేశాలతో పాటు లిప్‌లాక్‌లు కూడా ఉండవచ్చు.

నా దృష్టిలో అవన్నీ నటనలో ఓ భాగం మాత్రమే! ఇలా అనుకుంటే ఏవీ ఇబ్బంది కలిగించవు.

**మీ విజయ రహస్యం?**

కష్టపడి పనిచేస్తాను. పరాజయాలు ఎదురైనా కుంగిపోను. ఎందుకు ఎక్కడ ఫెయిల్ అయ్యాను అన్న విషయాన్ని పరిశీలించుకుంటాను. నేను తప్పులు చేయలేదు అని చెప్పడం లేదు. నా సినిమాల్లో కూడా అప్పుడప్పుడు తప్పులు చేస్తూనే ఉంటాను. వాటిని ఎప్పటికప్పుడు సరిదిద్దుకోవడం నా అలవాటు. ఈ కారణంగానే నా సక్సెస్ రేటు ఎక్కువ అని నా సన్నిహితులు అంటూంటారు. నా లోపాన్ని ఎవరు ఎత్తి చూపినా కోపగించుకోను. వారు ఎందుకు చెప్పారా? అని ఒకటికి రెండు సార్లు ఆలోచిస్తాను.



**మీరు ఆదర్శంగా తీసుకునే వ్యక్తుల గురించి...**

సినిమాల పరంగా అయితే అనుష్క నాకు ఆదర్శం. సినిమాల్లో తను చేసిన ప్రయోగాలు మరెవ్వరూ చేసి ఉండరేమో అనిపిస్తుంది. ఏ ప్రయోగం చేసినా తనకే చెల్లింది. ఇక వ్యక్తిగత జీవితానికి వస్తే మా పేరెంట్సే నాకు ఆదర్శం. చిన్నతనం నుంచి నా కెరీర్‌ను తీర్చిదిద్దడానికి వారు చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. ఓ కూతురిగా వారిని సంతృప్తి పరచాననే అనుకుంటున్నాను.

**హిందీలో నటించడం లేదు ఎందుకు?**

అక్కడ నుంచి అవకాశాలు బాగానే వస్తున్నాయి. దక్షిణాదిన బాగా బిజీగా ఉన్నాను. ఇక్కడ ఒప్పుకున్నవి వదిలేసి బాలీవుడ్‌లో కొత్తగా ఒప్పుకోవడం ఎందుకు? ఇక్కడ నేను ఒప్పుకున్న సినిమాలు పూర్తి కావడానికి మరో రెండు మూడు సంవత్సరాలు పడుతుంది. ఆ తరువాత బాలీవుడ్ గురించి ఆలోచించాలి. అమితాబ్ సార్ అంటే చాలా ఇష్టం. ఆయన సినిమాలో చిన్న పాత్ర అయినా చేసే అవకాశం వస్తే ఏదో విధంగా ఇక్కడ డేట్లు అడ్జస్ట్ చేసి ఆయనతో నటిస్తాను.

**ఇంత సక్సెస్ సాధించాక కూడా ఇద్దరు హీరోయిన్లు ఉన్న సినిమా ఎందుకు చేస్తున్నారు?**

సినిమాలో ఎంత మంది ఉన్నా నా పాత్ర నాకు ముఖ్యం. దర్శకుడు నా పాత్రను ఎలా తీర్చిదిద్దారు అన్నదే చూస్తాను తప్ప ఎంత మంది హీరోయిన్లు ఉన్నారన్నది పట్టించుకోను.

**మహేష్‌బాబుతో సినిమా అయిపోగానే పెళ్ళి చేసుకుంటున్నారా?**

మహేష్‌బాబుతో చేయగానే పెళ్ళి చేసుకుంటానని ఎక్కడా చెప్పలేదు. ఈ వార్త ఎలా వచ్చిందో నాకు తెలియడం లేదు. నా పెళ్ళికి ఇంకా సమయముంది. చేసుకునే ముందు అందరికీ చెప్పే చేసుకుంటాను.

-చిన్ని

## ఇంటర్వ్యూ



**రంగస్థల సినీ నట దిగ్గజం కాకరాల. 80 నాటకాలు ప్రదర్శించి అపారమైన రంగస్థల నటనానుభవం సంపాదించుకున్నారు. రెండువందల చిత్రాలకు పైగా నటించారు. హీరోల చుట్టూ కథలు అల్లుతూ గ్లామర్‌ని ఆకాశానికెత్తే ధోరణి వల్లనే ఎక్కువ చిత్రాలు ఫ్లాపులు చవిచూస్తున్నాయంటున్న కాకరాల ఇంటర్వ్యూ...**

# హీరో చుట్టూ కథలల్లి, గ్లామర్‌ని నమ్ముకుంటే ఫ్లాపులే!

**-కాకరాల**

పశ్చిమ గోదావరి జిల్లా పెరవలి మండలం ఖండవల్లిలో జన్మించాను. మా నాన్నగారు కాకరాల వీరభద్రం. అమ్మ కనకమహాలక్ష్మి. నా పూర్తిపేరు కాకరాల వీర వెంకట సత్యనారాయణ. సినీ నాటక రంగాల్లో కాకరాలగానే ప్రసిద్ధి. తొమ్మిదో తరగతిలో తెలుగు మాస్టారి చొరవతో సంస్కృత నాటకం 'భోజసభ'లో, 'ఒథెల్లో' నాటకంలో జడ్జి పాత్ర వంటివి చేశాను. దాంతో నేను మంచి నటుడినవుతానని మా ఉపాధ్యాయులు, తోటి విద్యార్థులు ఆకాశానికెత్తేశారు. దాంతో నా ధ్యాస నాటకాలవైపు మళ్ళింది. ఎస్ఎస్ఎల్‌సీ వరకు చదువుకున్నాను.

### నాన్నతో సంఘర్షణ

నాకు ఊహ తెలిసేనాటికి కాకరపర్రులో మా అమ్మమ్మ మా ఇంటి ఎదురు దిబ్బమీద తోలు బొమ్మలాట ఆడిస్తూ ఉండేది. దేవీ నవరాత్రులు, చెక్కభజనలు, సంకీర్తనల్ని చూడటం, ఆస్వాదించడం నా అభిరుచిగా మారిపోయింది. నేను నటుడు కావడం మా నాన్నకు బొత్తిగా ఇష్టం లేదు. మా మధ్య కోల్డ్‌వార్ జరిగేది. నాన్నకు తెలియకుండా నాటకాలు వేయడం, ఆయన నన్ను తిట్టడం అలవాటుగా మారిపోయింది.

### మా ఇంటికి చెరో వైపు ఆదుర్తి, రాజబాబు ఇళ్ళు

మా పెదనాన్న కాకరాల కామేశ్వరరావు ప్రోత్సాహంతో 1953-54లో 'సత్యహరిశ్చంద్ర', 'శ్రీరామాంజనేయ యుద్ధం' వంటి పౌరాణిక నాటకాలతో నటప్రస్థానం ప్రారంభించాను. రాజమండ్రి ఆర్యాపురం మత్స్యవీధిలో ఆదుర్తి సుబ్బారావుగారు, పుణ్యమూర్తుల రాజబాబుగారి రెండిళ్ళ మధ్యా మా ఇల్లు ఉండేది. అక్కడే గుడిదగ్గర నాటకాలు వేసేవాళ్ళం. పృథ్వీరాజ్‌కపూర్ 'పైసా' నాటకాన్ని 'ధనం' పేరుతో, వెల్లంకి వెంకటేశ్వరరావుగారి 'విష కుంభం', ఆత్రేయగారి 'భయం' నాటకాలు ప్రదర్శించేవాళ్ళం. అప్పుడే గరికపాటి రాజారావుగారి దృష్టిలో పడ్డాను. ఆయన నా గురుతుల్యులు. ఆయన దర్శకత్వంలో కొర్రపాటి గంగాధరరావుగారి 'భవభంధాలు', 'మనోవ్యధ' తదితర నాటకాలన్నీ హైదరాబాద్ రవీంద్రభారతిలో ప్రదర్శించడంతో రంగస్థల నటుడుగా నా పేరు స్థిరపడింది.

### సినీ కరస్పాండెంట్‌గా

ఓ మిత్రుడి సలహాతో 'నవ్వులు-పువ్వులు' అనే సినీ పత్రికలో కరస్పాండెంట్‌గా జేరి తరచు మద్రాసు వెళ్ళేవాణ్ణి. 1953లో వివాహం జరిగింది. నా భార్యపేరు సూర్యకాంతం. మాకు ఇద్దరు కూతుళ్ళు. కుటుంబాన్ని రాజమండ్రిలోనే ఉంచి రాజారావుగారి ఆహ్వానంతో మద్రాసు చేరాను. ఆయన ఇంట్లో బస, హోటల్ భోజనం. కరస్పాండెంట్‌గా సినీ పరిచయాలు.. ఇక తర్వాత 1960లో కుటుంబంతో అక్కడే స్థిరపడ్డాను.

### రాజారావుగారి దర్శకత్వంలో 20 నాటకాలు

పుట్టిల్లు చిత్రం తర్వాత ఎనిమిదేళ్లకు రాజారావుగారు మళ్ళీ చిత్రం ప్రారంభించారు. రికార్డింగ్, ఒక సెట్టు పని కూడా పూర్తయ్యాక ఆర్థిక సంక్షోభం వచ్చింది. దాన్నుంచి బైటపడేందుకు ఆయన 'ఇప్టా' (ఇండియన్ పీపుల్స్ థియేటర్ ఆఫ్ ఆర్ట్స్)ను పునరుద్ధరించారు. అలా 1960 - 63లో మూడేళ్ళూ ఆయనకు సహకరించా. అలా అల్లూరి సీతారామరాజు నాటకంలో సింగన్న పాత్ర, జైభవాని నాటకంలో సర్వసైన్యాధిపతి, బాజీరావు దేశ్‌పాండేగా మద్రాసు, టంగుటూరు, హైదరాబాద్, విశాఖపట్నంలలో ఆయన దర్శకత్వంలో ఇరవై నాటకాలు వేశాం. నాటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి సమక్షంలో రవీంద్ర భారతిలో జైభవాని నాటకం ప్రదర్శించాం. ఇందులో కథానాయిక గజరా పాత్రలో వాణిశ్రీ నటించింది. ఆ అమ్మాయి అసలు పేరు రత్నకుమారి. ఈ విధంగా నా నాటక చరిత్రలో 80 వరకు నాటకాలు ప్రదర్శించాను.

### సినీ యాత్ర

'సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి' సినిమా కోసం నటుల ఎంపిక సమయంలో నిర్మాత టి.ఆర్.సుందరంగారిని కలిశాను. ఆయన నన్ను సేలంలో మోడ్రన్ ఆర్ట్ థియేటర్స్ స్టూడియోకు పంపించారు. వాళ్ళు నన్ను చూడగానే, 'మీరు పేరొందిన స్టేజీ ఆర్టిస్టు, మీకెలాంటి టెస్టూ అవసరంలేదు సార్!' అని పంపేశారు. నాలుగైదు రోజులకు సుందరంగారు ఉత్తరం రాశారు. 'నెలకు 100 రూపాయలు జీతం. భోజనం,

టిఫిన్, మకాం సదుపాయాలన్నీ మోడ్రన్ థియేటర్స్‌వారే సమకూరుస్తారు, దర్శకుడు యస్.డి. లాల్‌గారు చెప్పినట్టు నడుచుకోండి' అని వివరంగా రాశారు.

### తొలి చిత్రంలో పదిపాత్రలు!

'సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి' నా తొలి చిత్రం. షూటింగ్ సమయంలో రాజనాలగారు నన్ను దశావతారం అని నిక్‌నేమ్‌తో పిలవడం మొదలెట్టారు. తీరా చూస్తే ఆ చిత్రంలో నేను పది రకాల పాత్రలు పోషించాను. ఇది నాకు గర్వకారణం. నా రెండవ చిత్రం 'అన్నా చెల్లెలు'. నాటు వైద్యుడి పాత్ర. ఇది కూడా బాగా క్లిక్ అయ్యింది. ఈ రెండు చిత్రాలు 1960లో ఒకేసారి విడుదలై నాకు మంచిపేరు తెచ్చాయి. అదే సమయంలో ఎస్.డి.లాల్‌గారు తనకు అసిస్టెంట్ డైరెక్టర్‌గా ఉండమనడంతో ఒప్పుకోక తప్పలేదు. అదే 100 రూపాయలు జీతం. సినిమా ఆఫర్లు వచ్చి మీద పడుతున్నా రెండేళ్లు ఆయన దగ్గరే చేశాను.

### మా భూమి

నేను వేసింది చిన్న వేషాలైనా దర్శకులు నాకు సంతృప్తికరమైన పాత్రలే ఇచ్చారు. అవే నాకు గుర్తింపు తెచ్చాయి. రాముడు-భీముడు చిత్రంలో కార్మికుడి వేషం, కానిస్టేబులు కూతురు చిత్రంలో హీరోయిన్ మేనమామ పాత్రలకు మంచి ఆదరణ లభించింది. బి.ఎన్.రెడ్డిగారి దర్శకత్వంలో వచ్చిన 'రంగులరాట్నం', 'బంగారు పంజరం' చిత్రాల్లో పాత్రలు నాకు పూర్తి సంతృప్తినిచ్చాయి. ఇవే కాకుండా నా కెరీర్‌లో శిఖరాయమానమైన చిత్రం 'మా భూమి'. ఈ చిత్రంలో కథానాయకుడి తండ్రివేషం. బాపూగారి 'తూర్పువెళ్ళే రైలు' చిత్రం కూడా నాకెంతో సంతృప్తినిచ్చింది.

### శ్రీశ్రీ అభినందన

రావికొండలరావుగారి 'పట్టాలు తప్పిన బండి' నాటకంలో టెలిఫోన్ మావయ్యగా నా పాత్రకు ఉత్తమ హాస్య నటుడు అవార్డు లభించింది. నేను కామెడీ ఆర్టిస్టును కాకపోయినా, పాత్ర స్వభావం గ్రహించడం వల్ల సక్సెస్ అయ్యాను. బి.ఎన్.రెడ్డిగారి రంగులరాట్నం చిత్రంలో నాకు అవకాశం రావడానికి ఈ పాత్రే నాకెంతో దోహదపడింది. కొండెపూడి లక్ష్మీనారాయణగారు తెలుగులోకి అనువదించిన రష్యన్ నాటకం 'అలెగ్జాండర్ ఫోట్కిన్'. దీనికి నేనే దర్శకత్వం వహించి 1972లో మద్రాసు ఆంధ్రా కల్చరల్ క్లబ్‌లో ప్రదర్శించా. నాది లెనిన్ పాత్ర. శ్రీశ్రీ, గుమ్మడి, రామిరెడ్డిగార్లు ప్రేక్షకుల్లో కూర్చున్నారు. నాటకం పూర్తయ్యాక శ్రీశ్రీగారు గ్రీన్‌రూమ్‌లోకి వచ్చి, నాటకం బాగుంది, కానీ పొడుగు లెనిన్..! మరి ఆయన పొట్టిగా ఉంటాడు కదా! అని ఛలోక్తిగా అన్నారు. అంతటి మహాకవి అభినందనతో నాకు కొండంత బలం వచ్చింది. ఇంతమంచి నాటకం ఈ మధ్యకాలంలో రాలేదంటూ పత్రికలు కూడా ప్రశంసించాయి. అదే విధంగా రమణమూర్తిగారి దర్శకత్వంలో 'గాంధీ జయంతి' నాటకంలో ఉత్తమ సహాయనటుడుగా నాకు నంది అవార్డు లభించింది. ఇంకా ఎన్నో సంస్థలు అవార్డులిచ్చి సత్కరించాయి.



నవ్య వీక్లీ చదువుతూ



సన్మానం స్వీకరిస్తూ..

### సినిమా సినిమాగా ఉండాలి

సినిమా ఎలా ఉంటే బాగుంటుందనే ఉద్దేశంతో ఈ మధ్య నందగోపాల్‌గారు 'సినిమాగా సినిమా' అనే పుస్తకం రాశారు. సినిమా సినిమాగా ఉంటే చాలని నేననుకుంటాను. చలనచిత్రం అంటే కదిలే చిత్రం. అంటే లెస్ డైలాగ్స్, మోర్ పిక్చర్. 'కినిమా' అనే మాటకి పురోగమనం అని అర్థం. అందువల్ల ఇక్కడ సినిమా అంటే కూడా పురోగమనమనే అర్థం చెప్పుకోవాలి. ఏ కథ అయినా మానవజాతి పురోగమనానికి దోహదపడాలి. దీన్ని పిక్చర్‌తో ఎలా చెప్పినా అది ప్రజా చైతన్యమే. సినిమాల్లో హీరోని ఆకాశం మీద కూర్చోబెట్టే పద్ధతిని వదిలేస్తే మంచిదనుకుంటున్నాను.

### గ్లామర్ ఓరియంటేషన్

ప్రస్తుతం చిత్ర పరిశ్రమ కథాబలం, దర్శకత్వం, సంగీతం వంటి నాణ్యతా ప్రమాణాల స్థాయి నుంచి గ్లామర్‌వైపు పరివర్తన చెందుతోంది. పాతకాలంలో, గ్లామర్‌కి ప్రాధాన్యమిస్తూ, కథాబలానికి, సంగీతం, దర్శకత్వ ప్రమాణాలకు విధేయులై ఉండేవాళ్ళు. అందువల్ల 50, 60 దశకాల్లో అపురూపమైన చిత్రాలు వచ్చాయి. రంగులరాట్నం, బంగారు పంజరం, రాముడు-భీముడు, కథానాయకుడు, బడి పంతులు, బాపూ, విశ్వనాథ్, నాగిరెడ్డి, చక్రపాణి సినిమాలన్నీ వర్క్ ఓరియంటేషన్ చిత్రాలు. గ్లామర్ ఓరియంటేషన్‌కి వచ్చేసరికి క్వాలిటీ దిగజారింది. కథాకథనంతో పాటు అర్థవంతమైన, ఉత్తమ లక్షణాలన్నీ వెనక్కి పోయాయి. రాను రాను హీరో చుట్టూ కథలల్లి గ్లామర్‌ని ఆకాశానికెత్తడం వల్లే ఎక్కువ సినిమాలు ఫ్లాపవుతున్నాయి. ఈ ధోరణి మారితే పరిశ్రమ కొంతైనా మెరుగుపడుతుంది. దర్శక నిర్మాతలు సూక్ష్మంగా ఆలోచిస్తే ఇలాంటి పరిస్థితి రాదనుకుంటున్నా.

### దర్శకుడికి నటుడు విధేయుడై ఉండాలి

సినిమాకి దర్శకుడే మార్గదర్శకుడు. దర్శకునికి నటుడు విధేయుడై ఉండాలి. అప్పుడే వాళ్ళు మంచి నటులుగా ముద్రపడతారు. ఈ విధంగా ఎక్స్‌ట్రార్డినరీ క్వాలిటీస్‌లో మరచిపోలేని నటులు మనకు ఉన్నారు. జంధ్యాల గౌరీనాథశాస్త్రి, సిఎస్ఆర్ ఆంజనేయులు, ఎస్.వి.రంగారావు.. ఇలాంటివారు పాత్రలో ఒదిగిపోవటం తప్ప నటించేవారు కాదు.

### హాస్యం అపహాస్యం

పాతకాలంలో కమెడియన్‌కంటే ముందు హీరో స్థానం సంపాదించుకున్నవాడు శివరావు. తర్వాత కమెడియన్‌గా సక్సెస్ అయ్యాడు. చలం హాస్యం గమ్మత్తుగా ఉంటుంది. డైలాగ్‌తోనే కామెడీ, శరీరం కదలించేవాడు కాదు. మళ్ళీ పద్మనాభంతో మొదలైన హాస్యం రాజబాబుతో పతాకస్థాయికి వెళ్ళింది. తర్వాత అది రాను రాను అపహాస్యమైంది. ఇక నగేష్ హాస్యంలో జెర్రీతోయిస్ కనిపిస్తాడు. కానీ ఎక్కడా అనుకరణ కనిపించదు. ప్రస్తుతం క్యారెక్టరైజేషన్ కామెడీకన్నా నటులు చేసే కామెడీయే ఎక్కువగా కనిపిస్తోంది. మోతాదు మించిన ఈనాటి హాస్యం అపహాస్యమవుతోంది.

ఈ మధ్య తనికెళ్ళ భరణి 'మిథునం' చూశాను. ఆనందం కలిగించింది. అన్యోన్య దాంపత్య విధానాన్ని ఎంతో చక్కగా చిత్రీకరించారు. హాల్లో సినిమా చూసి చాలా సంవత్సరాలైంది. చూడాలనిపించే సినిమాలు రావట్లేదనే చెప్పాలి. ఎక్కువ చిత్రాలు చూడటం లేదు గనుక ఈ మధ్య చిత్రాల గురించి మాట్లాడే హక్కు నాకు లేదు.

*-కె.హరనాథ్, సెల్: 97035 42598*

# ఇవన్నీ నిజాలే!

### కుక్కకు శిలావిగ్రహం

A బెల్‌గ్రేడ్ జంతుప్రదర్శనశాలలో ఉండే జర్మనీ గొర్రెల కాపలా కుక్క ఒకటి చిరుతపులితో భీకరపోరాటం చేసి దాన్ని తరిమికొట్టింది. అంతేకాదు, జూ ఉద్యోగి ప్రాణాలూ కాపాడింది. దాంతో ఆ కుక్క హీరో అయిపోయింది. జూలో దాని శిలావిగ్రహం కూడా ప్రతిష్ఠించారు.

•••

A ది డార్క్ నైట్ (2008) చిత్రంలో జోకర్ పాత్రధారి Heath Ledger షూటింగ్ ప్రిపరేషన్ కోసం నెలరోజులపాటు ఒక్క అడుగు కూడా బయటపెట్టకుండా హోటల్ రూమ్‌లోనే ఉండి శిక్షణ తీసుకున్నాడు..

•••

A కాకతీయుల కాలంలో ఎన్నో కోటలు ఉండేవి. వాటి లెక్క కచ్చితంగా తెలియకపోయినా కొందరు ఆ ప్రయత్నం చేశారు. మల్లగుల్లాలుపడి 72 - 77 కోటలున్నాయని లెక్కలు కట్టారు.

•••

### అదో తుత్తి!

A రెండవ ప్రపంచయుద్ధకాలంలో జపనీయులు ద్వేషభావంతో రగులుకుపోయేవారు. అమెరికా సైనికుల పుర్రెలు, ఇతర ఎముకల భాగాలు సేకరించి వాటిని ట్రోఫీలుగా, టేబుల్ ఆర్టికల్స్‌గా ఉపయోగిస్తూ తృప్తిపడేవారు.

•••

A గాయాలకు చక్కెర రాస్తే, అవి తొందరగా మానిపోతాయి. గాయం ఉన్న చోట వేగంగా కణజాలం అభివృద్ధి చెందడంతోపాటు బాక్టీరియా పేరుకుపోకుండా తొందరగా ఎండిపోతుంది.

•••

A పాతికేళ్ళ యువకుల్లో ఆత్మహత్యాయత్నం చేసే ప్రతి 100 మందిలో ఒకరు మరణిస్తున్నారు.

•••

### కొలంబస్ శిక్షలు

A చిన్న చిన్న నేరాలకు పాల్పడిన వారికీ, తన అధికారాన్ని గౌరవించనివారికీ కూడా క్రిస్టోఫర్ కొలంబస్ చెవులు కత్తిరించడం, నాలుక కత్తిరించడం, ముక్కు కోసేయడం లాంటి శిక్షలు విధించేవాడు.

•••

A సోమరిగా మూలపడున్న ఖడ్గమృగాన్ని రెచ్చగొట్టి చూడండి. గంటకు 30 మైళ్ళ వేగంతో వెంటపడి మనల్ని తరుముకొచ్చి తన సత్తా చూపిస్తుంది.

•••

A యవ్వనంలో ఉన్న ప్రతీ ముగ్గురు అమెరికన్ బాలికల్లో ఒకరు తమ డేటింగ్ భాగస్వామి కారణంగా శారీరక, భావోద్వేగపూరిత దాడులకు లేదా తీవ్రమైన దూషణలకు గురవుతున్నారు.

•••

A ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన పిరమిడ్లు నేటికీ మంచులాగా తెల్లగా ఉండటానికి గల కారణం, తళతళ మెరిసిపోయే సున్నపురాయి పూత ఆ పిరమిడ్లకు పూయడమే.

-చిన్నారి

## సుధామ పదగారడి-276

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | | 2 | 3 | | 4 | | 5 |
| 6 | | | 7 | | | | | |
| 8 | | 9 | | | | 10 | | |
| | | 11 | | | 12 | | | |
| 13 | 11 | | | | | 14 | | 15 |
| | | 16 | | | 17 | | | |
| 18 | | | | 19 | | 20 | | |
| | | | 21 | | 22 | | | |
| 23 | | | | 24 | | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. కృష్ణుడి బర్త్‌డే (4)
4. ఒక నది రాధాకృష్ణులకు ఇష్టం (3)
7. పాపము (3)
8. గత్తర (3)
10. దీని పట్టుగొప్పది (3)
11. బ్రహ్మ (2)
12. పెద్ద నీటిపాత్ర (2)
13. క్లుప్తాక్షరాల్లో శివరామకృష్ణ (3)
14. స్మరణము తోడిది దైవసంబంధియే! (3)
16. అటుగా దాహము (2)
17. అటుగానే ఉపాయము (2)
18. ప్రపంచపు అతిపెద్ద ఐకేర్ నెట్‌వర్క్, సినిమాల మనిషి కూడాను (3)
20. పిసినారి (3)
21. ఆడకుక్క (3)
23. రజనీకాంత్ సరికొత్త సంచలన చిత్రం (3)
24. బహుమతి, అవార్డు (4)

**నిలువు**

2. ప్రసిద్ధ చతుష్టయం ముందు పదం తలక్రిందయింది. (2)
3. లవంగం కాదు మరో ఘాటైనది (3)
5. కౌను (3)
6. అంకెల సమూహం (4)
9. సెప్టెంబర్ 5 ఈయన జన్మదినంగా ప్రసిద్ధం. సర్వేపల్లి వారు (5)
10. టీచర్స్ (5)
15. అడుగునుండి బియ్యం (4)
18. ఉపయోగము, వ్యవహారము (3)
19. తలక్రిందయిన పట్టణం (3)
22. యంత్రము (2)

### పదగారడి-275 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప్రాం | తీ | య | ము | | అ | కా | డ | మి |
| గ | | శో | | గా | | టు | | దు |
| ణ | ర | ద | | య | | క | చ్చి | క |
| ము | | | పు | త్రి | క | | | ట్టు |
| | ప్ర | స | న్న | | సా | హి | త్యం | |
| కో | | | మి | రా | యి | | | ఉ |
| టి | కా | లు | | కూ | | త | మా | షా |
| శ్వ | | కు | | ర | | లా | | రా |
| రి | దా | లో | త | | వి | రి | బో | ణి |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

